# పీఠిక.



అయ్యలారా!

శ్రీమంతంబగు మన యాంధ్రదేశంబునందు మిశ్రప్రబంధంబులు లెక్కకుమిక్కుటంబై యున్నవి. అయినను నన్ను నొక్కప్రబంధంబు రచియింపవలసినదని నాయొక్క ఆబాల్యస్నేహితులును, ఉభయభాషాపండితులును అగు బ్రహ్మశ్రీ, అయ్యలసోమయాజుల - గణపతిశాస్త్రిలును, బ్రహ్మశ్రీ, గంపె - లక్ష్మీనరసింహభక్తయును, బ్రహ్మశ్రీ, నవుడూరి-జగన్నాథశాస్త్రిలును, ప్రోత్సాహ మొసర్చినందున, అసమర్థుండనయ్యును నానేర్చినసహజపాండిత్యంబుచే దెలిసినంత వరకు శివకథాసుధారసంబను పేర పార్వతీవివాహంబును, కుమారజననంబును, తారకవధంబును దేవసేనాపరిణయంబునుగల యీ కృతి రచియించినాఁడ. ఇయ్యది ప్రప్రథమంబుగాన ప్రమాదవశంబునఁ గొన్నియెడలను, లక్ష్యలక్షణపరిశీలనాపాటవంబు కొఱవడుటంజేసి కొన్నియెడలను, దోషంబులు పెక్కులు గానంబడుచున్నను; పండితులును, రసికులును సారంబును గ్రహించి సంతసింతురను ధైర్యంబునఁ బ్రకటింప సమకట్టియుంటిని. ఇంతలో నాపాలిదైవంబు నాకుఁదోడై పెద్దాపురవాసస్థులును, శ్రీ శ్రీ శ్రీ జయపుర సంస్థాన న్యాయవాదులు నగు బ్రహ్మశ్రీ, కొల్లూరి-సోమయాజులుపంతులుగారు ముద్రణంబునకు వలయుధనంబు నొసంగినందున ప్రకటీకృతంబయ్యెను.

నన్ను గ్రంథరచనకుఁ బ్రోత్సాహ మొనర్చినవారును, గ్రంథముద్రణమునకు ధనసహాయము చేసినవారును నాకృతజ్ఞతాపూర్వక వందనంబులకు బాత్రులయ్యెదరు. ద్వితీయముద్రితకాలమునం బ్రమాదాది జనితదోషములం బరిత్యజించెద.

కృష్ణారాయపురం
అగ్రహారము.
1904 వ సం.

ఇట్లు,
☞ గ్రంథకర్త.

# కృతిప్రశంస.



పాయంపాయం శివకథా సుధారస మహాంబుహా।
దేవానామస్తి పీయూష మిత్యేర్ష్యా మర్త్యజం నిజాం॥

ధినోతికవితా కాపి లక్ష్మీనారాయణస్యనః।
స్మారయంతీ కవీ౯ప్రాచో నన్నయ ప్రభృతీనపి॥

నటేశ్వరజటాతట భ్రమదవభ్ర వేగోచ్ఛల
త్స్వపర్వతటినీ ఝరీ తులిత భారతీ డంబరః।
శిరశ్శ్రివణ ధారిణాం ప్రతిపదం బలాచ్ఛ్వాలయ
న్నయం కవికులోత్తమో భువివిభాతి నారాయణః॥



శ్రీకావ్యకంఠ బిరుదాంకిత సత్కవీంద్రో
వామార్ధజాని చరణాంబుజ చిత్తభృంగః।
కౌండిన్యగోత్ర తిలకో నరసింహసూను
ర్మేధానిధి ర్గణపతి ర్వరమాబభాషే॥





కల్యాణంకేలయంతో దిశిదిశి నమతో మానినో లాలయంత
స్త్రైలోక్యం పాలయంతో వినతజనవిపజ్జాల మున్మూలయంతః
కారుణ్యం శీలయంతో దనుసుతస్పృతనా చిత్త మాందోలయంతో
లాలాటాక్షైః క్రియాసుశ్శివ మభిమతత్యాగదక్షాః కటాక్షాః॥



కల్యాణంకీలయంతో దిశిదిశి నమతో మానినో లాలయంత
స్త్రైలోక్యం పాలయంతో వినతజనవిపజ్జాల మున్మూలయంతః
కారుణ్యం శీలయంతో దనుసుతపృతనాచిత్త మాందోలయంతో
లాలాటాక్షేః క్రియాసు స్తవ శ మభిమతత్యాగదక్షాః కటాక్షాః॥

శ్రీ

# శుద్ధాశుద్ధపత్రిక.

| పుటసంఖ్య | పద్యసంఖ్య | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 2 | గావు | కావు |
| 1 | 3 | నాకధునిప్ర | స్వర్ధునితీవ్ర |
| 2 | 8 | దలంతువీరహనూ | దలంచెదఁహనూ |
| 3 | 10 | గ్రమము | క్రమము |
| 3 | 10 | నర్థసం | యర్థసం |
| 3 | 10 | గొనఁగ | కొనఁగ |
| 3 | 11 | నిడుకుని | నిడికొని |
| 4 | 19 | ముజేతు | మొనర్తు |
| 5 | 22 | బుట్టుగ | బుట్టుక |
| 5 | 22 | యేజగం | ఏజగం |
| 8 | 42 | యేచాన | ఏచాన |
| 8 | 42 | చల్లి | చెల్లె |
| 10 | 52 | వినుగాదెఁజగతి | వినరెయిజ్జగతి |
| 12 | 63 | బొగడుచు | పొగడుచు |
| 12 | 65 | యిరువురు | నిరువురు |
| 12 | 66 | రాల | జాల |
| 14 | 81 | వంచుకుని | వంచుకొని |
| 15 | 81 | లేకఁగల | లేకకల |
| 15 | 82 | సన్మాన | సమ్మాన |
| 16 | 92 | శ్వేద | స్వేద |
| 20 | 106 | గోరెంక | గోర్వంక |
| 20 | 107 | జేసు | జేసి |
| 21 | 110 | దొడంగె | దొడింగె |

| పుటసంఖ్య | పద్యసంఖ్య | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 21 | 112 | యోచన | యోజన |
| 24 | 134 | మనసుబాధ | మనభయంబు |
| ,, | 136 | పల్లవాధరి | పల్లవాధర |
| 25 | 140 | కనేకజోహారు | కిఁబెక్కుజోహారు |
| 27 | ,, | కేకలిడుపీచుక | కేకలిడుచుపీఁక |
| ,, | ,, | గూర్చుని | గూర్చుండి |
| 28 | 141 | బాంధ | బాంథ |
| 29 | 151 | వేతునంత | వేయుదంత |
| 30 | 157 | దోడ్చు | దోడు |
| 31 | 167 | లేకఁజోద్యం | లేకచోద్యం |
| ,, | 168 | లేకఁదము | లేకతము |
| 32 | 172 | నుదిటి | నుదుటి |
| 33 | 175 | శిష్ఠ | శిష్ట |
| 34 | 177 | నాయకి | నాయిక |
| ,, | ,, | నిష్ఠా | నిష్టా |
| 37 | 4 | లేకఁబ | లేకప |
| 41 | 21 | బోవు | యేగు |
| 43 | 29 | జెలింపని | జలింపని |
| ,, | ,, | కందించు | కందిచ్చు |
| 44 | 33 | లేకనుబికం | లేకయోపికం |
| 46 | 41 | నెఱిఁగి | యెఱిఁగి |
| 48 | 50 | నీకదెపుడు | నీకునెపుడు |
| 49 | 56 | లేదోఁ। బ | లేదో। ప |
| ,, | 57 | బఱపుయభంగ | బఱపునభంగ |
| 50 | ,, | భ్రమఁబడి | భ్రమపడి |
| 52 | 58 | నేమిఁజేయుదు | నేమిచేయుదు |

| పుటసంఖ్య | పద్యసంఖ్య | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 52 | 58 | యొనర్చెద | యొనర్తును |
| ,, | ,, | వేడెద | వేడుదు |
| ,, | 59 | నొక్కతెయు | నొక్కతెయ |
| ,, | 61 | శీమంతిని | సీమంతిని |
| 53 | 65 | గానకఁజింతి | గానకచింతి |
| ,, | 66 | దేమిటిఁజేయు | దేమ్మికసేయు |
| 54 | 71 | లేకనీ | లేకయీా |
| 55 | 78 | మనలకు | మనకును |
| 57 | 90 | గ్రోవి | క్రోవి |
| ,, | ,, | జాన | చాన |
| 58 | 96 | గుసుమ | కుసుమ |
| ,, | ,, | గాన | కాన |
| 59 | 100 | కలింబై | కలితంబై |
| ,, | 103 | గేళియొనర్చెద | గేళినసల్పెద |
| 60 | 104 | గంచలల్గుదియ | గంచెలల్గదియ |
| ,, | ,, | లోపలకు | లోపలికి |
| ,, | 110 | జన్కని | జక్కని |
| 61 | 112 | ఆగజ | అగజ |
| 62 | 123 | వారిచరి | వారిచర |
| 63 | 127 | జరుహ | జలరుహ |
| 64 | 139 | బడుయామనః | బడునామనః |
| 68 | 4 | ధూరీకృత | దూరీకృత |
| ,, | 7 | ముండెను | ముందును |
| 69 | 15 | గువలయేశుని | గువలయేషుని |
| ,, | 17 | మేలపున్మాట | మేలమామాట |
| 70 | 20 | యమ్మ | అమ్మ |

| పుటసంఖ్య | పద్యసంఖ్య | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 71 | 21 | విడచెఁ | విడిచెఁ |
| 72 | 26 | నెదుటఁ | యెదుట |
| ,, | 27 | నెఱుకల | యెఱుకల |
| ,, | 28 | గూర్చుండునెఱుకత | గూర్చున్నయెఱుకత |
| 75 | 41 | యెలనాగ | నెలనాగ |
| ,, | 43 | తల్లి | తొల్లి |
| ,, | ,, | వైరైరి | లైరైరి |
| 77 | 51 | జేయు | చేయు |
| 81 | 68 | లేకఁబేదలై | లేకపేదలై |
| 84 | 85 | నంతసిల్ల | సంతసిల్ల |
| 87 | 106 | యళితి | యళీఁది |
| 89 | 114 | సన్నుతా | సన్నతా |
| 91 | 129 | గుణశాలి | గుణయుత |
| 96 | 164 | జత్కుఁశ్రవేంద్ర | జత్కుశ్శ్రీతేంద్ర |
| 102 | 201 | నెన్నఁడు | యెన్నఁడు |
| ,, | ,, | నన్నగ | యన్నగ |
| 111 | 256 | దిరిఁగిన | దిరిగిన |
| 114 | 4 | కేలఁజెప్ప | కేలచెప్ప |
| ,, | 5 | మారుఁబ్రేమ | మాఱుప్రేమ |
| ,, | ,, | గలుగ | కలుగ |
| ,, | ,, | మీఱు | మీరు |
| 115 | 6 | దీరునోఁదెలియ | తీఱునో తెలియ |
| 116 | 19 | లుండెనోఁ। దద్దయు | లుండెనో। తద్దయు |
| 119 | 36 | నరయు | యరయ |
| 138 | 54 | లాడఁగి | లాడఁగను |
| 139 | 59 | భటుల్బ్బజ | భటుల్బ్బజ |

| పుటసంఖ్య | పద్యసంఖ్య | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 139 | 59 | ఖడ్డ | ఖడ్గ |
| ,, | ,, | బదాఘు | బదాఘు |
| ,, | ,, | జేయు | జేయ |
| 142 | 77 | తస | తన |
| 152 | 28 | నిలాధర | నిలాధరరాజ |
| 185 | 94 | గొంఱు | గొందఱు |
| ,, | 95 | భుజింయించు | భుజియించు |
| ,, | ,, | మద్దుకూఁతు | ముద్దుకూఁతు |
| 186 | ,, | కన్నతల్గి | కన్నతల్లి |
| 192 | 132 | భార్యయును | భార్యతో |
| ,, | 132 | లగుచు | ఁడగుచు |
| 193 | 134 | నింజమందిరంబు | నిజమందిరంబు |
| ,, | 138 | విమలమతులా ! | విమలమతులార! |
| 195 | 146 | ఁబ్రోవ్రుఁడంచు | ప్రోవ్రుఁడంచు |
| 196 | 154 | జెప్పుచు | సెప్పుచు |
| 199 | 176 | ఓధణీధ్రజాత ! | ఓధరణీధ్రజాత! |
| ,, | ,, | జేవురించఁగాఁ | జేవురింపఁగాఁ |
| 205 | 204 | మహేంమయంబును | హేమమయంబును |
| 208 | 9 | ఁదిరుగాడు | తిరుగాడు |
| 209 | 15 | యే। కలముల | నే। కలముల |
| ,, | ,, | యొ। ల్గుల | నె। ల్గుల |
| 211 | 27 | సీడ్చుకొని | సీడ్చికొని |
| 212 | 32 | ఁజేయంగ | సేయంగ |
| 214 | 43 | చిదిపిరాళ్లను | చిదిపిబాళ్లను |
| 219 | 82 | వీడుఁగూకటివేళ్లతో | వీటఁగూకటివ్రేళ్లతో |
| 221 | 101 | విన్నవింప | విన్నపింప |

| పుటసంఖ్య | పద్యసంఖ్య | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 221 | 109 | నిఁక నేలెద | యిఁక నేలెద |
| 224 | 120 | నింకొక్క | యింకొక్క |
| 226 | 137 | దగనప్పుడేనతఁడు | తగనప్పుడేయతడు |
| 227 | 147 | యగ్నినఖుండతి | యగ్నిసఖుండతి |
| 231 | 168 | బెక్కురథికులు | బెక్కురథికులు |
| 232 | ,, | నెదురనిలచి | నెదురనిలిచి |
| 252 | 310 | మపృష | మప్పృష |

presented in memory of
[illegible]
M.V. Subbarao



శ్రీరస్తు.

శ్రీరామాయనమః.

శ్రీమహాగణాధిపతయేనమః.

శ్రీశారదాంబాయైనమః.

# శివకథాసుధారసము.

## ప్రథమాశ్వాసము.

వందామహే మహాదేవం యస్యవందారవృందజనాః।
నవిందంతిపునర్మాతుః కుచకుంభపయోరసమ్॥



శ్రీ కమ్రక్షితిజాననాబ్జచల విస్మేరేక్షణేందిందిరుం
బాకారిప్రముఖామరాళి మకుటప్రాంచన్మణీదీప్తప
ద్మాకారాంఘ్రియుగుఁ సమస్తజగదేకాధారు క్షేమంకరుఁ
రాకాచంద్రనిభాననుఁ వరదు శ్రీరాముఁ బ్రశంసించెదన్. 1

ఉ॥ శ్రీమహిళాస్వరూపిణి ప్రసిద్ధమహోత్పల మంజుపాణి యా
భూమినిఁగల్గుపుణ్యులకు భూరదయామతితోడఁ గోరికల్
ప్రేమనొసంగుతల్లి నినుఁబ్రీతినుతింతు నుతాంగవల్లి శ్రీ
రామునికాంత మత్కృతిని రమ్యముగాఁ గృపఁజూచిగావుమీ. 2

ఉ॥ ఆగిరిరాట్కుమారికి మహాకృపచే నరమేనొసంగ న
న్నీగతిఁగేశపాళి నిడుకేమని నాకధునిప్రకోపమై
యేగఁదలంపఁజూచి యిదియేమనియామెకు నున్నదేహముం
బాగుగనిచ్చులీలసితభాయుతుఁడైన గిరీశుఁ గొల్చెదన్. 3

సీ॥ గురువర్ణ లఘువర్ణ పరిశీలనము లేక క్రమముగా మంచిలక్షణము లేక
విశ్రమస్థానముల్ వోలయంగఁ గనలేక మాటలకొక నియమంబు లేక
సుశ్లోకసంగతి సూటిఁగాఁ గనలేక వెలయు ప్రబంధముల్ దెలియలేక
చరణముల్ బొత్తుగాఁ బరిఢవిల్లుట లేక కర్తృకర్మక్రియాగతులు లేక॥

నర్థసంగ్రహమున కడియాసఁ బడుచు
ధూర్తజనముల మదికి సంతోషముగను
వసుధఁ బరలెడు కులటల వడువు దోఁపఁ
గొఱలు కుకవికృతుల లెక్కఁగొనఁగ నేల. 10

వ॥ అని యివ్విధంబున నిష్టదేవతాప్రార్థనంబునుఁ బూర్వకవీంద్ర సంస్మ
రణంబును నవీన కవినిజనానుసరణంబును భావికవిబహూకరణంబునుఁ
గుకవిత్వనిరాకరణంబును గావించి యొక్క పుణ్యకథారత్నంబు రచింపఁ
బూని శ్రీరామచంద్రుని మనంబున నిడుకొని కుతూహలాయత్త చిత్తుం
డనై యున్న యెడ నొక్క నాఁడు నిశాసమయంబున. 11

సీ॥ ఆశ్రితజనమానసాంబుజాతచరిష్ణు లాలితకౌస్తుభాలంకరిష్ణుఁ
బృథునీలమణినీలఘృణిజాలరోచిష్ణు క్రతుభుగరాతిసంస్తూతజిష్ణు
శతపత్రమిత్రవంశజన్మపాలనసహిష్ణు ఖండితసంసారగహనతృష్ణు
త్రిభువనరక్షణోదీర్ణభాగనధిష్ణు తతసచరాచరాంతరభవిష్ణు॥

ప్రణుతమహానిదర్శిష్ణు సద్గుణాగమిష్ణు
విమలలోకైకవర్ధిష్ణు విష్ణుధృష్ణుఁ
బూర్వభవసముపార్జిత పుణ్యమునను
స్వప్నమునఁ గంటి డెందంబు సంతసింప. 12

వ॥ ఇట్లు ప్రసన్నుండైన దినకర కుల రత్నాకర పూర్ణచంద్రుండగు శ్రీ
రామచంద్రుని దివ్యమంగళ విగ్రహంబు సందర్శించి కంటకితపుల
కాంచిత శరీరుండనై యానంద పయోధి తరంగంబుల నోలలాడుచు
ననేక సాష్టాంగనమస్కారంబులాచరించి యిట్లని వినుతించితి. 13

గీ॥ ఖలతతికి సూఁడ కౌసల్య కన్నవాఁడ
శూలిచెలికాఁడ జనకజ పాలివాఁడ
యేను నీవాఁడ భక్తుల నేలువాఁడ
వేగనన్నుఁబ్రోవు దయతోడ వేల్పుఱేఁడ. 14

సీ॥ శ్రీకరంబుగజగత్సృష్టిఁగావింపంగఁ దగురూపుఁదాల్చినధాతవీవ
ఘనముగాఁబ్రాణిచేఁగర్మలుసేయింప విశ్వరూపముదాల్చువిష్ణువీవ
జగములెల్లననేకగుణములనడగింప భీమాకృతినిదాల్చుస్వామివీవ
భక్తసందోహవాంఛితార్థంబులవసించుప్రణవస్వరూపియౌబ్రహ్మమీవ
బ్రహ్మవిష్ణుభీమ పరదేవతాత్మవై
వెలయునీమహిమ వినుతిఁజేయఁ
జలువతేనికైన నలవిగానేరదు
రమ్యసుగుణసాంద్ర రామచంద్ర. 15

వ॥ అని యివ్విధంబున నుతించుచున్న నన్నుం గరుణామృత శీతలకటాక్షంబుల వీక్షింపుచు గంభీర మృదుమధుర భాషణంబుల నిట్లనియె. 16

గీ॥ ధాతలకుధాత విశ్వనేతలకు నేత
త్రాతలకుఁద్రాత మహిని దాతలకుదాత
భూతలధరజామాత యాభూతనేత
నేత యన్మూర్తియుండఁగా బ్రీతినేత. 17

వ॥ శివకథాసుధారసంబను మహాప్రబంధంబు నవద్యహృద్యగద్యపద్యాత్మకంబుఁగా రచించి మదంకితంబు సేయుము శుభలాభదంబగునని యమ్మహాపురుషుం డంతర్ధానంబు నొందుటయు నంత మేల్కొని యానందరసకందళితమానసుండనై యమ్మహాపురుషుని ధ్యానింపుచు నిట్లని తలంచితి॥

గీ॥ పూర్వకవులెల్ల సర్వసంపూర్ణులగుటఁ
గృతులొనర్చిరి రామున కతిశయముగ
నేనొకకృతినిర్మింపఁ బూనియుంటిని
కర్పణముఁజేతు శశికమ్ర తార్పణగతి. 19

ఆ-వె॥ పానకంబుకన్నఁ బటికబెల్లముకన్నఁ
జేడెమోవికన్నఁ జెఱకుకన్న
నమృతధారకన్న నధికమాధుర్యంబు
శివునిపరమనామ చింతనంబు. 20

వ॥ కావున పార్వతీ పరమేశ్వరుల వివాహంబును, గుమారోత్పత్తియుఁ, దారకవధంబునుగల కథ శివకథాసుధారసంబను నామాంతరంబుగల మహా ప్రబంధంబుగ రచింపంబూని కవిసమయసిద్ధాంతాచారంబున మద్వంశక్రమం బించుక యభివర్ణించెద. 21

సీ॥ ఏరక్షకునిపానసారసంబులుగాపురంపు నీర్వానికబ్రంపుదెప్ప
యేమేటివేల్పుపేరెసఁదలంచినయంతఁ బుట్టుగ బలుత్రాటికట్టువీఁడు
నేపున్నెములగనియొలమినజాండము ల్పెనుబొజ్జలోపలనునుచుజోదు
యేజగంబులకుఁ జేఁడింపారనక్కనఁ బడఁతుకనిడివొక్కవన్నెకాఁడు॥
అట్టివిష్ణునాభి నజుఁడుబుట్టెనువాని
కంగిరుండునతని కమరగురుఁడు
నతనికుద్భవించె నలభరద్వాజుండు
నతనిగోత్రజాతుఁ డార్యయజ్వ. 22

సీ॥ మండలేశకిరీటమణిజాలరుచులచే నతిదీప్తపాదాబ్జుఁడార్యయజ్వ
పౌండరీకసమృద్ధిప్రబలప్రఖ్యాతుఁడై యలఘుయశశ్శాలియార్యయజ్వ
యఖిలపురాణేతిహాసనైగమరహ స్యార్థవిచక్షణుఁడార్యయజ్వ
వితరణోదారప్రవీణుఁడై మహిలోన నమరద్రుమముఁబోలునార్యయ (జ్వ॥
యఖిలసజ్జనస్తవనీయుఁడార్యయజ్వ
యమితగుణశాలిమాళియార్యయజ్వ
యట్టిశ్రీయార్యయజ్వాన్వయాబ్ధిచంద్రుఁ
డైనవేంకటయజ్వానలఘునెలమి. 23

గీ॥ అవనివాజపేయ మహార్హసవనకర్త
యాతఁడు గళింగమేదిని నలరుచున్న

విప్రులకు నెల్ల నెజ్జయై వినుతిఁగాంచెఁ
బరగనిర్జర వితతికి గురుఁడు వ్రాలె. 24

గీ॥ అగజశంభున కిందిరహరికి వాణి
పద్మయోనికిఁబోలెధ వానివాని
కరయఁబత్నియై గణపతి యజ్వఁబోలుతఁ
బిదపయజ్ఞేశ్వరాధ్వరిఁ బ్రీతిఁగాంచె. 25

గీ॥ లలితసారంగవదనంబు గలుగుటయునఁ
దనరఁగాభవానీసతి తనయుఁడగుట
విద్యలకునెల్ల మేటియై వినుతిఁగనుటఁ
గనఁగ గణపతి గణపతి యనఁగఁదగెఁడెః. 26

క॥ జలరుహభవునకుభారతి।జలరుహనాభునకులక్ష్మి నర్వేశునకుం
గులగిరిసుతచందంబున।సలరెగణేశునకు వీరమాంబ రమణియై. 27

క॥ ఆవనజాతాక్షికి సుతు। లేవురు జన్మించిరంమ హిమకిరణధర స
ద్భావుఁడు గౌరీపతి ధర। గో వెలసె భవానియందులోలుండగుచుఁ.

వ॥ తక్కిన వారెవ్వరనిన. 29

గీ॥ మహితయశుఁడు వీరేశ్వర మల్లయు వర భ
వాని శంకరాధ్వరియును భానురాజు
ణాచలేష్టి మల్లక్ష్మి నారాయణాఖ్య
యజ్వలల దివాకర తేజులనఘమతులు. 30

వ॥ అందు. 31

క॥ ఆశాంతగతుఁడును గత। క్లేశుండు భవానిధవ్యుఁడుఁ గీర్తియుతుండా
కాశీపతిఁగని జనులా। కాశీపతియితఁడనంగఁ గరమలరారుః. 32

గీ॥ అతని కిరువురు నందనులమితయశులు
నరసనయు వెంకనయునను పరమపుణ్యా
మహితులలరారుచురు హరిహరులఁబోలి
పరగ నరసన వీరమాంబను వరించె. 33

సీ॥ అనిశంబు భిక్షుగైఁ గొనునట్లుగాఁజేసెఁ బ్రాణేశుననుచు భవానిఁ దెగడి
సంతతంబునుఁబుణ్యజనులఁగారియఁ బెట్టఁ గాఁబంపువిభుననికమలఁగేరి
పంకజాతంబులోఁ బడునట్లుగాఁ జేసె నాత్మేశుననివాణి నపహసించి
గోత్రవిభేదంబుఁ గోరిసల్పఁగఁబంచె నిజనాథుననిశచిని నిరసించి॥

భంగయుతుఁ జేసె మగనిని గంగయవని
ననుచు నామెను గాదని యధికభక్తి
వల్లభున కొడగూర్చు వైభవము లెల్ల
వినుత సద్గుణనికురుంబ వీరమాంబ. 34

ఆ-వె॥ అమెగాంచె సుతుల నానంద మహితుల
సూరిజన వినుతుల సుగుణయుతుల
మహితధీసహితుల మానితచరితుల
నైదుగురనుఁ జెలఁగి యనఘమతుల. 35

సీ॥ తమసౌకుమార్యంబు ధరణిలోఁ బ్రసరింప
నరుదెంచు మదనసాయకములొక్కొ
తమదాన విఖ్యాతి ధరణిలో వెలయింపఁ
దరలివచ్చిన దేవ తరువులొక్కొ
తమ సత్ప్రభావసంతతిరూపులుగఁ దాల్చి
వచ్చుమహాభూత పంచకంబొ
తమ మహిమోన్నతు ల్ధరణిలో నుతికెక్క
నరుదెంచు రుద్రుని శిరములొక్కొ

యనుచుజనులెల్లఁ బలుకంగ ఘనముగాను
సౌకుమార్యంబువితరణసత్ప్రభావ
ములులసన్మహిమయుఁగల్గి మోదమునను
వరలుచుండుదు రేవురువైభవమున. 36

వ॥ వారెవ్వరనిన. 37

సీ॥ శాంకరీజీవితేశ్వరపాదజలజాత కింకరుండు భవానిశంకరుండు
విపులవాగైభవవిఖ్యాతిమహిత కాశీపతిఁబోలుకాశీపతియును
కలితకీర్తిశృంగనాగాధపరిష్వంగ శాశ్వతుండగునేక సర్వసుండు
విశ్వేశ్వరాస్థానపీఠవారాణసీ గృహనివాసుండువిశేశ్వరుండు॥
వారిజాననవాసవప్రముఖనిఖిల
విబుధకోటీరమండితవివిధరత్న
దీపితపదాబ్జుఁడౌమహాదేవమంత్ర
తత్వమగుసిద్ధుఁడరుణాచలేశ్వరుండు. 38

క॥ అనిశమువిబుధజనావళివినుతుండరుణాచలయ్యపెండిలియయ్యెన్
జననుతలక్ష్మీసోదరిమ్మనులలనామణినిఘనసమంచితబుద్ధిన్. 39

సీ॥ పతియర్ధదేహంబపహరింపకుండెనా శీతాద్రినుతదీటుసేయవచ్చు
వల్లభోరస్థలివసింపకుండెనా శ్రీకాంతసరియనిచెప్పవచ్చు
విభునిజిహ్వలుద్రొక్కి వెలయకయుండెనాభారతిసమయనిపలుకవచ్చు
నలగోత్రభేదిభార్యయుగాకయుండెనా బొరిపులోమజసాటిఁ బోల్పవచ్చు॥
గురునికామినితోరతిఁగోరుచంద్రుఁ
బొందకుండినరోహిణిఁబోలుపుమీరఁ
బోల్పఁదగుసీమెకనిజముల్భొగడవెలయు
లలితకచజితరోలంబలక్ష్మమాంబ. 40

ఆ-వె॥ భర్తకన్నమున్నుబరగలేకువచి పెలఁగిదంతశుద్ధిఁజేసిసదిని
స్నానమాచరించిదయ్యానదనయింటి కేగిపూజసలుపునిందిరకును.

సీ॥ ఏదేవిపెంపారనెలమిచేఁదన్మ్రపూగిద్దియపైనుండుముద్దరాలు
యేచానకలశాబ్ధివీచికాడోలికా కేళికాకలనరానిలుముటారి (రిత
యేకొమ్మయింపొందినోకుమారకలగొంగ యయ్యనసలకొనిచొక్కగ
యేజవ్వనిచిలుకతేజినెక్కెడుకౌతుఁ గడుపారవేడుకఁగన్నతల్లి॥
యట్టిజాబిల్లిచెల్లిస్వర్ణాంగవల్లి
కోర్కెలిడుతల్లితల్లిసద్గుణమతల్లి
భక్తసురవల్లియశమునఁబాలవెల్లి
కరుణవెదజల్లిజగములఁగన్నతల్లి. 42

క॥ అనియనిశముఁదనమనమున।ఘనముగసిరిఁబొగడిపొగడిగౌరీపూజ
న్మనముననుసలిపిబృందా।వనిపూజలుసేయుచుండుఁబటుతరభక్తిన్.
క॥ ఆయమతోడనుసరియే।యీయవనింగలుగుపడతులెల్లనుమఱియా
గాయత్రియుసావిత్రియు।నాయజురాణియుసరే మొయందురుజనముల్.
క॥ ఆమిథునమునకుఁబుట్టితి।మేముశుభాన్వితులమగుచునిలనలువురమా
రాముని భరతునిమఱియా।సౌమిత్రులఁబోలిసకలజనమునుతింపన్. 45
క॥ వరలక్ష్మీనారాయణుఁ।డుసుగుణుఁడగురామమూర్తియును శ్రీలక్ష్మీ
నరసింహంబప్పనయు న।ధరఁబరగునమఖిలసత్కదంబము పొగడన్. 46
వ॥ అందు. 47
శా॥అద్వైతజ్ఞుఁడనార్యయజ్వకులవిఖ్యాతుండఁ బ్రఖ్యాతభా
రద్వాజాఖ్యమునీంద్రగోత్రజుఁడ హేరంబాంబికాపాదప
ద్మద్వంద్వాంచితసేవకుండనురువిద్వన్మాన్యుఁడంధన్యుఁడన్
సద్వృత్తుండనులక్ష్మిపేతవిలసన్నారాయణాఖ్యాతుఁడన్. 48
గీ॥ నన్నయాదులకరణివిద్వన్నికరము
మెచ్చుగతిఁజెప్పలేకున్న మేల్మితోడఁ
గృతులొనర్చిరిగాదెలెక్కనకవీంద్రు
లెల్లఁదమకుఁదోఁచినగతినింతవరకు. 49
ఉ॥ పెద్దలొనర్చునట్టిపనిఁబిన్నలుసేయఁగఁడంగునట్టుమీ
గద్దరికావ్యరత్నములఁగాంచియశక్తుఁడనయ్యునట్లనే
గొద్దియొగొప్పజేయఁదొరకొంటినిసత్కవివర్యులారమీ
ముద్దులపట్టిమాటలకుముచ్చటఁబొందినరీతినెంచుఁడీ. 50
ఆ-వె॥ ఎవరికెంతబుద్ధినీశుఁడొసఁగెఁదొల్లి
నట్టిదగుచుఁగవితయులరుచుండుఁ
గానఁదప్పులున్నఁగరుణతోమన్నించి
సుజనులెల్లయొప్పుఁజూచుకొనుఁడు. 51

ఆ-వె. ఏలనందియంబులీశుండుమత్కృతి
వినకయున్నె? దాము బెంచినట్టి
చిలుకపలుకులెల్లఁ జెవియొగ్గివినఁగాదె
జగతిలోనిదొరలుసమ్మదమున. 52

శ్లో॥ కల్యాణంకీలయంతో దిశిదిశిసమతో మానినీలాలయంత
స్త్రైలోక్యంపాలయంతో వినతజనవిపజ్జాలమున్మూలయంతః
కారుణ్యంశీలయంతో నగపతిదుహితుర్మానసంచాలయంతః
కామారేర్వఃక్రియాసుఃకుశలమభిమత త్ర్యాగనేత్రాఃకటాక్షాః.

వ॥ అని సంతసంబున మహాదేవగురునకు నమస్కరించి. 53

## షష్ఠ్యంతములు.

క॥ రామునకుఁ రక్షితసుత్రామునకుఁ జనకజాభిరామునకును సం
ధామునకుఁ శాత్రవజనభీమునకున్నీలనీరదభృచ్ఛ్యామునకున్. 1

క॥ ధీరునకుం దీనజనాధారునకున్మానవావతారునకు శుభా
చారునకుఁ జారుతరాకారునకున్ శత్రుభటనగశతారునకున్. 2

క॥ క్షితిజాధిపతికిఁ బాలితనతవితతికిని ప్రాజ్ఞజనకముఖసుమన
స్పతికిం రఘుపతికి మతిజితశతధృతికిఁ దనుప్రకాశసమరతిపతికిన్. 3

## కథాప్రారంభము.

వ॥ సమర్పితంబుగా నాయొనర్పంబూనిన శివకథాసుధారసంబను మహా
ప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన నిఖిలమునివరేణ్య శరణ్యం
బగు దైవతారణ్యంబునఁ బుణ్యకథాశ్రవణోల్లాస వికాసముఖులు
ధర్మనందనప్రముఖులు భవతిమిర మార్తాండుండగు మార్కండేయ
మహామునివలన నుపసూచితంబగు శివకుమార విజయంబువిని డెం
దంబుకంటకింప వారలలో ననవద్యధర్మనందనుండగు ధర్మనందనుం
డమ్మునిపుంగవుఁగనుంగొని ఋషిచంద్రా కరుణామృత మృదుమధుర
భాషణంబుల సవిస్తరంబుగా నాకథ నెఱిఁగింపుఁడని వేడిన నమ్మునీం
ద్రుం డిట్లని తెలుపందొడంగె. 57

మ॥ కలఁడుద్యచ్ఛతపత్రపుత్రహాయసంఘాతాన్వితాకాశశై
వలినీరంగదభంగఘుంఘుమరవవ్యాకీర్ణభంగావళీ
కలితానేకచిరత్నరత్నమయశృంగవ్యూహసంచారణో
జ్జ్వలదివ్యౌఘవిమానసాంద్రుఁడుహిమక్ష్మాభృన్మహేంద్రుండిలన్. 58

సీ॥ ఘనసంకుమదసాంద్రగండభాగుఁడునుపకంఠతారకమాలికాధరుండు
సతతకల్యాణభాజనుఁడురుద్విజసంతతికిఫలప్రదుఁడుగైరికయుతుండు
వరగోత్రగణములోగురుతరుండగువంశవర్ధనుండమితసంభావనుండు
మణిపాదవలయధామవిలాసితుఁడులసచ్ఛృంగారశోభావిశేషణుండు॥
నమితవాహినీపరివృతుఁడచలుఁడనుచు
ననిశముచటికివిబుధౌఘమరుగుదెంచి
ప్రస్తుతియొనర్పఁగామహిఁబ్రతిభమీఱ
వరలుచుండునుభూమిభృత్పాలకుండు. 59

వ॥ అట్టి భువనాద్భుతకరాదభ్రలీలావిభవంబులకుఁ బట్టయిన యగ్గట్ల
ఱేనికిఁ బితృదత్తయగు మేరుపుత్త్రి భార్యయైయుండఁ గొంతకాలం
బున కామె గర్భంబుఁదాల్చుటయు నట్టియెడ. 60

సీ॥ చిట్టుముల్లనుచయ్యెనిట్టూర్పులొదవెను
బింబాధరముబిట్టువెల్లనయ్యెఁ
దళుకుఁజెక్కిళ్ళువెల్వెలఁబాఱెనడుఁగొక్క
యామడైగనుపట్టెనారుదాఁచు
పాముఁరీతిగనుండెఁబాలిండ్లఁగనఁగొనఁ
దాళఫలాకృతిఁగ్రాలుచుండె
మధ్యంబుబ్రబలెనుమంటిపైచొరవయ్యెఁ
దృణమొక్కబలుకొండతెఱఁగుఁదోఁచె॥
నాభిబయలయ్యెఁజనుమొనల్నల్లనయ్యె
బడలికలుపుట్టెనిద్దురగడలుకొనియె
వన్నెగొదవయ్యెస్వరమింతసన్నగిల్లె
మేనకాదేవిగర్భిణియైనయపుడు. 61

వ॥ అంత నొక శుభముహూర్తంబున జగజ్జనాళి నంద్యమగు బాలికా రత్నంబునుగాంచె నట్టియెడ. 62

క॥ పాడిరిగంధర్వాంగనలాడిరియచ్చరలుమిగులనానందముతోఁ
గూడిరివేల్పులుఁబొగడుచునీడిరిసుఖంబునరానివితతులువేడ్కన్. 63

ఉ॥ ఆతరిగట్లజేఁడుముదమందిమనంబునభూసురాళికిం
బ్రీతియొనర్చిదానములఁబెద్దలకండజికింబ్రియంబుఁగా
భూతియొనంగివేడుకలుపొందఁవడంగగురూక్తివర్తికిం
గూతునకుంచెనామమతికూరిమితోఁదనుగౌరినాఁబెనన్. 64

వ॥ అంతనమున్నమహీంధరేంద్రునకుఁ గ్రమంబుగా మైనాకుండునుఁ గోలాహలుండునను యిరువురుసుతులుద్భవించిరి తదుపరి నబ్బాలి కాలలామ జననీజనకుల కానందంబు రెట్టించునట్లుగ గొదుకుం బల్కులుబల్కుచు జిలిబిలి మాటలాడుచు బాలికలంగూడి గుజ్జన గూళ్లాడుచు ఘల్లుఘల్లున గజ్జెలుమోయ ముద్దుసింపు నడకలచే ననుదినంబును వినోదంబులు గూర్చుచుండ నానగాధినాథుండు బ్రహ్మానందపయోధి తరంగంబుల నోలలాడుచు ననేక నానారంబులు వినోదంబుగఁగాలంబుగడుపుచుండె నంత బాల్యంబువిడుచుటయును.

సీ॥ మగువకొప్పుహసించుమబ్బులయుబ్బుల
నతిమోముచందమాసౌరుఁజేరు
నెలతచెక్కులుమీఱునిద్దంపుటద్దంబుఁ
గేరునువిదమోవికెంపుసొంపుఁ
జెలినవ్వువెన్నెలచెన్నునుఁదన్నునుఁ
బూబోఁడిముకురునువ్వుబువ్వనవ్వు
వెలదిబాహులుముంచువిసములబిసముల
సరసిజాక్షిగళంబుదరముఁదరము॥
రమణియారుకప్పురాలనేలగజాలు
నలినవదననాభినదమునదము

నబలమందగమనమంచనునెంచును
మెలఁతమేనిసంచుమించుమించు. 66

వ॥ అట్టియెడ గౌరికి నర్ఘ్యంబువదలుటయును. 67

చ॥ కటినెడబాసియాతనుత కౌనునుఁజేరెనుఁ జంచలత్వము
త్కటముగనంఘ్రులన్విడచి కన్నులనంటెనుఁ జెన్నురంబువి
స్ఫుటకుచసఖ్యముర్బడసెఁ బొల్చెనునెమ్మొగ మద్వితీయమై
తటుకునయావనంబొదవఁ దద్గుణముల్దగె నిట్లుమార్పులై. 68

గీ॥ అళులనిరసించిబర్హులనపహసించి।కటికచీకటినెంచిమేఘములనొంచి
నీలములడించిశైవాలపాళిమించి।యతివకలరారుఁబెన్నెఱులంచితముగ.

గీ॥ చానముఖపద్మమునకోడిచందురుండు
గందువడికుందియుగ్రశిఖామణియయి
పగలుసాధింపఁజొచ్చెనుఁబంకజములఁ
గల్గునెనిశాటునకువివేకఁబుజగతి. 70

గీ॥ పూర్ణచంద్రునిఁబోలునెమ్మోమునకునుఁ
జెక్కులనురెండుకళలనుజేర్చివాని
తుదమొదళ్లనుగుర్తుగాఁదొమ్ముదులను
విధిలిఖించినవిధమునవెలసెఁజెవులు. 71

ఉ॥ కామినిలోచనద్వయిని గౌరవమొప్పజయింపమీనులా
భామినిచెంతకేగనదిబాగుగదృగ్విశిఖంబులేయనా
కోమలిబాధకోర్వకనుగుంపులుగూడుచునీరువెల్లికిం
బ్రేమలుడింగిపోయెఁదగ బేడిసమీనములెల్ల భీతిచేఁ. 72

క॥ లలనామణిముకుసౌరున।కలకాంచనమోడిగెలువననిశముఁదలఁచుఁ
భళిరనదాళివిరోధము।గలకుసుమముగెలువగలదెకలలోనైనన్. 73

గీ॥ వసుధతానెంతబంధుజీవంబయైన।నుత్పలనిభాక్షివాతెఱకుద్దిగాక
మంకెనపరాగభరితమైజంకివిరిసెఁ।జూడమధుపాప్తులకుగీడుమూడకున్నె?

గీ॥ సంకుతానంతశుచియయ్యునతిగళమున
కుపమగాలేక మెఱయుచు నొగిసుడివడి
తనముజడజన్మ మెఱిఁగించుకొనెనుగాని
యప్పుపాలైనయెడ గెలుపబ్బునెట్లు. 75

ఉ॥ దొంగమకుండుబాల్యమనుదుర్గమనర్గళవిక్రమంబునం
ఛెంగునఁదాటిమాధుర్యమనుచిత్రకవాటముఁదీసిలోనను
ప్పొంగుచు హేమకుంభములుబోల్పనలారఁగఁబై నియుంచనా
బంగరుకుండలోయువఁగభామకుచంబులుఁజూడభాసిలెన్. 76

గీ॥ పర్వదినచంద్రవదనకు బాహుయుగము
పాణితలమునునలరారెభాసురముగ
నువిదశృంగారసరసిలో నుద్భవించు
నాళయుతమైనపంకజశ్రీలనంగ. 77

గీ॥ కొమ్మకీల్జడమదనగుణమ్మురీతి
వెలయుచుండంగనాఛాయవీపునంటి
దళముపై సోకియద్దంబువలెను పెడకుఁ
బ్రతిఫలించినగతినాటుబరఁగుచుండె. 78

గీ॥ కుచములకుఁగల్మిరాఁగమున్న చటిలేమి
నణఁగఁద్రొక్కిననదిపోవనచలనై భ
వాప్తిఁదనరాఁకటిదానినడ్డనదియు
నటిటుఁబోలేకనడుమునానలరెనడుమ. 79

గీ॥ సకియశ్రోణికిసరిరాకనైకతంబు
గాలిచేఁదూలినీటితోఁగలసిపోయెఁ
గాకగిరిజతోనాదూనిగరిమఁగాంచ
నిసుకతిన్నెకుశక్యమేయెన్నఁడైన. 80

గీ॥ రమణియూరుద్వయికినోపిరంభ బెగడి
తుదకుఁదలవంచుకునిక్రింపదూటువడియెఁ

దరుణిజంఘలతో సాటిబొరయలేకఁ
గలమగర్భాళి వెన్నిచ్చియిలనుఁబడియె. 81

గీ॥ కంజమతివయం ఘ్రులకెనగాకతనను
బతుకుఁదలపోసివికచమైపగలుపాలఁ
బడియెరాజసన్మానతఁబడయలేని
పంకజన్ములకిలగౌరవంబుగలదె?. 82

ఆ-వె॥ నతినఖంబులెల్ల సత్సంతతులకన్న
నెక్కుడగుచుమిగులఁజొక్కుచుండు
గిరితనూజతోడఁగిన్నర స్త్రీలైన
నమరవనితలైన నసమముగారు. 83

ఉ॥ చెక్కులుగోప్పనద్దములు జేడియకుంగుచనాభులెన్న బెం
పెక్కుడుచక్రముల్పదములింపగుకంఠముఁజూడనబ్జము
ల్చక్కనినాసదేహరుచిజాలముకాంచనముఁ హసించున
మ్మక్కరొదంతముల్నడుమునందముబాగుగఁజూడహీరముల్. 84

వ॥ ఇవ్విధంబున జవ్వనంబున నివ్వటిలుచుండ హిమవంతుం డమితానం
దంబుననున్నయెడ నొక్కనాడు. 85

సీ॥ అరుణకాంతులడాలునపహసింపఁగఁజాలు కెంజడల్వెన్నునగీలుకొనఁగఁ
దరుణపల్లవకోటిధాతుధిక్కృతిఁజేయుకాషాయవస్త్రంబుకాంతిదనరఁ
బుష్పరాగసంభూతి నెన్నఁగఁజాలుభూతిగాత్రమునిండఁబొలుపునెఱప
నాకప్రవాహాంబుశీకరంబులనించు భర్మపాత్రంబొకపాణినమర॥
మూపురంబునవల్లకిమురువుఁజూప
మంద్రమధ్యమతారలసాంద్రసరిగ
మపధనిస్వరానుస్వరమహిమనెఱపు
కొనుచునేతెంచెఁగలహాంపుకూటితపసి. 86

క॥ వచ్చిననారదుఁగనుఁగొని। మచ్చికరెట్టింపనపుడుమలదొరయతనిన్।
విచ్చేయుఁడనుచుఁదగఁదో। డ్తెచ్చికుశలమడిగిమ్రొక్కిధృతినిట్లనియెన్.

ఆ-వె॥ దేవనీమురాకదివ్యమాయెగృహంబు
పావనుండనైతిఁబరమపురుష
నేడునాదుపుణ్యమీడేఁజెనిటమీఁద
సకలశుభచయంబుసంభవించు. 88

వ॥ అనిపల్కిన భూధరసింహామునకు దేవమునిసింహాలం డాశీర్వదించి యిట్లనియె. 89

ఉ॥ భూధరనాథనీసుతకుభూతిపలేశుఁడునిక్కువంబుఁగా
నాథుఁడుగాఁగలండతఁడునాతికిసర్ధశరీరమిచ్చునీ
బోధకువచ్చెనేనిఁదొలిపుణ్యమదేమనిచెప్పవచ్చునం
బాధరణీధరేంద్రునకునాతఁడెఱుంగఁగఁజేసివేడ్కతోఁ. 90

సీ॥ రాజీవరాజీవరాజీవములఁగేరుఁ గనులుబాదములుఁజక్కనిమొగంబు
రహిఁజక్రచక్రచక్రంబులఁగనినవ్వఁ బిఱుఁదులుపుక్కిలిబిగువుచనులు
ఘననాగనాగనాగంబులనుహసించు మైసోగునడగారుమందగమన
మలచంద్రచంద్రచంద్రాతపంబుల నెన్నువా లెటమైతావిశీతనగవు॥
లళిసమూహంబులనునెంచునతివకొప్పు
హీరసంఘంబునిరసించుఁజాలపదము
గౌరయీశ్యామయామృగధారికలమిఁ
బత్నియైయెనఁగ్రాలదేవర్వతేంద్ర. 91

వ॥ ఇట్లు పరమభాగవతోత్తముండయిన యమ్మహామునీంద్రు నుపదేశంబున నాభూధరేంద్రుండు మహానందపరిపూర్ణుండై యతని కనేక సాష్టాంగవందనంబులొనరించి పలుదెఱంగులఁ బ్రస్తుతించె నారదుండును నతని మనీషావిశేషంబులకు సంతోషించుచు బహుభంగుల నాశీర్వదించి వీడ్కొని సత్యలోకగమనోన్ముఖుండయ్యె నంతి నప్పార్వతియు నురమానివాక్యంబులు వినినతోడన డెంపంబు కందళింప హర్షపులకితాంగియు నాస్వేదగాత్రియు భయసంభ్రమాక్రాంతహృదయయునై యఖిలలోకేశుండగు నీశుండు దనకునీశుండగునని పట్టరాని యానం

దంబునఁ జెలికత్తియలంగూడి వినోదంబుగా నందొక్కతెతో నిట్ల
నియె. 92

ఉ॥ వింటిగదమ్మ యిప్పుడొక వింతయు దంతము దేవహూని మా
యింటికివచ్చి దెల్పె నదియేమన నీశుఁడు నాకుభర్తయై
యంటుఁగనన్నుఁ బొందునని యామని పిమ్మటనేగెనమ్మ ము
క్కంటికి భార్యనౌటకునుఁ గారణమైదగుఁ బుణ్యమెట్టిదో. 93

వ॥ అని మఱియును నిర్భరానంద పారవశ్యంబున. 94

ఆ-వె॥ చంచలాక్షులార శశిధరుండెక్కడ
కూర్మితోడనన్నుఁ గూడుటెచట
ననుచుఁబల్కిగౌరి యానందభరితయై
చిత్తమందుశివునిఁ జేర్చియుండె. 95

వ॥ అంత విబుధోల్లాసకరంబును సంయమీంద్రవిలాసకరంబును శృం
గార ప్రభాభాసమానంబుననగు కైలాసాచలంబున సర్వేశ్వరుండు
దాక్షాయణి నెడబాసినది మొదలు మొదలుతుదలేమిఁ దోఁచక గాటం
పువంతలఁగుందుచు నిమేషంబొక కల్పకంబుగా మనంబునఁ దలం
చుచు నిజహృదయం బయ్యన్నుల మిన్న జగద్విభ్రమాంగ శృంగార
రసాంభోధి తరళ తరంగ పాళికాడోలికలనూగ నింగితంబెఱుంగక
కళవళించి భీతిలి డోలాయమానమానసుండై భూనభోంతరాళంబులు
గనరాని యంగ భవమ్మాయాంధకార వికారంబు ఘోరతరంబుగఁ
గన్నులంగప్పకొన నేమియుఁ గానరాకుండిన నడలి యొడలి బిగినడలి
గడగడవడంకి బెగడి విధాతందెగడి ప్రఫుల్ల పంకజాతాయతలోచ
నంబుల వెంబడి జారు బాష్పాంబువులచేఁ దళతళమని మెఱయు జిగి
చెక్కుటద్దంబుల కాంతి దఱుఁగ మనోవీధిఁ దిఱుగు మదనుండంప
నుగ్రతరంబుగవచ్చు నుష్ణ దుస్సహ దీర్ఘనిశ్వాస పవన జాల జాజ్వ
ల్యమాన జాలికలచేఁ గెంద లిరుటాకుల నిగన్నిగల నిరసించు కావి
మోవి వెలవెలఁబాఱ వదనారవిందంబు వాడుదేఱ నున్నురనుచు

దిశలఁబరికించుచు శిరంబుఁబంకించుచు మాటిమాటికి నమ్ముద్దుగుమ్మ సోయగంబుఁదలపోయుచుఁ గెలఁకుల కేగుచు భూషణంబులుడుల్చుచు మిన్నుమన్నులన్వేషించుచుఁ జెలఁలందెగడుచుఁదాలిమిఁద్రిలుచు వాసిం బాయుచుఁ గంతుసంతాపభరమునఁ గ్రాఁగుచుఁ బారావత పరభృత ప్రముఖ కలరవంబుల కులుకుచుఁ బరశిలీముఖంబులఘాతకు బెదరుచుఁ గటకటాయనుచు బయలు గౌఁగలింపుచు నీశుండు సకలలోకాధీశుండుగాన నెట్టకేలకుఁ దెలివొంది ప్రావిలుతుని ప్రభావంబునకు మెచ్చుకొని తనకుఁదానెమెచ్చుకొని యంత నప్పల్లవాధరసమక్షంబునఁ గనుపట్టినట్లుఁదోఁచినఘోరమారవికారాపస్మారదూరీకృతవివేకుండై పోలి హా! బాలా, బాలేందుసమానఫాల, నీలనీలాలకజాల,యిక్కరాళ మరాళానీకంబులఘాతలకుం దాళఁజాల, నింకనిట్టితటిం జాగేల, మద్ధృదయారవిందంబున నెట్టుకొను గాటంపు మోహంబు నెట్టి దిట్టఁదనంబుననేని విడువంబూనినఁ జెఱకువిలుకాఁడు బిఱబిఱఁబఱగించు కఱుకు పెఱుకువిరి చిలుకు మొత్తంబులు జూఱుకొ చఱుక్కున నెవనాట నేరీతిం దాళువాఁడ శతపత్రపత్రంబుల ఁగన్నిరసించు తెలివాలు గన్నుంగవనరమోడ్పుజూడ్కులఁ జూచుచుఁజూచుచు మదన శృంగార నాళీకాళరజనిత మృణాళ నాళ తుల్య బాహుయుగంబునఁ గ్రుచ్చి కుంభి కుంభ సమానానూన పీన పయోధరద్వయంబు నాయురంబునఁ గదియ బిగ్గఁ గవుంగలించి కెంజిగురుటాకుల దొగిడున్న రసిం మ బింబాధరజనిత సుధారస ధారాసముదయంబుఁ గ్రోలనిచ్చి యనంగభవసంగర రంగానందాబ్ధి తరంగంబుల నోలలాడింపుమని యనేకభంగులఁ బ్రార్థించి మఱియును. 96

హాయనుననవహాటకదే। హాయనుముఖవిజితజలజహాయనుబెనబా
హాయనుసామజరిపువా।హాయనుగడితంపువెతలఁహాయనుమఱియున్.

రాయనుముఖజితరజనిక। రాయనుగచహాసిలిమధుకరాయనునిదిమే
రాయనుఁబల్లనసన్నృశక। రాయనునరశంఖకంధరాయనునార్తిన్. 98

వ॥ మఱియును. 99

సీ॥ ఇంతిరో రతనాలదొంతిరో చామంతి బంతిరో యిటుచేయ భావ్యమటవె
కొమ్మరో బంగారుబొమ్మరో ముద్దుల గుమ్మరో నీకిది కూడునటవె
కన్నెరో కపురంపుఁదిన్నెరో యన్నుల మిన్నరో యిది నీకు మేల్మియటవె
కలికిరో చిలుకలకొలికిరో మరునిపూ ములికిరో మముఁ బాయ మోదమ
చేడెరో దగు తమ్మిపూఁబోఁడిరో మి [టవె॥
టారిరో కమ్మవిల్తుకటారిరో తు
టారిరో హాయి నొసఁగు వయారిరో య
టంచు శోకించు చుంబలవించు హరుఁడు. 100

వ॥ మఱియు వనాంతరంబుఁ దూఱి. 101

సీ॥ మారుఁడా మీనసచ్ఛోరుఁడా సుందరా కారుఁడా మాదిక్కుఁ జేరరాదు
శూరుఁడా త్రిభువనాధారుఁడా మలయసమీరుఁడా మా చెంత మెలగరాదు
చంద్రుఁడా సద్గుణసాంద్రుఁడా యిందీవరేంద్రుఁడా మమ్మిప్పుడేచరాదు
చెంతడా యకుమతిమంతుఁడా పటుగుణవంతుఁడా యిపుడు వసంత నీవు॥
కీరమా మత్తగహనమయూరమా మ
రాళమా శారికాపికజాలమా యు
లిందమా నవవికసితకుందమా యి
దేల యీ వేళ మాకుఁగరాళులైరి. 102

క॥ మదనాగ కుంభకుచ। పయ్యెదనాటఁగ నమ్ములేయ కిప్పుడుగగనా
మొదనాటఁగ నేచుటకిది। పదనాయద నాసరోజ వదనా మదనా. 103

క॥ అలుకా మామీఁదనబూ। విలుకాఁడిటు దాడిఁ జేసి వెఱపింపఁ నయో
పలుకాడ వేమి ముద్దులు। చిలుకా నఁగఁగలికిజాడఁ జెప్పుము చిలుకా.

ఉత్సాహవృత్తము.

పూలవిల్తుఁ డేయువాఁడి పూలకోల కాఁకకుం
దాళఁజాల జాలిఁబొందెఁ దగమనంబు మీకుమా
బాలహరిణ చారునేత్ర వార్తఁ దెల్పి బ్రోవరే
సాలమా తమాలమా రసాలమా మరాళమా. 105

సీ॥ విరిబోఁడియిచటికి నరుదెంచెఁజూపరే కరులార హరులార తరువులార
జవరాలుజాడమీ రెవరైనఁదెల్పరే యవులార గవులార చివురులార
వినయవతినిమీరు గనుపడఁజేయరే మునులార ననలార వనములార
చిలుకలకొలికినిఁ దెలుపరేజక్కవ చెలులార యలులార చిలువలార॥
చెంచుఫ్రాఁబోఁడులారరాయంచలార
జింకకూటువులారగోరెంకలార
మత్తకేకినులారపూఁగుత్తులార
కానరేమీరుచానసీకానలోన॥ 106

వ॥ అని మఱియు మనోవికారంబునఁ గలికిం బదకింపంబోయి యప్పువ్వుఁ
బోఁడింగానక విరాళిఁగొన్న చందంబున నూసరిలుచు సహస్రారంబెత్తిన
పగిదినుస్సూనుచు మూపటిల్లిన తెఱంగున నుమ్మలించుచు దూలపోయిన
రీతినుదిలంగొనుచు విషంబెక్కినలీల భ్రమఁగన్నువెట్టుచు మదంబెక్కిన
మాడ్కిఁ బరితాపంబందుచు బాలేందుశేఖరుం డుగ్రద్ధనఁదెలివొంది
యమ్ముద్దుగుమ్మ దుహిన ధరాధరేంద్రునకు సహితమైన తెఱంగె
ఱింగి వెండి గుబ్బలిగూడెంబు వదలి కదలి మంచుకొండదరి నొప్పా
రు పూఁదోఁటదరి కేతెంచి యచ్చటఁ వనమసంబుఁ దిట్టఁజేసుకొని
తపంబుఁ గావించుచుండె. 107

సీ॥అంతటహిమవంతుఁడాత్మజాతనుఁజూచి ప్రేమమీఱఁగఁ జేరఁబిలచితన
తొడలపైనిడుకొనిఁ డఁతియిప్పుడుశంభుఁ డుద్యానవనములో నుంచితపముఁ
గావించుచుండెనుగానసీవిప్పుడుశివునిచెంతకుఁబోయిసేవఁజేయ [మునఁ
నతఁడెల్లశుభములనతిదయంబునగూర్చునచుచునాదరముగనానతియ్య॥
వినియుమాదేవిచక్కిలివేడ్కతోడ
శంభునకునేనుభక్తిచేశంకలేక
సేవఁజేసిననాకోర్కిసిద్ధిబొందు
ననుచుమనమునచక్కలిహర్షమందె. 108

వ॥ చెలికత్తియలంజూచి నేడు శంకరుని సేవకరుగవలయుంగాన భూషితు
రాలుగాఁ జేయుండన నట్లకాకయని. 109

సీ॥ ఘనవైభవ్రాన్నతినెనయించుతురుముపై
విరిసరుల్నినిచెనువెలఁదియొకతె
ముకురకాంతులఁగేరుముగుదచెక్కులపైని
మకరికంబులువ్రాసెమగువయొకతె
వలమురిజిగినెంచువనితకంఠమునందు
హారావళులువైచెనబలయొకతె
పూబంతులఁనుమించుపాలతిపాలిండ్లపై
కంచుకంబుఁదొడంగెఁగలికియొకతె॥
చెలువయొక్కతెహొంబట్టుచీరఁదెచ్చి
నీటుగాఁగట్టెశృంగారనిధిగఁజేసెఁ
గోర్కెలూరంగఁజెలులతోఁగూడిగౌరి
నాగభూషణుసేవకునేగుతఱిని. 110

క॥ కాటుకపిట్టలతేఁటులను । మాటువడంజేయఁబూనిమహితాత్ములకుం
గాటుకఁబెట్టెనునేర్పున । బోఁటియొకర్తుకముదంబుబొలుపాఱంగన్.

ఉ॥ సారసనేత్ర మోముపయిఁ జక్కనికస్తురి నామముంచినన్
వారిజవైరి యేమొయని వానివిరోధియె వచ్చెనేనిమా
కేరికిఁబోలదంచు మదినిమ్ముగయోచనఁ జేయుచుండఁగా
శ్మీరపుఁజిత్రకంబిడెమొఁజేడియయొర్తుహిమాద్రిజాతకున్. 112

క॥ పంచాస్యమధ్యయున్నత । పంచాస్యాహోహయగుచుబాగుగనపుడుం
బంచాస్యుసేవకై జనెఁ । బంచాస్త్రునిదంతిఁబోలెఁబడఁతులుగొలువన్.

వ॥ ఇట్లు గిరీంద్రనందన సామోదహృదయ జలజాతయై చంద్రఖండావ
తంసునుండు దపంబుఁజేయుచున్న సిద్ధవనంబుఁజొచ్చి యచ్చట. 114

గీ॥ విప్రయోగంబుచేతను వెలయువాని
మఱియుసర్వప్రపంచంబుమఱచువానిఁ

దన్నై బ్రహ్మంబుఁ గానెదఁ దలఁచు వాని
హరునిఁ బొడఁగాంచె నెనరనాగిరితనూజ. 115

వ॥ ఇట్లు తపంబుఁ జేయుచున్న పినాకపాణిం బొడగాంచి యమితానం దాబ్ధితరంగంబుల నోలలాడుచుఁ జెలులచాటునన్నిలచి పరమపావన చరిత్రుండగు నా త్రినేత్రునకుఁ బరిచర్యలు జేయుచుండ నంత నాతని ఛాయయుంబోలె వెనువెంటి యేతెంచిన భృంగీశ్వరుండు సర్వమంగళ మంగళలక్షణంబులు వీక్షించి యక్షీణానందంబున నిట్లని వితర్కింపఁ దొడంగె. 116

ఉ॥ కొమ్మ మొగంబు తమ్మియని కోరికతో నళి సంచయమ్ము వే
గమ్మున నేగుదెంచి రుచిరగమ్మఁగ భాసిలు నాసఁ జూచియిం
దమ్మక చెల్లగంధఫలి నబ్బురపాటునఁ గంటిమంచు నీ
తమ్మయి వెన్కడాఁగెననఁ దన్వికి బెన్నెఱు లొప్పె నందమై. 117

సీ॥ ఇందుఁడీ మోముఖారవిందంబునకు నోడి కాబోలు జలజాళిగాసిఁ జేయు
నిందీవరంబులీయింతికన్నుల నోడి కాబోలుఁ బగలన్నఁ గలఁగుచుండు
ఘనమైన పవడమీ కాంతవాతెఱ కోడి కాబోలుఁ జేకట్లఁ గట్టఁబడుట
వలమురి యీ చానగళము తో సరిరాకఁ గాబోలు వెఱుఁజయుట ఘనతేఁద
చక్రవాకంబులీనాతి చన్నుఁగవకు
నోడి గాబోలుఁ దమిఁగవవిడు టెల్ల
నహహ సురయక్షసిద్ధసాధ్యాదిసకల
దేవభామినులందిట్టి తెఱవ గలదె. (క్రి॥ 118

వ॥ అని వితర్కించి నీలకంధరున కిట్లనియె. 119

శా॥ స్వామీ దేవర వారి చెంతకొక చంచద్గాత్రి యేతెంచె నీ
భామారత్నము జాడఁజూడఁగను నాపాలింటికే మే మొమీ
నేమంబుం జెఱుపంగ వచ్చినయట్టు ల్నిక్కంబుఁగాఁదోఁచెనీ
వామాక్షి న్వెడలింతు నేయిపుడు శర్వా సర్వలోకేశ్వరా. 120

వ॥ అనిన నప్పరమేశ్వరుండు. 121

ఆ-వె॥ భామనాథునిపుడుఁబరిచర్య సేయంగ
నేగు దెంచెఁగానియెలమితోను
వేరుగాదునుమ్మువినుమోరిభృంగీశ
యనఁగ నిట్టులనియెనలఁదుమఱల. 122

చ॥ సరసఁపు మోము చందమలచంద్రుని ఁలునుఁబోలు నేత్రముల్
శరచరజాలమున్ ఘనము చక్కని వేనలిబాహులంపద
ల్సరసిజనాళతుల్యములు చాలఁగ మధ్యముఁ బట్టిచూచిన
న్సురపథమే మొజొప్పడదు సోయగ మెన్నఁగ బ్రహ్మగావలెన్. 123

గీ॥ ఇంతశృంగారవతియైనయింతినీదు
చెంత మెలఁగుచునుండ నాకంతుఁడితర
చింతఁదోలఁగించి యర్థాంగ కాంతుఁ జేయుఁ
బంతమిగురో త్తఁగానుమకుంతనిహతి. 124

వ॥ అనిన సర్వేశ్వరుండు. 125

ఆ-వె॥ భృంగియేలనట్లు బెట్టుగావల్కెదు । వంతయేలనవును వింతగాను
వెలఁదినాథుసేవ వేడ్కఁజేయంగ । వచ్చెనింక వేరువదరకుడుగు.

వ॥ అనిన నాగభూషణు వాక్యంబులకు భృంగియు నూరకుండె నట్టియెడ ననుపమ శృంగార వేషమైన యంబికాయోషయుఁ బరిచర్యలు సేయు నెపంబున శివునిదరిం జేరియుండెనంత నతిరమ్యంబగు గిరీంద్రపుత్రికా శృంగార సౌందర్య రేఖా నిశేషంబులు బరికించి మనంబున హర్షించి శివుండు మోహాక్రాంత హృదయుండై యిట్లని వితర్కింపఁదొడంగె.

సీ॥ శృంగారతరభృంగ సంగమం బెఱుఁగని భాసముజ్వలమైన పద్మినియిది
పద్మినియిదికాదు పరనఖక్షతములఁ గసి వాఁగానిట్టికిసలయంబు
కిసలయంబిదికాదుపసనెపం గెడుసూచినిన్యాసమెఱుఁగనివిద్రుమంబు
విద్రుమంబిదికాదు విఖ్యాతతరమహా పుణ్యఫలంబుల పుంజముగును॥

పుణ్యఫలపుంజమిదికాదు పుడమియనెడు
రంగతలమున నాట్యంబు రమణసలుప
మెఱయుచును నేగుదెంచిన మెఱుపుతీవ
మెఱుపుతీవయుఁ గాదిది మీననేత్ర. 128

వ॥ అని మఱియును. 129

క॥ ఈమగువయెవ్వ తెయొసుర।భామయొనచ్చరయొ లేక వ్యాళాంగనయోఁ
గామునిమాయయొఁగాకీ।భూమినిఁగలసతులకిట్టిపొంకముగలదే. 130

వ॥ అని సంశయించి మఱియు సర్వమంగళా మంగళ లక్షణంబులు గుఱ్తె
ఱింగి చంద్రఖండావతంసుండు త్రికాలవేదిగావున భవిష్యద్వృత్తాంతరం
బుల నెఱింగి సాత్త్వికభావంబు మనంబునందూని దృఢనిశ్చయుండై
తపంబుఁ జేయుచుండె నంతఁ ద్రిదశాలయంబున. 131

ఆ-వె॥ విబుధులెల్లఁగూడివిబుధపాలునిపాలి।కేఁగియతనితోడనిట్టులనిరి
జంభవైరిమేముశత్రుబాధకునోర్చి।వచ్చినాముమాకువసటమాన్పు.

వ॥ అనిన నతండు. 133

ఆ-వె॥ వేల్పులార మనము విధినగరంబున
కేఁగియజునిఁగాంచి యెలమితోడ
నతని వేడుకొంద మతఁడు దయాళుండు
మనదుబాధ నతఁడు మాన్పఁగలఁడు. 134

వ॥ అనిన నట్లకాకయని సురమూర్ధన్యులు వాక్యంబులకు మహానందం
బు నొంది తత్క్షణంబ సుపర్వానీకంబు విరించిమందిరంబునకరిగి యేసుం
గు మొగసాలం గడచియుండ. 135

సీ॥ కౌండిన్యమాండవ్యగౌతమమునులతోడ నొకమోము వేదంబులుచ్చరింప
శాండిల్యగాలవశౌనకామునులతోడ నొకమోము శాస్త్రంబులుచ్చరింప
భృగుభరద్వాజకపిలముఖ్యమునులతో నొకమోము వేదాంతముచ్చరింప
పల్లవాధరియైనభారతివినునట్టు లొకమోము సరసోక్తులుచ్చరింప॥

నలువ యీరీతిఁ బద్మాసనస్థుఁడగుచు
వేడ్కఁ గొలువుండు వేళయందు
నమరులింద్రునితోఁగూడ నబ్జభవునిఁ
గాంచియిట్లనిపలికిరి కరుణఁబుట్ట. 136

ఆ-వె. తమ్మిచూలియిపుడు తారకబాధచే
నిల్వలేకమిమ్ముఁగొల్వవచ్చి
నారమీవువానినశియింపఁగాఁజేసి
కావుమయ్యమమ్ముఁగరుణతోడ. 137

ఉ॥ నావిని జేరరాఁబిలిచి నాలుగుమోముల సామియిట్లనెం
దేవతలార్మిరిపుడుదీనతఁగైకొనియుండనేలయా
పావనుఁడై నశంభునకుఁ బార్వతికిందగనందనుండుశో
భావహుఁడై జనించిరిపుబాహుబలంబునడంచులీలచేఁ. 138

క॥ కావునమీరిపుడాపర। దేవుఁడుఁబార్వతియుఁగలయు తెఱఁగెయ్యదియో
వేవేఁగనరసిజేయుఁడు। మీవనటలుశాంతిఁబొందిమేలగుమీఁదన్. 139

వ॥ అని యానతిచ్చిన పలుకులవెలంది ముద్దుమగని కనేక జోహారులిడి పాకారిప్రముఖ సుధాశను లమరావతికింజనియుండ నంతనొక్కనాడు భూరిస్ఫులింగ కీలాకర భీకరోగ్ర కులిశ హస్తుండగు సుపర్వమూర్ధన్యుండు సభాస్థానమండపంబున కేఁగఁదలంచి యభంగ సౌరభ సంగత బంభర దానఝర సంఘాతమలీమస గండరంగ చతుర్దంత దంతావళం బధిష్టించి చనిచని పురోభాగంబున నవరత్నఖచిత ధగద్ధగాయమాన ద్వారబంధ బంధుర లక్ష్మీవిభవంబులు నిజలక్ష్మీవిభవంబులఁ బ్రహసింపంజేయుచుండఁ దద్విభవంబునకు మనంబున ఘనంబుగ నానందించుచు చంద్రకాంతభిత్తి ప్రతిబింబిత యంత్ర పాంచాలికా సముదయంబుల యందంబు లచ్చర విరిబోఁడులయందంబులఁ గేలిసేయ నట్టి విచిత్రంబుల కచ్చెరువొందుచు నందనోద్యానకాననంబున దట్టంబుగఁ

దొట్టుకొను మవ్వంపుఁ బువ్వులకుఁ గవకవలువివ్వక గండుతుమ్మెద
మొత్తమ్ములు చిత్తమ్ములఁ దత్తరిలుచు గుప్పగుప్పన ముసరి తేనియ
లాని ముసరుఁగవిసి క్రొవ్వి పుష్పాదులఋవ్వి ఝుంఝుమ్మని ఝుంఝా
టించి ద్రోచిన పుఁడేనెవాఁకల చెంతఁ జెంగు చెంగునఁ జెంగలించు
లేఁగదూడల వేడుకలు బరికించి నెమరలువెట్టుచు నెఁదవులుఁగల పాను
వులుఁగదలఁ దమ తమ యిండ్లవాకిండ్లకుం జేరి వేలుఁపులకోరిక లీరిక
లెత్త నమృతంబుఁగురియు వేలుపుటావులకు నిలువనీడలొసఁగుచు నడిఁ
గిన జనసమూహంబులకు ధనంబులు ఘనంబుఁగఁ గుప్పఁగురియించు
బుడుకుమ్రాఁకుల కెంజివుళ్లఁ జెడిదంపు టడిసంబులుఁగల చెఱకువిలు
కాఁడు బిఱబిఱ నెఱవెఱికి ఝుళిపించు మెఱుంగు మోహనబాణము
లట్లు తళ్తళలఁ బ్రకాశించి కన్నులకు మిఱుమిట్లుగొలుపు రంభాది
గంభీర గంభీరవేదికా శుంభత్కుంభ కుచల నూపుర కలరవంబులు
తమ నెచ్చెలుల మెలుంగులని భ్రమపడి మిన్నేటి తేటనీట నున్నాగ
హాటకాంబురుహంబుల తూండ్లమెసంగుచు నడుదెంచు హాటకగర్భ
ఘోటకంబులగు మేటిరాయంచల చంచూపుటంబులు బింబంబులని
యెంచి నేతెంచి ముద్దులుచిల్కఁ బల్కు రాచిల్కలపల్కులు విని
పొంచి యరుదెంచిన సాంకవంబుల మైతావు లపహరించి నెయ్యు
నెయ్యనఁ బఱతెంచు పయ్యర కుఱ్ఱనిమెసవుచుఁ జక్కలంపుచుట్టల
వలెఁ జుట్టఁజుట్టుకొనియున్న ప్రాయంపుఁజలువల జాడలు మచ్చుకట్టి
వచ్చు కేకుల షడ్జధ్వానంబుల వినియలపై మేలవించు కిన్నరజనరాం
ద్ర నిబ్బరంపు గబ్బిగుబ్బలకు జోడగు [illegible]త్తులనెనప్పాటి మవ్వం
పుదివ్వెలకై వడి నివ్వటిల్లు జ్యోతిర్లతా వితానంబులనే [illegible]
నల్లుకొనఁబడుదోరంపుఁదీరంబుల మాఱుపోఁకనుదెంచు[illegible] మిథు
నంబుల యనంగభవసంగర రహస్యంబులకుఁ జిక్కఁ జేయువిధంబున నుప్పొం
కలకంఠ కంఠనిర్గతా కుంఠ దుత్కంఠి పంచమ స్వనంబునకు జతకలిపి
పాటఁబాడు గంధర్వపాటల గంధులమేటి ముంగుఱుల కద్దియఁగుచు

పచ్చపట్టుపుట్టంపు జగజెట్టి నెమ్మేనిచాయలం దొట్టిన గట్టి నీలంపు దూలంబుల కాధారంబులగు పచ్చరామానికంపు కంబంబులు బచ్చికలని హెచ్చినతమిఁ గ్రచ్చుకొని వచ్చు కన్నెలేళ్ల కన్నులసంపన్నతనెన్ను కన్నులుగల యన్నుల మిన్నల పొక్కిళ్ల చెన్నుఁదన్ను పువ్వులుగల పొన్నగున్నల నీడల నివసించు తపసుల కెంజెడలనిరసించు పగడంపు ద్వారబంధంబులపై విచిత్ర చిత్రితంబులగు తీగ దండావళులవలె నల్లిబిల్లిగ నల్లుకొను తీగెమల్లెల కోరకంబులు కాకోదరాండంబులని కేకలిడు వీచుఁక నే తెంచు గృహమయూర పింఛంబుల యొప్పులనుప్పతిల్లు జేజేయొప్పులకుప్పల విప్పారు కప్పు కీలుగొప్పుల నొప్పారు పారిజాత కుసుమదామంబుల కాసించి వచ్చు చంచరీకంబులఁ జంచలింపఁజేయు కాంచనకుసుమదామంబుల చాయలనిరసించు కాంచన వేదికలపై బొచ్చెంబుగఁ గూర్చుని వీణియలుమీటునచ్చర మచ్చకంటుల చెక్కుటద్దంబులకు హెచ్చగు చంద్రకాంతకవాటంబులు నిలువుటద్దంబులని గ్రద్దనఁజనుదెంచి ముద్దుమొగంబులఁబరికించుచుసిద్ధాంగనలు ధరాధరంబులతోఁ బురుడించు తమ తమపయోధరంబులకుఁ గస్తూరికా పంకంబుఁ బొదువఁ జేరువమెలంగుధారాధరంబులు ధరాధర భ్రాంతివేగంబున వ్రాలి తత్కాటిన్యంబునవిచ్ఛిన్నంబులై రాల్చిన క్రొత్తముత్తియంపు తోరణంబులచే నొప్పారినదై భర్గ విష్ణు పితామహ పురంబులు నిర్మించి యారి తేఱినశిల్పనైపుణంబున విశ్వజనమాన్యంబుఁగ విశ్వకర్మచే నిర్మింపఁబడిన సుధర్మం బ్రవేశించి సభాస్థానమంటపంబుఁ బొడఁగాంచి పార్శ్వ రాధరారోహణ బాలభానుండునుంబోలె చతుర్విధాలంకారభూషితుండై వినిర్మిత ముక్తాఫల సముదయ సంకలిత కనకమయ సింహాసనంబధిష్ఠించి తత్పురభాగంబునఁ బుండరీక రిపుమండలంబునుంబోలె నిజపుండరీకంబు గ్రాల దిక్పాలకాద్యఖిలామర పరివృతుండై నిస్తంద్రవిభవసాంద్రదంబునఁ బేరోలగంబుండె. 140

ఉ॥ మారునిఁ బాంధమానన విమర్దనదక్షు సుమాశుగావళీ
క్రూరునిసర్వలోకజయ కోవిదశూరుని వజ్రపుష్పతూ
ణీరునిఁగీర్తివైభవ వినిర్జితహీర పటీరతారకా
వారునిఁగీరవాహను నవారితమిత్రతఁ గోరనాతఁడున్. 141

ఉ॥ అత్తఱిఁ దత్తరంబున శుకాశ్వముపైఁ దగఁగూరుచుండి మే
ల్కత్తళ ముంధరించి పటుకంజనుమాద్యము లైనబాణము
ల్పొత్తుగఁ జేసివేడుకలు పొందువడ క్రతితోడఁగూడి వేఁ
జత్తఁజుఁడేగుదెంచెఁ దనచెల్వముమీఱ సుధర్మపాలికిన్. 142

చ॥ అటఁజనికాంచెమారుఁ డమృతాశివరేణ్య కిరీటకోటిసం
ఘటితసమస్తరత్న చయ కమ్రవిభాగణ దీప్యమానవి
స్ఫుటపరిఫుల్ల కంజనిభ సుందరపాదు వరప్రసాదు ది
క్పటపద సేవనాకలిత గాఢవినోదు శచీప్రమోదునిన్. 143

ఆ-వె॥ కాంచిరథముడిగ్గి కరయుగంబులుమోడ్చి
దేవ యేలనన్ను దృఢతమీఱ
మదిఁదలంచిరనిన మరునిపైఁ కనవేయి
కనులదృష్టియొకటి గాఁగఁజూచి. 144

ఆ-వె॥ కరుణనింద్రుఁడతనిఁగౌఁగిటఁ జేర్చియ
ర్ధాసనంబునొసఁగ నపుడురతినిఁ
దగఁబులోమజాతదగ్గరఁగూర్చుండఁ
బెట్టుకొనియె ముదము పెంపుమీఱ. 145

క॥ ఇట్లర్ధాసనంబునఁ గూర్చుండబెట్టి బెట్టిదంబగు పెనుగిట్టులచట్టు పలు
దెగఁగొట్టిన జగజెట్టి మున్నిటఁబుట్టు ముద్దియ ముద్దులపట్టిం గని
యిట్టులనియె. 146

॥ సుమబాణజాలమునలోకములఁ గెలచిజయముఁగొన్నఘనుఁడవునీవ్రా
కమలాస్త్రి నాకునొకపని । సమకూర్పుము వేల్పులెల్ల సంతసిలంగన్.

క॥ అదిమొట్టిదన సమస్త। త్రిదశులకు జయప్రదంబుఁ ద్రిభువనమోదా
స్పదము భవదేక కుసుమ। ప్రదరనుసాధ్యంబుశుభకరంబరయంగన్.

వ॥ అని పల్కిన శచీజానింగని రతీజాని యిట్లనియె. 149

సీ॥ ధరజాతవేదుఁడైతగుజాతవేదుండుసమదదుర్జనచయదముఁడుయముఁడు
పరభట కంధరబద్ధకాశినరాశి మహితాంబురాసి సంవాసిపాశి
యతిజవమృగవాహుఁడౌగంధవాహుండు రాజితశ్రీదుఁడౌరాజరాజు
భండనజితవైరివర్గులు భర్గులు పటుపుణ్యవంతులై వరలుసురలు
నెలమితోడ మిమ్మునే ప్రొద్దుఁగొలువంగ
నహితబలవిభేద మాచరించి
భాసమానలీల వరసుధర్మావాప్తిఁ
బరగునీకదేమి పనినొనర్తు. 150

ఆ-వె॥ అయిననేమిపనియొయనుమానముంచక। తేటపడఁగఁదెల్పు దేవనాథ
నీదుకరుణగల్గ నిముసంబులో మద। మడఁచివేతు నంతకారినైన.

వ॥ అని పల్కిన యిందిరానందనుని వాక్యంబులు విని సంక్రందనుండు
డెందంబు కందళింప నమితానందంబునొంది. 152

గీ॥ అమరులెల్లను సంతోష మందుచుండ
నింద్రుఁడిట్లనె మరునితో నింపుమీఱ
తారకాసురబాధకుఁ దలఁకియిపుడు
నిన్నుఁ బ్రార్థించితిమి మేము నీరజాస్త్ర. 153

వ॥ ఎందుచే నంటివేని. 154

ఆ-వె. అంబికా రమణియు నభవుండుఁ గూడినఁ
దనయుఁడొకఁడుపుట్టి ధైర్యమొదవ
దేవసేనకెల్లఁ దిరముగా నధిపుఁడై
వైరిఁద్రుంప మాకువనట మాను. 155

వ॥ కావున సర్వమంగళయు సర్వేశ్వరుండునుఁ గూడునట్లొనరింపుము
నీకు మేలొదవునని శచీకాంతునకు రతికాంతుం డిట్లనియె. 156

క॥ సంతసముతో వియోగుల। సంతాపము వృద్ధిఁబొంద సల్పుచు మఱినా
చెంతమెలంగుచునుండవ। సంతునిఁదోడ్కొనిపోదుఁజయ్యననటకున్.

ఆ-వె॥ ఏగి శివయు శివుఁడునేకమైయుండిన
సిద్ధవనముఁజొచ్చి శివునిమీఁద
సుమశరమ్ము వేసి చొక్కించి గౌరితో
గూడునట్లొనర్తుఁ గూర్మి మెఱయ. 158

క॥ అనియిట్లు పలుకుపలుకులు
విని యింద్రుఁడు మోదమంది వేడుకనతనిం
గనుఁగొని బహూకరించినఁ
బని వినిమెరమాసుతుండు స్వగృహంబునకున్. 159

వ॥ ఇట్లునిజధామంబున కరిగిన. 160

క॥ మృగతృష్ణాంబుధులింకఁగ। ఖగగణముచలింపఁ జండకరులీన్రాలుచు
ల్దగమాటిబయులఁజనిచని। మృగయునివలె నపరగిరికి మిత్రుండేగెన్.

గీ॥ ఏగియపరాద్రియను సౌధమెక్కి యచటఁ
దామసీ సంగమంబిప్డు తనకుఁ గల్గు
దీనినేరీతి విడనాడు తెరవుగలదొ
యనుచు భయమందినట్లు మందాభుఁడయ్యె. 162

చ॥ త్వరపడియేగెనిప్పు డలతామరసాప్తుఁడు బశ్చిమాశకుం
బరుగునఁ గూడరమ్మనుచుఁ బంకజవైరి భుజంగు చెంతకుం
బనుపడి యామినీతరుణి పంపిన దూతిక సంఘమట్లనే
సరిగెను నీడలెల్లఁ బొలియూనను దీర్ఘములై క్రమంబుగన్. 163

ఉ॥ కాముఁడు రేపు దేవతల కార్యముఁ జేయఁదలంచి వేడ్కతో
సోముని చెంతకేగి తనసూనశరంబుల వాలుచేయ నా

భీముఁడుద గ్రతన్మరుని పేరడఁగించునటంచు నీపనిం
గాముని తండ్రికిం దెలుపుకై వడి సూర్యుఁడు జేరెనంబుధిన్. 164

సీ॥ వినుమానికముగ్రుంక విన్నఁబోవలఁనని యబ్ధీశుఁడిడిన రత్నాళియనఁగ
బ్రాహ్మణమంత్రాంబుభగ్నమందేహాదిరాక్షసాంగోదితరక్తమనఁగఁ
బ్రాచేత సోద్యాన వనవాటికాతపుష్పశ్రేణి కెంజివురుల చెలువమనఁగఁ
బశ్చిమదిక్కాంతపడఁతులతో నాడి మెండుగానింపుబగ్గుండయనఁగఁ
గాము మామతోడఁ గలయుదునని వేడ్కఁ
గనినదగుచు రాత్రియనెడు వనిత
తనదు నొసలిపైనిఁ దాల్చిన కాశ్మీర
తిలకమనఁగ వెలసె నలఘు సంధ్య. 165

క॥ ముదమొదవెనుఁగొ ముదములకు
ముదముడిగెనుఁ గమలములకుముదమున నప్పుడున్
మదకరిగ మనల మనముల
మదనుఁడు జోరబడఁగ రతికి మరులును బలసెన్. 166

సీ॥ తనమిత్రుఁడ త్తరిఁ దగనెటోజనెనని దిక్కుదిక్కుల వెంటఁదిరిగిచూచుఁ
జూచికానఁగలేకఁ జోద్యంబుఁగా మింటికరిగి కేకలువెట్టి యచట వెదకు
వెదకితివ్వనఁ బాటివికవికలాడియే ద్విజరాజుఁజూచినఁ దిగులుజెందుఁ
జెందికాసారంబుఁ జేరియుందునఁదన ప్రతిబింబమునుఁజూచిభ్రమసిడా
డాసి యెఱకలు దడియంగఁ బాసిపాఱుఁ [యు॥
బాఱి కెందమ్మిపైనున్న భసలములనుఁ
బొడుచుముక్కున సైకత భూమికేగు
సంధ్యవేళను వగనొక్క చక్రవాకి. 167

ఉ॥ భానజుఁడుగ్రమూర్తియగు ఫాలవిలోచనుబైకి నెల్లి వేఁ
బోవఁదలంచి సేనలను బోఁపునఁ బిల్వఁగ నంపడెందమం
దేనగమైన లేకఁదమునేలిన సామికిఁదాము దోడురా
బోవు పికంబులో యనఁగఁ బొల్చె జగంబున నిర్లమొత్తముల్. 168

గీ॥ చిత్తభవుఁడెల్లి వేఁబోయి శివుని శివను
సుమశరము లేసి జతఁగూర్పఁ జోద్యముగన
టంచు విబుధులు మారునకంపినట్టి
కుందములనంగఁ దారకా బృందమొప్పె. 169

ఆ-వె॥ ధృతిఁదమోనిశాటుఁడతికుతుకంబున
మిన్నుమానికమును మ్రింగలోన
రుచులు హెచ్చి యవియరోమ సంధులనుండి
దెఱలెననఁగఁ బర్వెఁ దీపతతులు. 170

గీ॥ తన ప్రియాత్మజుఁడరుదెంచు ననుచు దుగ్ధ
జలధివేడుక మీఁగడఁజక్కఁజేసి
యెదురుఁగాఁ బంపెనోయన నెక్కుడగుచుఁ
దూర్పుదిక్కున ధవళిమదోఁచెఁ గొంత. 171

సీ॥ పురుహూతదిక్కాంత పొందుగానుదిటిపైఁ దీర్చినకాశ్మీరతిలకమనఁగ
విరహిణీజనధైర్యవిచ్ఛేదమొనరింపఁ గంతుఁడెత్తినసుమకుంతమనఁగఁ
దిమిరమత్తేభవిక్రమమడంపఁగఁబూర్వశిఖరివెల్వడివచ్చుసింహమనఁగ
సురపిపాసాపరిహరణార్థమైయింటఁ బరగనుంచినసుధాపాత్రమనఁగ॥
కలువలుప్పొంగ నింగిఁజుక్కలు జెలంగ
విరహులదరంగఁ బద్మాళి వేడ్కఁగ్రుంగ
నిఱులు బెదరంగ నీరధి హెచ్చిపొంగఁ
గళలఁదనరంగవచ్చె జక్కవలగొంగ. 172

ఆ-వె॥ కులిశధార చేతఁ గుధరముల్దెగినట్లు
దమ్ముగొంగ కళలు దాఁకియప్పు
డిసలు బెదరిచెదరి యించుక మాత్రానఁ
బోయిడాఁగె మూలమూలలందు. 173

ఆ-వె॥ చంద్రికలుసుబర్వె సాంద్రముల్పలుగ్రొవ్వెఁ
నమసమునఁగ జాడనపతితినఁగ

వేలుపులకుఁబువ్వ విష్ణుపదపుఁబువ్వ
విరహులెల్ల నొవ్వ వెలయుచుండ. 174

వ॥ అట్టియెడ దట్టమై రేయెండ మిట్టిపడు గుట్టలఁబెట్టిదంబగు చట్టుపలు దెగఁ గొట్టినజగజెట్టిగేలంబట్టువడి(గాలు నూఁటంచులవాలు కాంతులకు వన్నెఁ బెట్టి, యిందిరా సుందరీ సుందరుండగు గోవిందుని పద మార్గంబున విమానంబులెక్కి వాహ్యాళి నేతెంచు నిర్జరేందిందిరాలక సందోహ సుందరవదనారవింద జనిత మందస్మితంబులకు విందులిడు చందంబునఁ గ్రందుకొని, యాకాశధునీహార నీహారహీర పారద శా రద శారదాంభోధర తారకామర సామజసోమకాందంబ కర్పూర డిండీర చంద్రకుందేందూపల సంతాన సందోహ ధాళధళ్య ధగద్ధగా యమాన పాండురవర్ణకాంతుల నిరసించి, కుధర గుహాకుహరంబులు వెడలి జనుదెంచు కేసరి నివహంబుల కంధరాగ్రంబులఁ బ్రజ్వరిల్లు కేసర బృందంబులఁ బరిహాసించి, విరహార్తిఁ బడి పొరలుచు మైమ అచి మూర్ఛాగతులై యుండిన మత్తకాశినుల గ్రీవంబులఁ జిక్కు పడు ముక్తాహారంబుల సారంబులగు తళతళలఁ బోనాడి, కమలాకరాంత ర్విరాజమాన రాజహంస పక్షపుటాంతంబులనవ్వి, సకలజనమానసా హ్లాదకరంబై, శిష్టచరితంబునుంబోలె ధరణీగగనమండల సుందరంబై, సుందరీమందస్మితంబునుంబోలెనతిమనోహరంబై, హరనివాసంబునుం బోలె నతిప్రకాశంబై, కాశాధిపుంబోలెఁగువలయోద్ధరణసమర్థంబై, సమర్థ ప్రదాతయశంబునుంబోలె మనోభిరామంబై, రామచంద్రుని రాజ్యంబునుంబోలె గురురాగ పరిపూర్ణంబై, పరిపూర్ణలక్షణ లక్షిత కవికృతింబోలె దర్శితపదార్థపరంబై, పరబ్రహ్మంబునుంబోలె నతి క్రాంతానేక నిగమంబై, కమలగర్భాండ కటాహంబులు ధవళంబుఁ గావించి యివిగ్రహంబులివి నక్షత్రంబు లిదిమన్నదిమిన్నను భేదంబు లేకుండునట్లు వ్యాపించుచుండె. 175

చ॥ అమృతభుగాళి శ్రోవనభమన్న ద్విజావలిపై నిఁ దారక
ల్పమధిక కోపలై విధుని సమ్ముఖమందున విన్నవింపఁ బో

యి మఱియతండు వారలకు నేలికయాటఁదలంచి భీతిచే
విముఖితఁజెందినట్లపుడు వెల్వెలఁబాఱెఁగళావిహీనమై. 176

వ॥ అంతకుమున్నె మరుండు సాంధ్యకృత్యంబులు నిర్వర్తించి భోజనశాల కరిగి యచ్చటఁగలధౌతాంబరంబుల ధరించి యొక్క రత్నస్థగితంబగు పీఠంబునఁ గూర్చుండునెడఁ దనప్రాణనాయకియగు రతిశాల్యోదనంబును చోష్యలేహ్యపానీయాది పంచభక్ష్యంబులునుఁ గనక పాత్రంబులందిడిన నిష్ఠావాప్తిఁభుజించి శయనగృహంబునకేగి యచ్చట. 177

సీ॥ పగడంపుఁగంబముల్నిగనిగలనిగ్గాల స్ఫటికభిత్తులకాంతిప్రతిభమీఱ
రత్నంపుదూలముల్రమ్యమై ప్రకటింపఁబుష్యరాగపు కర్జుపునుకరింపఁ
గనకంపుముంజూరు గాంతిచేభాసిల్ల మౌక్తికతోరణ మహిమ దనరఁ
బద్మరాగద్వారబంధముల్దనరార నీలంపుజాలముల్ జాళినెఱప॥
మరకత కవాటములుదీప్తిఁ బరపుచుండ
ఘనత మాణిక్యదీపంపుఁ గాంతి దనర
మెఱయు సౌధాంతరంబున వరలుచున్న
తల్పమునఁగూరుచుండె సంకల్పభవుఁడు. 178

వ॥ అట్టియెడ. 179

సీ॥ తన ప్రియుండైనట్టి ధరణీరుహముఁజేర
వచ్చినజంగమ వల్లి యనఁగఁ
దారాపథమునుండి ధరణికిలంఘించి
దీపించు బల్మించు తీవయనఁగ
మనుమఁడువ్యేలలూగు ననుతలంపునఁ బాల
వెల్లియంపినవచ్చు వీచియనఁగఁ
గాద్యార్థినైవేయి కన్నులదొర నేడ్క.
మకరాంకునకునంపు మణియనంగఁ॥
జెన్నుమీఱినహారంబట్టు చీనెఁగట్టి
భూషణంబులు ధరియించి పుష్పధన్వి

గూరుచుండిన మంచంబుఁ జేరి రతియు
దంచితంబుగఁ బ్రీతితోఁ దనరుచుండ. 180

ఆ—వె॥ ఆకసంబుఁజూచి హరుని కేశంబని। తారకాళియతనిహారమనుచుఁ
గువలయాప్తుఁజూచిశివునిరూపంబని।కందుయతనినీలకంఠమనుచు.

వ॥ చెలువు విలుకాఁడు బిఱబిఱంబయనంబగు నవసరంబున నతని ప్రాణ
వల్లభయగు రతియిట్లనియె. 182

ఆ—వె॥ ఫాలనేత్రుగేశ పాళిగాదదిపాల । కడ లిహారచయముగాదు నురుగు
శివునిరూపుగాదు శేషపర్యంకంబు।హరునిగళముగాదుహరియుతండు.

వ॥ అని మఱియును. 184

సీ॥ ప్రాణేశనామాటఁ బాటించివినవయ్య శివునితో వైరంబుఁ జేయఁదగదు
శ్రీకంఠు తపమిప్డు చెడినమేల్వ్రజికి మనకేమియైనను మాన్పలేదు
హరుఁడనస్వల్పుఁడే హరియంతవాఁడతఁడనుచు మానిని దెల్పనంగజన్ముఁ
డామెతో నిట్లనె నతివరో మనకేమి యాపదరాగలదనుచు మఱియు॥
దేవకార్యంబు మానను దెఱవయనిన
నామె మనమునఁ జింతించి యంతఁ దెలిసి
యేమియైననుఁ దప్పింప నెవరితరము
కాగలది యేరికైననుఁగాకయున్నె?. 185

వ॥ అని మనంబున నిశ్చయించుకొని. 186

క॥ ఎవనికియజ్వయునుదకము। దివివహ్ని మహాబలుండు దిననాథుండున్
భువిశశివనురూపములా। శివుఁడిడుశుభములుదయార్ద్రచిత్తతమాకున్.

వ॥ అని సర్వేశ్వరు ధ్యానింపుచు పతిమాటకు మారాడ వెఱచి పవ్వళించి
యుండెనని సెప్పినఁ బరమానంద భరితుండై ధర్మనందనుండఁట
మీఁది వృత్తాంతం బెఱిఁగింపుమని మార్కండేయ మహాముని నడు
గుటయును. 188

క॥ కామారినుత చరిత్రా । శ్యామల శుభగాత్రదివిజ సారసమిత్రా
ధామనిధిగోత్ర నయగుణ । ధామా రణరంగభీమ దశరథరామా. 189

చ॥ పరమ దయాలవాల పరిపాలితసజ్జన జాల రక్షితా
మరపరిపాల తోయజ విమర్దనఖండ సమానఫాల కం
ధరనిభనీల భూరి కరుణారస సంయుతశీల మానివ్యా
త్సరసిజసద్మలోల సురశాత్రవకాల పరాంబుదానిలా. 190

భుజంగప్రయాతము॥

సరోజాక్షనామా లసన్మార్గకామా
సురాజన్యసోమా యశోజన్మసీమా
సురారాతిభీమా ప్రసూనాస్త్రధామా
నరస్తోమరామా ఘన ప్రేమ ధామా. 191

గద్య॥ ఇది శ్రీపరమేశ్వర కరుణా కటాక్ష సమాసాదిత సహజ పాండిత్య
సరసకవితా ధురంధర ఘనయశోబంధు రాపస్తంబసూత్ర
భారద్వాజసగోత్ర పేరూరు ద్రావిడశ్రోత్రియ శ్రీ
మ్మానార్యసోమయాజుల కులజలధిజైవాతృ కామనా
చలేశ్వర తనయ నయగుణ నిధేయ లక్ష్మీనా
రాయణ నామధేయ ప్రణీతంబయిన
శివకథా సుధారసంబను మహా
ప్రబంధంబునందు ప్రథ
మాశ్వాసము.

---

శ్రీపరమేశ్వరార్పణమస్తు.



శ్రీరస్తు.

శ్రీరామాయనమః.

శ్రీమహాగణాధిపతయేనమః.

శ్రీశారదాంబాయైనమః.

# శివకథాసుధారసము.

## ద్వితీయాశ్వాసము.



మిత్రాన్వయ జలనిధి
సోమా సీతాభిరామ సుగుణస్తోమా
రామా వైభవజిత సు
త్రామా భూభృల్లలామ రాజితనామా.

వ॥ దేవా యవధరింపుము మార్కండేయ మహామునీంద్రుండు ధర్మనంద
నునకట మీఁది వృత్తాంతంబిట్లనియె నంత నారేయి రతీ మన్మథులు
సుఖనిద్రం జెందియున్న యెడఁ బ్రభాత సమయంబగుటయును. 2

గీ॥ ఎంతఁ జెప్పిన నాథుండు బంతగించి
తనదు మాటలు వినకున్కి దైన్యమంది
యున్న రతిమోము గాబోలు నన్నపగిది
విధుఁడు గళలేగ గ్రుంకెను వెల్ల నగుచు. 3

సీ॥ పరరాజు కళలేకఁ బశ్చాన్ముఖుఁడుగాఁగ రాజిల్లు పద్మినీ రాగమనఁగ
నినురాక ముందుగా నేర్పడఁ జేయంగఁ జనుదెంచు జుల్మతీ జక్కియనఁగ

సకుటుంబముగ నిశాచరుఁడేగ నంతటఁగాల భిక్షుండెత్తు గంటయనఁగ
స్మరుఁడు శంభుని మీఁది కరిగెడుతఱి నెంటి దెఱువున నెదురేగు ద్విజుఁ
జక్కవలఁజేని తేరిపై పెక్కుమనఁగ [డనఁగ॥
దినకరుండప్పుడజుఁడాట వినినదగుచు
వీఁక నరుదెంచు హంసనాఁ బ్రాకటముగ
వెలుఁగుచును వచ్చె నత్తఱి వేఁగుజుక్క. 4

గీ॥ సత్ప్రకాశంబులడఁచె నిశాప్రచారి
గాన శీఘ్రంబుఁగా వచ్చి కావుమనుచు
హరిని బ్రార్థించుచుండెనో యనఁగ నపుడు
కుక్కుటంబులు రొదఁజేసె గుంపుగూడి. 5

సీ॥ దండిగానెత్తావిఁగొండయందుదయించిబొండుమల్లి యపుష్పలచెండుమెక్కి
ఘనసారయుక్తమౌ ఘనసార కదళికా వనవాటికా వీథి వరలి వరలి
సారసాకరఫుల్ల సారసౌరభ సారానుషంగంబు నలిపి నలిపి
యలికుంతలలకుచంబులపైనిఁబూసినలలితచందనగంధములుహరించి॥
కోడె కాండ్రతోడఁగూడి మన్మధకేళి
నలసి సొలసియున్న చెలులమేని
ఘర్మచయముఁ గొల్లగాఁగొని యేతెంచె
శీత వాత పోత జాత మపుడు. 6

గీ॥ పతుల రతులచేఁ దేలించి కుతుక మెనఁగ
నతులితానందమగ్నలై యలరుచున్న
మించుఁబోఁడుల చతురత మెచ్చి సంత
సించి తలలూఁచెనన దీపశిఖలు వడఁకె. 7

గీ॥ అమిత తేజస్వియునుఁ గమలాప్తుఁడైన
హరినిఁ బ్రార్థించు ద్విజసమూహంబుఁ బోలె
నమిత తేజస్వియునుఁ గమలాప్తుఁడైన
హరినిఁ బ్రార్థించు గతి ద్విజాళిరహించె. 8

క॥ మిసమిసలాడెడిచీరెలు। ముసుఁగులు వేయుచును నిదుర మోములఁ జొక్కం
బసఁ జెడిగొంపులఁ దూఁగుచు। నసదృశముగ నిండ్లుఁ జొచ్చి రందఱు జాణల్.

సీ॥ సంజననెదుఁ రేగి సరసవాక్యములచే సరసవతంసుల సత్కరించి
కలపంబులను బూసి చెలువైన కర్పూరపువీడియం బంతట వేడ్కనొసఁగి
కుంభికుంభసమానకుచములంటఁగ నిచ్చి మురిపెంపుఁ జెక్కులు ముద్దొసంగి
తీయని మోవులఁ దేనె లానఁగనిచ్చి గిలిగింతలకుఁ గేలు కేలు గలిపి॥

ప్రౌఢదనమున సొమ్మెల్లఁ బరిహరించి
రతులఁ దేలించి యుత్తేజిఁ జతుర విటుల
దోలఁగఁ జేయంగ ముదిమితల్లులను దార్చి
వరలుచుండిరి సామాన్య వనితలెల్ల. 10

సీ॥ కుక్కుట ధ్వనివిని క్రొమరొప్పఁగా లేచి బిఱబిఱచీరెలు బిగియఁగట్టి
చెలువైన సరముల చిక్కులన్నియుఁ బాపియొప్పఁగా విడియంబులు మిసిమైచి
చెదరిన కాటుకల్చీర చెంగున నొత్తి వదలిన కొప్పులు గుదురు పఱచి
మెల్లమెల్లనఁ బాన్పు మెలకువతో డిగి కనకనూపురములు ఘల్లురనఁగ॥

నిదుర మోములఁ నొప్పంగఁ బదములిడుచుఁ
బతులు మదిఁ జొక్కవిడిచిరి పడకటిండ్లఁ
గ్రొత్తకోడంగ్రుఁ దమతమ చిత్తములను
నత్తలకుఁ జాలభయమంది తత్తరమున. 11

ఆ-వె॥ వీరిఁ దోలఁగెనపుడు జీకటులు జక్కవ
పిట్టలెల్ల గుములుగట్టి వెలసెఁ
గుముదసంచయంబు కుముదంబుల వ్యోను
నదములందు కోకనదములలరె. 12

గీ॥ ఇనునిఁ బరిణయమాటకు నెదఁ దలంచి
ప్రాగ్దిగంగన చెలులతోఁ బ్రాకటముగ
నతుల మోదమ్మునవసంతమాఁడెననఁగ
చదలయందున నూరు తేజంబు దనరె. 13

సీ॥ పదినూఱుకన్నులఘానుషామేడపై గ్రాలుచుండెడు హేమ కుంభములఁ
బాకశాసనురాణిపాణిదీపించెడు మాణిక్యమయమహామండనములఁ గఁ
బ్రాగ్దిగంగనఫాలభాగంబునందునఁ బొలుపొందుచేర్చుక్కబొట్టుఁ గ
నందనోద్యానకాననసీమనలరారు లలితకల్పకశాఖిదళమునంగ॥

నంబురుట్కాంతనోముఫలంబనంగఁ
దనరెనలప్రాక్శిఖర్యగ్రమునఁ గిశోర
సూర్యుఁడనివార్యశౌర్యప్రధైర్యక్రౌర్య
ధుర్యమందేహవీర్యానివార్యుఁడగుచు. 14

వ॥ అంత శంబరాంతకుం డహర్ముఖోచిత కృత్యంబులునిర్వర్తించి నిశాం
తసంతసంబునఁ గృతాంతాంతకుపై నేగఁ దలంచి లతాంతకుఁ డం
బూని. 15

శా॥ సారంగాంకుఁడుమారుతుండుబికముల్ చైత్రుండు వేగోడరా
సారంగాశ్వము నెక్కి వెన్క మదవత్సారంగము ల్గొల్వఁగా
సారంగాస్త్రుఁడు నాతిఁ గూడి జనియె న్సంతోషముం బొందుచు
న్సారంగాసురవైరినాగిరితనూజాతేశ రహింగూర్పఁగాఁ. 16

సీ॥ వందిమాగధజనబృందస్తుతులఁబోలెముందుగా శుకనాదములు చెలంగఁ
జిత్రతంబురంజిల్లమత్తకోకిలలసద్గానముల్కాహళధ్వనులుగాఁగ
వడిగల జింకతత్తడినెక్కి నెఱకౌతు పీతేరుభేరులవిధము దనర
ప్రసవాసవము గ్రోలుభసల సంచయమెల్ల మునరి సేనలవలె మ్రోలఁ [గ్రాల॥

సాంద్రమైన పరాగరజమ్ము గ్రమ్మ
సంభ్రమము మానసంబున సందడింప
శివుఁడు నివసించియుండిన సిద్ధవనము
జొచ్చె మరుఁడెల్ల జేజేలు మెచ్చుచుండ. 17

సీ॥ ఘనవసంతరసాలకిసలయభరితంబు కోమల కలకంఠ కూజితంబు
సకల ఫలానమ్రసాలకోద్యానంబులలిత శుకాంగనాకలకలంబు

నళినసంచయారావకలితప్రసూనంబుఁ బాంధజనావళీ బాధకంబు
మంజుల తాకీర్ణ సంజనికాయంబు మలయగంధానిలమానితంబు॥
వితత మృగమదసాంకవ విశ్రుతంబు
సతతమాధవ మన్మథసంయుతంబుఁ
గలదియగుచునుఁ జనుదెంచె ఘనముగాను
భాసురంబగు మధుమాస వాసరంబు. 18

వ॥ అంతఁ గలవాణీజిత కలకంఠవాణియగు కలవాణి గిరీంద్రనందిని కిట్ల
నియె. 19

ఉ॥ చక్కనివారిలో మిగులఁజక్కనివాఁడు శివుండు నీవునుం
జక్కనిదాన విట్టియెడఁ జాగొనరించఁగ నేలనమ్మయో
చక్కెర బొమ్మ యిప్పుడెక సక్కెములాడఁగ నేమిలాభ మ
మ్మక్కడటాలునం జనుము యాతని పాలికి సంతసంబునన్. 20

చ॥ చెలియరొ నీవు శీతకర శేఖరుపాలికిఁబోయి యీసుమం
బులను నొసంగి తేనిదయబుట్టును శంభునకిష్టుఁగాన వే
నలయకఁబోవు మచ్చటికి నందఱతోఁ బనియేమియంచు నా
చిలుకలకొల్కి.బల్క విని చిన్నివయారపు గౌరియిట్లనెన్. 21

క॥ ఓయువతులార యిప్పుడు । మీయందఱకిట్లు మిగులమెత్తనసైతి
న్యాయవ్వకడకఁజనియెద । మీయందఱు చెలువములొల్ల మెలతుకలారా.

వ॥ అనిపల్కి జనుట కుద్యుక్తయైనఁ గలవాణియిట్లనియె. 23

గీ॥ చెలియ నీకు మేమెంత చెడ్డవార
మైతిమిప్పుడీశుని సేవకరుగుమనినఁ
దండ్రియాజ్ఞనుమీఱుటఁ దగునె? వినవె?
నాస్తితత్వం గురోః పరమ్మనెడినుడువు. 24

వ॥ అని బోధించి శంకరుని సేవకు సమకూర్చు సమయంబున. 25

సీ॥ సొగసుగా మెఱుఁగిడ ధగధగలాడుచుఁ
బొలుపారు బంగారు బొమ్మ లనఁగఁ
జికిలిఁ జేయించంగ జిగికాంతిగల్గు నా
మురువైనరత్నంపు మూర్తులనఁగ
ఘనముల నెడబాసి కాంతిచే భాసిల్ల
మెఱయంగ వచ్చిన మెఱుఁగు లనఁగ
సానఁ బట్టించంగ సరగ ననంపినఁ
గొమరారు భానుజుకోలలనఁగ॥
రాజకళల కుసఖులన రమ్యముగను
వరలుచుండిన నమృతంపు బావ్రలనఁగ
వనమునందున విహరింప ఘనముగాను
నల్లిబిల్లిగఁ జనుచున్న వల్లులనఁగ. 26

వ॥ విలసిల్లు చెలికత్తియలం గూడి శీతాద్రిజాత సర్వేశ్వరుం డాయం జని
సేవఁ జేసెడు నెపంబున. 27

సీ॥ తొలుదొల్తఁ జడవిప్పఁ దొడఁగి యచ్చటనున్న
దివిజగంగనుఁ జూచి దిగులుపడియెఁ
బొలుపుగా భవుమేని బూదిఁ దుడువఁబోయి
భోగిఫూత్కృతులకుఁ బొక్కిపాఱె
నెనరున గళనైల్యమును బాగు జేయంగఁ
బూని పుర్రెలఁ గాంచి పొలఁతి జంకె
హరుమేనిపై వస్త్ర మలరింపఁగాఁ దెంచి
వ్యాఘ్రచర్మముఁ గని వనిత బెదరె॥
నెట్టులైనఁ గాని యీశ్వరునకు సేవఁ
జేయఁ బూని దరికిఁ జేర వెఱచి
దూరదూరమునకుఁ దొలఁగుచుఁ జూపట్టెఁ
జెలుల మనములందుఁ జింతగదుర. 28

వ॥ అట్టియెడ బాలేందు శేఖరుండతనినిష్ఠఁజెలింపని మనంబునఁ దపంబొన రించుచుండె నంత గిరిరాజ కుమారియు మనంబున ధైర్యంబూని యా వ్యాఘ్రచర్మాంబరుఁజేరంజని యెట్టకేలకు నొక్కయుపాయంబున నాతని జపమాలికఁ దాను బుచ్చుకొని తనచేతి మౌక్తికహారంబతని చేతి కందించు నవసరంబున. 29

చ॥ ఇది తఱియంచునెంచి యఖిలేశ్వరుపైవడిఁ బుష్పబాణము
ల్పదిలముగానిగుడ్చి నిజబాణ సమగ్రదదాత్మ పంకజం
బదరఁగఁజేయఁజూచి మదిహర్షముఁజెంది బలారిముఖ్యులీ
మదనుఁడనంత ధీరుఁడని మానుగ మెచ్చుచునుండి రెంతయున్. 30

ఉ॥ అత్తఱిఁగీరరాజములునంచలు గోయిలమూకలున్మహా
చిత్తరువైనరూపములఁ జెన్నలరారెడు కేకి శారిక
ల్జిత్తజు ముఖ్యసేనలయి చెల్వము మీఱెడు గండు తుమ్మెద
ల్గుత్తుకలెత్తియొక్కతఱిఁగూయఁదొడంగె మనోహరంబుఁగాన్. 31

వ॥ అట్టియెడ సారసారిధారణుండు మారుతమ్ములవాసనకును మలయమారు తమ్ములవేఁడికినిఁ గలహంసంబులకలకలంబులకునుఁ గేకులకేకలకునుఁ జంచరీకంబుల ఝుంకారంబులకును శారికలరుతంబులకును శుకంబుల పలుకులకునుఁ బికంబులకూజితంబులకునుఁజంద్రకిరణమ్ములకాఁకకునుఁ జైత్రుని ధాటికును విచలిత హృదయారవిందుండై తపోవిఘ్నంబు నకు ఘనంబుఁగ మనంబునఁగుంది రోషంబు పిక్కటిల్ల నొక్క పెట్టున హుంకరించి కుసుమసాయకుఁ గీటఁడంపఁ దలంచిన సమ యంబున నెల్ల జేజేలునొక్కశబ్దంబునఁ గావుకావు మహాదేవయని యుప్పరవీధినుండి మొఱలిడ నాశబ్దంబులు వారివారివాతెఱలుదాఁటి పైకివచ్చుటకుమున్న నీలలోహితుండు ఫాలలోచనంబు విప్పిన నగ్ని జ్వాలలు దశదిశలునుఁ గప్పనస్ఫులిఙ్గములుగురులుసెదర హిరణ్యగర్భుం డదర నముచిసూదనప్రముఖ దిక్పాలురుబెదర ఛటచ్ఛటాయమాన

పటపటాయమాన స్ఫుటస్ఫుటాయమాన భీకరశబ్దంబులు దిక్కుంభి
కర్ణరంధ్రంబులకుఁ దాళంబులుగావించి రోదసి భేదింప భుగభుగ
ఘోషంబులతోఁ జడలు నాక్రమించి ప్రళయకాలాభీలానలంబునుం
బోలె భగ్గుభగ్గునఁ జనుదెంచి చూచువారలకతి భయంకరంబుగా
నొక్కత్రుటికాలంబున మారునకు మారినై హరునికంటిమంట తుం
టవింటిదంట వెంబనంటి మంటఁగలిపెనప్పుడు దిక్కోటరంబుల హాహా
కారంబులుదోఁతెంచె సాగరంబులు ఘూర్ణిల్లె సమస్తలోకంబులాకు
లతంజెందె భూచక్రంబు దిర్దిరందిరిగె శేషుండు సంక్షోభము నొందెఁ
గులాచల సందోహంబులల్లాడె సకలఖగమృగకుల సందోహంబులు
మేఁతలుమాని గడగడ వడంకఁజొచ్చె సూర్యుండు మందాభుండయ్యె
నక్షత్రంబులు జలజలమనిరాలె నెల్ల వేల్పులును దీనాననులైయడుఁగులు
దడబడఁ దమతమ నివాసంబులకరిఁగి రయ్యవసరంబున. 32

సీ॥ చలిగాలి తోల్దోల్తఁ జైత్రుఁడా వెన్కనుఁబఱుఁగునఁదమమన్కిపట్లకరిఁగి
రాతఁతిశిఖిచయంబంచలుఁజనియెనుఁబొదలమాటునకునుఁజడలతుదకు;
గీరసందోహంబు శారికావళియును భయముచే బ్రమాఁకుల పజ్జఁజేఱె
నెలమిలేకనుఁబికంబులుమిళిందమ్ములు గూడివేఁగము దూఱెఁ గుంజ [ములనుఁ॥
జంద్రుఁడప్పుడు నిజలోక సరణిఁజెందె
భయముచేతను నగరాజు బరగవచ్చి
పుత్రినింటికిఁ దోడ్కొనిపోయె వడిగ
మారుఁడొక్కఁడు హరుకంటి మంటఁబడఁగ. 33

ఆ-వె॥ అట్టిసమయమందు నార్తిఁబొందుచు రతి
దేవిమిగుల వడఁకి దీనమైన
మోముగలదియగుచుఁ గామునిమదిలోనఁ
దలఁచుకొనుచుమిగులఁ దల్లడిలుచు. 34

సీ॥ కుసుమమాలికలాడి కొమరారుకోలంబ
ములవనున వెన్కనునొప్పు నూఁదియుపికః

గమనీయతరమైన కలికిశరద్రాజ
వదనంబుమిక్కిలి వాడఁ దేర
గళమున నున్న ముక్తాహార చయములు
చిక్కులలోఁ బడి చెదరుచుండఁ
బొరలి యేడ్చుచు వేఁడఁ బొంకంబు దఱుఁగుచుఁ
బాలిండ్లపై నున్న పైఁటజార॥
మేననున్న నగలు మేలిమిఁ జెడితూల
వెఱ్ఱిదానిఁ బోలె వెలఁది యపుడు
హారమాకుమార హాశంబరాంతక
హానురూపయనుచు నార్తిఁ గొనుచు. 35

ఉ॥ హానవసూనబాణధర హాసుకుమార రమాకుమారకా
హానలినాస్య కీరహయ హావర యౌవన చారు విగ్రహా
హానిను నుగ్రుఁ డెట్టులిపుడగ్గికి నర్పణఁ జేసెఁ గ్రూరుఁడై
హాననుఁ బాయ నీకు హృదయాంబుజ మెట్లుగ నోర్చె వల్లభా. 36

సీ॥ భవనేత్ర దావపావకుఁడు సన్మానస
భూమీరుహంబు మాడ్కిఁ బొలుపుమాపె
హరనేత్ర కుంభజుం డురుసత్వరమున ని
న్నుదధిచందంబున నుక్కడంచె
నంధకాంతకునేత్ర హర్యక్షడింభంబు
నినుఁ గరీంద్రునిభంగి నెఱి వధించె
నంతకారాతి నేత్రామ కేంద్రుఁడు నిన్ను
మేటికొండను బోలె గీటడంచె॥
హామనోనాథ హాదేవ హాశుభాంగ
హాసుమాయుధ హాశరదబ్జవదన
హారమాసుత హాప్రియ హాశుకహయ
నన్ను విడనాడి జన నీకు న్యాయమయ్య. 37

ఆ—వె॥ ప్రాణనాథ! కోరి పరమేశునకు గౌరి
కలరఁజోడుగూర్పఁ దలఁచినట్టి
నిన్నుఁజంపె నిపుడు నీలకంఠుండేమి
తప్పుఁజేసి తనుచుఁ దగవుమాలి. 38

సీ॥ మాసురక్షణనీవు మహిసుండు వరకేనుమధురక్షణమునీవు మనెడివరకె
నమరరక్షణనీవు సమసెడివరకేను వజ్రిరక్షణనీవు పడినవరకె
వాయు రక్షణనీవు పోయెడివరకేను భూతరక్షణ నీవు పొలియువరకె
భువనరక్షణనీవు పొడియఁబడువరకేను సేనరక్షణనీవు చెడెడివరకె॥
గానినీవు మడియఁగావంగ లేరైరి
యొక్కరైనఁగాని రొప్పుమీఱి
నీవు శివునిపైకి నేగెఁగనువేళ
సుద్దులెన్న లేదెవద్దటంచు. 39

వ॥ అప్పుడు నామాటలఁ బెడ చెవులం బెట్టి యిప్పుడిట్లైతి వింకేమి చేయు
దానననుచు ఘోలుఘోలున నేడ్చుచు నిట్లనియె. 40

సీ॥ మకరంబుచేఁజిక్కి మదవారీంద్రుఁడు నేఁడఁ
గరుణచే నాతనిఁ గావలేదె?
తీంద్రడంబుగాఁజేయు తండ్రిబాధలకోడు
చిన్ని ప్రహ్లాదు రక్షించలేదె?
వసుధఁ జాపగఁజుట్టివడిఁ బట్టుకొనిపోవు
కనకాక్షుఁగిటి యయిదునుమ లేదె?
యదితి నందనులెల్లనార్తినొందుచుఁ గావు
మనఁగదైత్యులనెల్ల నదమలేదె?॥
యట్టిహరికి సుతుఁడనైన నిన్నిప్పుడు
గావరాదె? వేగఁ గరుణతోడ
సిరినిఁగూడి నిన్నుఁ జిత్తంబులోపల
మఱచెనేమొ లేక నెఱేఁగిరాఁడొ? 41

వ॥ అని దీనాలాపంబు లాడుచు దశదిశల న్వీక్షించుచు హస్తపల్లవంబు
లచే నురంబును శిరంబును మోఁదుకొనుచు నిట్లనియె. 42

సీ॥ ఇంద్రుఁ డెచ్చటి కేగెఁ జంద్రుఁ డెచ్చట డాఁగె
స్మరనీవు హరుకంటి మంటఁబడఁగ
మలయజుం డెట కేగె మధుఁ డెచ్చటనుడాఁగె
స్మర నీవుహరుకంటి మంటఁబడఁగ
భృంగంబు లెట కేగెఁ బికములెచ్చట డాఁగె
స్మరనీవు హరుకంటి మంటఁబడఁగఁ
గీరంబు లెట కేగె గోరెంక లెట డాఁగె
స్మర నీవు హరుకంటి మంటఁబడఁగ॥
నీలకంఠ చయము దేలను గనుపించ
దంచ లెచట డాఁగె సమరనిపుడు
మమ్ముఁజూచుకొఱకు నిమ్ముగా రారైరి
యొక్కరైనఁగాని యక్కటకట. 43

క॥ నాపాతివ్రత్యోన్నతిఁ । బాపమునకు వెఱవకింక బ్రహ్మాండములం
దాపంబుచేతఁ జెఱిచెద। శాపంబిపుడిచ్చియనుచుఁ జయ్యన మఱియున్.

క॥ పరులనుహింసించంగనుఁ । బరహానికిమూలమగునుఁ బాపంబులకున్
బరఁగ నెలవగుదుననుచును। మఱురాణిదలంచెదనదు మానససీమన్. 45

ఆ-వె॥ ప్రాణనాథుఁగూడి వడివడిసహగమ
నంబుఁ జేయనిపుడ ! నయముతోడ
ముక్తిగలదటంచు ముప్పురంబుఁగసగ్నిఁ
ప్రజ్వలింపఁజేసి పల్లవాంఘ్రి. 46

వ॥ భక్తిపూర్వకంబుఁగా సర్వలోకేశ్వరు నిట్లనివినుతించె. 47

సీ॥ అంగసంభవభంగఁ యాధోనిధినిషంగ పృథ్వీశతాంగసంభృతకురంగ
కాలకూటాహార కవిజనమందార పరమపదాధారభవవిదూర

సకలలోకనిధానశమితదానవ మానరాగవిహీనగోరాజయాన
పరమపావనశీలపాలితమునిజాల కరధృతఘనశూలకాలకాల॥
తారకాగణశోభితధవళవర్ణ। తపనశశివీతిహోత్రాక్షవిపులవక్ష
యాశ్రితావనసమ్ముదితాంతరంగ। కమ్రతరచిత్రితాశయాకాశకేశ.

వ॥ అని యివ్విధంబునఁ బ్రార్థించినఁ గృపాసముద్రుండగు శివుండు గరుణించి నభోవాణి కాజ్ఞ నొసంగ నాదేవుని యాజ్ఞాప్రకారంబునఁ దక్షణంబ రతివినునట్లు వియద్వాణియిట్లనియె. 49

ఆ-వె॥ వనితనీకదెపుడు వైధవ్యమిలను లే
దంగజన్ముఁడిపు డనంగుఁడయ్యె
మేనితోడనీకుఁ గానుపించునఁగాని
కలికియొరులకితఁడు గానరాఁడు. 50

ఆ-వె॥ మగువవినుము నీకు మాంగల్యలోపంబు
లేదునమ్ముమెపుడు లేశమైనఁ
గానసంతసంబు గదురంగవిలసిల్లు
మనుచుఁబల్కవిన్న దగుచునుండ. 51

క॥ ఘనకుచయాసమయంబున। ఘనభుజునవసూనబాణుఘననిభవర్ణుం
గనెమారుసుకుమారు। న్మనమలరరమాకుమారుమానసచోరున్. 52

వ॥ కనియభంగానందతరంగిణీవిలసత్తరంగడోలికలనూఁగుచు రతిమన్మథులు తమ నిజనివాసంబుల కరిగిరి తదనంతర మాభుజంగభూషణుండును గైలాసంబున కేగెనంత నాపార్వతి యాత్మమనోరథ వికలత్వంబునకు మనంబున వెతనొందుచు నిట్లని వితర్కింపఁదొడంగె. 53

సీ॥ నెనరొప్ప మాయింట నేనువర్తిలుచుండ నారదుండిటకేలఁ జేరవచ్చె?
వచ్చెనుగాకేమి వామదేవుఁడు నాకు నీశుఁడౌననుచుఁదానేలఁబలికె?
బలుకెనుగాకేమిభవుఁడిచ్చ మెయిసగం బెలమినీకనుచుఁదానేలనరిగె?
నరుగెనుగాకేమిహరుఁడునావనమున కేలఁదపముఁజేయనెలమివచ్చె?॥

వచ్చుఁగాక నేమి వలిమలదొరనన్ను
నతని సేవఁ జేయుమనుట యేల?
నేను వెళ్ళునపుడె సూనసాయకుఁగిన్క
నేలఁ జంపిచని యెనీశ్వరుండు. 54

క॥ ఆహా ప్రియునకు నాపై । మోహం బిటులేకయున్న మురిపెం బేలా
యాహారమేలనీక ము । క్తాహారం బేలఁ గుసుమదామము లేలా?. 55

క॥ హరునకుఁద్రిపురాసురమద । హరునకు నవసూనబాణహరునకు నాపైఁ
గరుణమదిఁగలదొ లేదోఁ । బరికించెద ననుచునపుడు వనికిం జనియెన్.

వ॥ అట్లుఁ జనిచని భూభృద్రాట్కుమారిక యొక్క తెయు నేకాంతంబునఁ
గాననాభ్యంతరసీమఁ దఱియంజొచ్చి జంబు జంబీర మందార ఖర్జూర
కోవిదార కదంబ ప్రముఖ భూరుహచ్ఛాయల సోయగంబై యల్లిబిల్లిగ
నల్లుకొను నాగవల్లికల ప్రోకలఁ జేకొను మోకలగు పోకమ్రాఁకుల చెంత
దట్టంబుగఁ దొట్టుకొను నికుంజంబులపై కెగఁబ్రాఁకు యేలాలతానికా
యంబుల సొంపు సంపాదింప సోగలగు వాలుఁగొమ్మలఁ బజపుయభంగ
మాతులుంగ లవంగ మయూరక మధుపర్ణికా మధూక ప్రముఖ తరు
శ్రేణి కురంగట వరుసగఁ దొరకొని దుఱంగలించు కేదంగులతో భు
గులుకొని వాసనల వాసిగను దాసనములడాసి యాలింగనంబుఁ జేయు
తెఱంగున నసంగి బెనంగు మొల్లంబులగు మొల్లలఁ దేనెలు గొల్లలాడు
గండుతుమ్మెద మొత్తమ్ముల చిత్తమ్ములకళుకుఁ బుట్టించుచుఁ దంట
వింటి దంటకు గెంటని ప్రేమ వనదేవతయొసంగు నీరాజన ప్రదీపాం
కురంబులఁబోలి యొప్పారుఁ గొరకంబులుగల సంపెంగలఁదొఱయు
బండిగురువెంద తీఁగల చెంత నుప్పరంబునంటుఁ గప్పురంపు టనం
టులఁగప్పుకొని గుప్పుగుప్పున నేతెంచు పయ్యెర కఱ్ఱనితాఁకుడుల
వలనఁ దమతమ కెంగేలులెత్తి విటపులఁ బిలుచుచున్న వ్రాయన
నొప్పు కెంజివుళ్లఁగల లుంగవల్లికలచే నల్లుకొనఁబడు గుజ్జుమావు
లపజ్జలనుజ్జగించు చిన్నిపొన్న గున్నల సంపన్నతనెన్ను పొన్నుగన్నె

రులచెంతఁ దావులగు భాసించు సన్నజాజుల చెన్నుఁదన్ను మల్లికామతల్లికా వల్లికా వేల్లితంబులగు సాలతాలహింతాల రసాల పలాశపలంకషాపనసవటకుటజముఖ విటపంబుల సరస విలసిల్లు చెంచుదొరలకు నివాసంబులగు కుటీరంబులపైఁ దోరంబుఁగ నల్లుకొన్న మాలతీలతావితానంబుల పుష్పగుచ్ఛంబుల కుపమానంబులగు నిబ్బరంపు గబ్బిగుబ్బలుగల భిల్లపల్లవాధరల డాకేలుల విలసిల్లు మవ్వంపుమువ్వంపు సింగిణులు దూర్పుమాగాణ మేలెడి మణియకాని సింగిణులని భ్రమఁబడి కేకలిడుచు వీఁకనే తెంచు కేకుల కేకలు వీనులసోఁక భీతిఁ మంచిగంధపు మ్రాఁకులకు ముప్పిరిగఁ జుట్టుకొని యట్టిట్టుఁ గదలకుండు పుట్టపట్టులనౌదలలఁదొట్టుకొను రతనంబులు దాడిమీ బీజంబులని యాసించి వచ్చుచున్న చక్కనయ్యు యెక్కుడులగు పచ్చఱెక్కలుగల పక్షుల చక్కనిముక్కులు మోదుగు బువ్వులని దలంచి ధూమకేతు మండలంబునుంబోలెఁ బాంథజన సందోహంబులగుండియ లవియించు చంచరీకంబులు మధువ్రతంబులుగాన వలయాకారంబునఁ బరిభ్రమించుచు మతిసెడి తటుక్కున వ్రాలి వానిచేఁ గటుక్కునఁ గాట్లుదిని ప్రాణంబులఁ గోలుపోయి నేలంబడుచుండ నవినేరేడుపండ్లని యెంచి గుప్పుగుప్పునఁ గుప్పి గంతులిడుచు వచ్చు చిక్రోడంబుల నెమ్మొనలపై నుప్పారు నామంబులట్లగీఱునామంబులుగల వేఁటకాండ్రవలచేతుల మెఱయు గొఱక యీఁటెల దాఱుల కెక్కుడులగుచుఁబరకరాళంబులగు కంటకంబులుగల బర్బ్బురతరుల వెన్కఁబొంచియున్న చందంబున నిద్రాభిముద్రితంబులగు నిద్రభంగిచెట్లదరి నొప్పుయొప్పుగల చేమంతుల కెక్కుడులగు మెట్టదామరలకుఁ దోఁబుట్టువులగు చెంగలువల చలువలకాసించుచు నెట్టుకొనువట్టివేళ్ల చప్పరంబుల దాఁపున వెలయు కుఱువేఱుల తావులకు నిరుగుపొరుగులగు దవన మరువంబుల వలపులతోఁ జెలిమి సలుపుఁ బన్నీరుఁ బువ్వుల రాగధాతురాగంబుల నరాగంబులగు కెంజివుళ్ల మెసంగుచుఁ బంచమస్వరంబునఁ బాటఁ బాడుక

లకంఠ కంఠనాదంబుల వలనఁ గరఁగి ప్రవహించు నెలజాల సెల
యేఱులు మేటిగొజ్జఁగి నీటియేటివాగులఁ గలసి ప్రవహింపుచుండ
వలరాచ రాచవాని యాయుధాగారంబగు నయ్యేలదోఁట కెత్తిన జల
యంత్రంబులకై వడిఁ దత్తటంబుల నత్యున్నతంబులగు వేణు సంఘం
బులచే నెప్పారినదగుచు, బక క్రౌంచచక్రవాకటిట్టిభప్రముఖ నానా
జలవిహంగ సంకులంబును, ఖడ్గవ్యాఘ్రగవయ భల్లూకకృష్ణసార
వరాహచమరీప్రముఖ మృగకుల సమన్వితంబును, మదోద్దండ వేదండ
మండలమేదోభక్షణోన్మత్తహర్యక్ష సమూహ పరివృతంబును, హర్య
క్షంబుల క్షణమాత్రంబున హరింపఁజాలెడు నక్షీణశరభసందోహ విల
సితంబును, శరభంబుల గండడఁగించు గండభేరుండ నివహ విరాజ
మానంబునునై, విరించినిలయంబునుంబోలె శారద శాండిల్య గాలవ
గాయత్రీ కపిల కౌశిక సమన్వితంబై, పుండరీకాక్షు మందిరంబునుం
బోలె మాధవీ మదన విష్వక్సేన సుపర్ణక పుండరీక వైజయంతీ శుక
నారదాన్వితంబై, యమరావతింబోలె శక్ర రంభామృత సురభి సుమన
స్సముదాయైరావతపారిజాతాభిరామంబై, తేజోవతీపురంబునుంబోలెఁ
బావక మండితంబై, సంయమనీ పుటభేదనంబునుంబోలెఁ గాలాన్వి
తంబై, రక్షోవతింబోలె నక్షీణరాక్షస వంశ సంకులంబై, గంధవతీ పట్ట
ణంబునుంబోలె వరుణ విరాజితంబై, సిద్ధవతీ నిగమంబునుంబోలె శ్వ
సనాభిరామంబై, యలకాపురంబునుంబోలెఁ గుబేరశంఖకుంద శోభి
తంబై, కైలాసంబునుంబోలె జయ కుంభ బాణ పాశుపత వృష ప్రకా
శితంబై, మాహిష్మతీపత్తనంబునుంబోలె నర్జున విలాసంబై, రణరం
గంబునుంబోలె శిలీముఖ సాంద్రంబై, పౌలోమీనిటలతటంబునుం
బోలె ఘనసారతిలక ప్రదీప్తంబై, విష్ణుపదంబునుంబోలె నర్కచం
ద్రాంగారక సౌమ్య జీవ కవి మంద విభాసితంబై, లతాంతాయుధుని
తాంతజైత్ర యాత్రయుంబోలె నభ్రంకషపరాగ విరాజితంబై, కవి
హృదయంబునుంబోలె దురవగాహంబై, యొప్పునక్కాననాంతరశ్రీం

గారంబులు నిరీక్షించుచు నమృతమయూఖ శేఖరుఁగానక మనంబున
నిట్లని వితర్కింపఁదొడంగె. 57

ఉ॥ హా యికనేమిఁజేయుదుఁ బురాంతకుఁ డిచ్చటఁగానరాఁడయో
యేయెడకేగెనోఁ దెలియ దేమియొనర్చెద నేదిదిక్క న
న్నీయెడమారుసేన లలయింపఁగ సాగె నటుండ కర్థితో
నీయెడ కేల వచ్చితి నిఁకెవ్వరి వేఁడెద నో మహేశ్వరా. 58

వ॥ అని భయంబున నెక్కుతెయు నక్కాననాంతరమ్మున నడుచుచు. 59

సీ॥ నారంగజూచితే సారంగధారిని సాలంబ జూచితే ఫాలనేత్రుఁ
జందనజూచితే చంద్రఖండకలాపు మన్మథ జూచితే మదనమథను
శారద జూచితే శారదాభ్రనిభాంగు వకుళంబ జూచితే వామదేవుఁ
బున్నాగ జూచితే పున్నాగకంకణుఁదిలకంబ జూచితే త్రిపురదమను॥
బాలసహకార జూచితే నీలకంఠుఁ
గపిల వృక్షమ జూచితే కాలకాలుఁ
గంధఫలి జూచితే గర్వితాంధకహరు
నమృత వృక్షమ జూచితే యభ్రకేశు. 60

వ॥ అనియిట్లు ప్రమానిప్రమానికి నరుగుచు వేదండ పుండరీక శరభకిటి
ప్రముఖ దుష్టమృగభీషణ ఘోషణంబుల కులుకుచుఁ గరాళకంటక
మార్గంబులకునోసరిలుచుఁ దీవ్రాతపంబునకు బెగడి వృక్షంబుల నీడ
లకేగుచు నెక్కుఘనసార వేదికపయిం గూర్చుండి పరమశివుని మనం
బు స్మరింపుచుండె నంతనచ్చట గృహంబునఁజెలికత్తియలందఱుబిఱ
బిఱలేచి హిమాద్రిజాంగానక భయంబున వెతనొందుచుండ వార
లతోఁ గలవాణియను నెక్కుశీమంతిని యిట్లనిరి. 61

చ॥ ఘననిభవేణి యిప్పుడలకాయజుఁడేసెడు బాణరాజికి
న్ననముదలంకఁ జిల్కలకు మాటలు జెప్పక కేకిపాళికిం
పెనయఁగ నాట్యసంగతుల నేమియు నేర్పక నేడ కేగెనో
ఘనకుచలార యూరయుఁడు గౌరినటంచునుఁ బల్కువేడ్కతోఁ. 62

వ॥ అనిన విని చెలులందఱుఁ బార్వతిని వెదకుచుఁ జనిచని కాననాంతరంబు
దూఱి తమలో నిట్లనిరి. 63

సీ॥ అలపుష్పాదులమీఁద జలజరేఖలుబోల్చెనింతియీత్రోవనేయేగెనమ్మ
మకరందబిందువుల్మానితంబుఁగరాలెఁ గొమ్మయిచ్చటఁబూలుగోసెనమ్మ
పసరాకులోకకొన్ని పడియుండెఁబూబోఁడిచిగురులనిచ్చోటఁజిదిమెనమ్మ
దుముకుపెంచ్చుగ రేఁగెఁదోయజముఖియిట నెమలికి నాట్యముల్నేర్పె
యిచటపిశ్రమించె నెలనాగ పిఱుఁదుల [నమ్మ
గుఱ్ఱదగానుపించె ముఱువుదనర
నిచటఁబాటఁబాడె నింతులమేల్బంతి
యలరులె త్తెనలప్రియాళువరయ. 64

వ॥ అని తమలో నొకరికొకరు వల్కుచు నప్పల్లవాధర నెచ్చటంగానకఁ
జింతిల్లుచుండఁగలవాణి మఱియు నిట్లనియె. 65

ఉ॥ ఎచ్చటికేగెనో గిరిజ యెచ్చటనుండెనొ యేమియయ్యెనో
బచ్చనివింటిజోదు సుమబాణములేయఁగ నోర్వలేక యిం
దెచ్చటడాఁగెనోఁ తెలియదేమిటఁ జేయుదు మమ్మలార యిం
కెచ్చటఁజూతుమమ్మ యిపుడెయ్యది దిక్కని బోవుచొక్కచోఁ.66

క॥ మదసింధురయానలు స । మ్మదమున నీక్షించి రబ్జముకుళోరోజ
న్మనయుతభృంగశిరోజ । సదమలముఖకాంతి విజితజలజన్గిరిజన్.67

మ॥ కనిడాయంజని యిట్లుబల్కిరకటా కన్యాశిరోరత్నమా
మును మమ్మొక్క నిమేషకాలమయిన న్మోదంబుచేఁ బాయనే
రని నీవెట్లుగ నొంటివచ్చితివి కీరంబుల్పికంబుల్ ద్విరే
ఫనికాయంబులు హంసము ల్గలుగు దుర్వారాటవిన్ జూడఁగాన్. 68

క॥ తెర శల్లఁబరాగముచే। భరితంబై యుండెఁగాన బరువసమున నీ
చరణంబులెట్లుమోపితొ। బరికింపఁగఁజిత్రమయ్యెభామరొయిపుడున్.

సీ॥ డంబమై సురుచికదంబమై నిందితబింబమై యొప్పు కెంబెదవి తోడ
గుత్తమై విలసితవృత్తమై విరులబల్మొత్తమై యలరు చన్మొనవు తోడ

రమ్యమై పటు విభాగమ్యమై వరబిససామ్యమై దగుభుజా సరణితోడ
నందమై విధిమూలకందమై జిగురులచందమైనట్టి హస్తముల తోడc॥

గ్రూరభావంబుతోనుండు కీరములను
బంభరంబులు హంసముల్పరభృతములు
వరలుచున్నవి యిందేల వచ్చితమ్మ
యద్రిసుతవాటcగాంచితి మబలనేcడు. 70

చ॥ అని చెలులెల్లcబల్కవిని యద్రితనూభవవారితోడ ని
ట్లనియెలతాంగులార సుమనాస్త్రునికోల్తల కోర్వలేక నీ
ఘనవనసీమలందిరిగి కాలగళుంగననచ్చు నంచునే
ననుకొనివచ్చి యిచ్చటcబురారినిcగానకయుండు నంతటన్. 71

ఉ॥ నెచ్చెలులార యేమనుచు నిక్కముగా వచింతు వేడ్కతో
నిచ్చకువచ్చినట్టులలయింటికడ న్వసియించియుండకే
నిచ్చటcజేరుటెల్ల మునుపింటను గొల్లని సంతలోపలం
జొచ్చినరీతిదోcచె స్మరచోరుcడు వెన్నడబుద్ధినల్పునే? 72

వ॥ అనినc గలవాణి యామె కిట్లనియె. 73

గీ॥ ఆయొగానిమ్ము చెలియరోయంతయేల?
నీమనోరథ మీడేరు నిక్కముగను
గానవెతcజెందకుండుము కంబుకంఠి
యనుచుబోధించుచుండంగ నగతనూజ. 74

వ॥ మనంబున ధైర్యంబూని మెల్లనజనుచున్న సమయంబునc గలవాణి
మఱియు నిట్లనియె. 75

గీ॥ చూచితివటమ్మ యీవని చోద్యమెల్లc
బరభృతంబులు గీరము ల్భ్రమర చయము
మందపవనుం డనంగుండు మాధవుండు
శిఖిచయం బంచలును గూడి చెలcగుచుండె. 76

ఆ-వె॥ కాన మనమునిచటఁ గాంతలతోఁ గూడి
కొంత ప్రొద్దు పూలు గోసి చిగురు
లెల్ల గిల్లి ఫలము లెలమిఁ దీసి వసంత
పూజఁ జేయవలయుఁ బువ్వుఁబోఁడి. 77

ఆ-వె॥ అనఁగ నిట్టు లనియె నాగౌరి చెలులతోఁ
జిత్తభవుని దండు జెలఁగుచుండె
నిచట నిల్వ మనల కుచితంబు గాదనఁ
గాంత లలరి యనిరి గౌరి తోడ. 78

వ॥ మేమందఱ మిక్షణంబ బోయి ప్రసూనాంబకు సేనలం బవిలి గలంచెద
మని యంబికా యోషం దోడ్కొని చనిచని ముందట. 79

సీ॥ పరభృతంబులనెల్ల భయపెట్టె నత్తఱిరావమాంగి యొక్కతె రమ్యముగను
శుకరాజములనెల్ల సూటిగాఁ బడఁదోలె స్వాంకవామోదవేచలము నెరయ
భ్రమరసందోహంబుఁ బరువెత్తఁగాఁ జేసె నయమునఁ గాంచననాస యొకతె
మలయాగసంభవమందమారుతముల భుజగరోమాళి యింపుగనుగలఁచె॥

జలదవేణి యొకతె యలమరాళంబులఁ
బాఱఁదోలె నిట్లు బడతులెల్లఁ
జిత్తభవుని దండుఁ జెదఱఁ జేయఁగఁగల
వాణి గౌరిఁ గాంచి పలికె నిట్లు. 80

క॥ కుసుమాసవంబుఁ గడు వే । క్కసముగఁ గడుసారఁ గ్రోలి కాంతారములో
మసలెడు మరుగుణవృత్తిని । నసితాబ్జేక్షణ మలీమసాళులఁ గంటే॥ 81

క॥ మలయాగనిలయుఁ డిపుడు । జ్వాలగతి నేతెంచి గహనవాటి మసలుచుఁ గా
లలనా నీయారుం గని । బిలేశయభ్రాంతిఁ డిందివీ చెడుగనుమా. 82

ఆ-వె॥ వనిత చూడు మాధవునిపైని వనలక్ష్మి
జాలుగా నిడుదలఁ బ్రాలు వ్రాలె
మలయమారుతంబు సలలితంబుగఁ దాఁక
రాలుచుండెఁ బూలు రాజితముగ. 83

క॥ అంబురుహనేత్రబింబ ఫ । లంబులననిశంబుఁదిని వెలయు కీరము నీ
బింబాధరామృతముఁ ద్రా । వంబరుగున నేగుఁదెంచెఁ బరికింపుతగన్.

క॥ చెలియాకనుమదె కేతకి । నళి రుద్రాక్షలుధరించి యహిభూషి తయై
యలధూళి కాభసితమునుఁ।గలదియగుచుశివుని కరణిఁగనుఁబడుచుండెన్

సీ॥ తిలకించితే మాలతియుఁ బుష్పవతియయ్యె
నతివరో మఱిఁదాని నంటబోకు
వెలఁదియేలాలత విటపసంగతి నొప్పెఁ
బరికించుమచ్చోటి కరుఁగఁబోకు
మానినీమణికంటె మాధవి మధుప్రాప్తిఁ
జెలఁగుచుండెనుదానిఁ జేరఁబోకు
రమణి ద్రాక్షావల్లి ప్రసవయుక్తంబయ్యెఁ
బండ్లిగిలించె నావంకఁగనుము॥
మగువచూడుతీఁగె మల్లియకుసుమ సం
కలితమయ్యెననుచు సలలితముగ
గౌరితోడనిట్లు గలవాణి సరస వా
క్యంబులాడుచుండె నతి ముదమున. 86

వ॥ అంత॥ 87

ఆ-వె॥ ఉవిదయొకతె తీఁగెయుయ్యెల నూఁగంగఁ
జొచ్చెచరణయుగళశోభ కిసల
యములతలలు దన్నునలనఖపంక్తులు
దారకాళిపైకి దండువెడల. 88

గీ॥ గిరిజ సంపెంగపువ్వును గిల్లి దాని
మొల్లమగుతావిఁగొనుటకై ముక్కుముంద
ఱనిడ సౌందర్యభిక్షఁ గైకొనఁదలంచి
వచ్చెనని దానిఁగని నవ్వె వనితయొకతె. 89

దోహదములు.

సీ॥ అగజ నీచేనంటునదియ తియ్యనిమావిముదితనీవెదఁజేర్చునదియ క్రోవి
బాలనీచేఁ జూడఁబడినది తిలకంబు జానసీవు మిసినదేను పొగడ
నెలతనీపుడు తన్నినదియశోకంబు వెలఁది నీవెలమినవ్వినదిపొన్న
సుదతినీవెదిరించునది కాంచనము చెలియరొనీవుపాడినయది ప్రియాళు॥
వరయునాతి నీవు సరగునఁజల్లనూ
ర్చినదివావిలమ్మ చెలఁగి యిపుడు
నీవు పలుకునదియ నిక్కంబుఁగాగోఁగు
గాన వీనివిరులు గరుణఁగొనుము. 90

వ॥ అని యిట్లు శతపత్రపత్రనేత్రలు సరసవాక్యంబులాడుచుఁ బుష్పాప
చయోత్సాహచిత్తలై తమలోన. 91

హయగతి రగడ.

కొమ్మ కొమ్మలు వంచి పూవులఁ గొనక కొనకది యేల నిక్కెదు
కొమ్మ కొమ్మ యటమ్మ ద్రుంచుము గోరఁగోఁరకములనుఁ బొక్కెదు
వనిత వనితరులందు నూరుపు వలన వలనగు సింధువారము
దనరు దనరుచిమెఱయఁబూయుచుఁ దరుణితరుణిత కర్ణికారము
వెలయ వెలయని వెలకుఁ జూపుచు వింత వింతగ మాటలాడెద
వళికి యళికి పరుంగు లిడుచును నలసి యలసి కతముల నాడెద
వతివ యతి వర్ణితము లగుచును నలరు నలరులఁదునుము జెల్లెలు
నతను నతను శరంబులై చెన్నారు నాఁటుచిరంపు మల్లెలు
ముదిత ముదితతె నొందిగాంచుము మొల్లమొల్లముపైని భసలము
మదిర మదిరహిఁ గ్రోలుచున్నది మాటి మాటికిఁ జూచి మసలుము
లేమ లేమలయానిలుం డవలీల లీలల ననలు ద్రోసెను
రామ రామ యటంచు దగ శుకరాజి రాజితముగను గూసెను
బాల బాల రసాలములపై వ్రాలెవ్రాలెడు వేడ్కఁగీరము
యేల యేలక లతలఁజేరెద విచ్చు నిచ్చట గంధసారము

బొగడ బొగడలఁ గూడె బి త్తరి పొన్న పొన్నల చెంత మెలఁగుము
పగలు పగలుగనుండు కౌశిక పాళి పాళి కొకింతఁ దొలఁగుము
యక్క యక్కలకంతములఁ గనుమమ్మ మమ్మరఁజేయ కిప్పుడు
జక్కజక్కవ కవలు గలసెనుఁ జాన జానగు విరులు జొప్పడుఁ
బూని పూనిక తోడ గిల్లుము పూప పూపందిరులఁ గంటివె
మాను మానును పోఁక బోదెల మరుగు మరుఁగుచు నేమనంటివె.

వ॥ అని యివ్విధంబున నన్యోన్యసంభాషణ తత్పరమాన మానసలై
జనుచు నయ్యరవిందలోచనానిచయంబు మెలంగుచుండెనట్టియెడ. 93

సీ॥ కుందంబులనుఁద్రుంచెనందంబుగానొర్తుతనదంతములఁబోలవనుచునెంచి
పొన్నపూవులఁగోసె నన్నుతాంగియొకర్తు తననాభినివిబోలవనుచునెంచి
చంపకంబులఁదీసె నింపొందిసతియొర్తు తననాసికనుబోలవనుచునెంచి
మొగలిఱేకులగిల్లె వగలాడియొక్కతె తన నఖంబులఁబోలవనుచునెంచి॥

లలన లెల్ల నిట్లు జెలఁగుచు వనిలోని
పూవు లెల్లఁగోసి పొలుపు మీఱఁ
జనుచుఁ జనుచు నంతఁ జక్కనయ్యబలంబు
నెదురఁ గాంచి భీతి యెదలఁ బొదల. 94

వ॥ తమలో నిట్లనిరి. 95

సీ॥ కిసలయంబులనెల్ల గిల్లివైచితిమింక గండుఁగోయిలలెంత మండిపడునొ
కుసుమరసంబెల్లఁ గ్రోలివేసితిమింక హిందోళచయమెంత యెగిరిపడునొ
సకలఫలంబులఁ జవిఁజూచితిమి యింక గడుసుకీరములెంత మిడిసిపడునొ
వనిలోని సకలంబు వఱదలాడితిమింక నలవసంతుండెంతయలిగిపడునొ॥

గాన నిచట నిల్వఁ గార్యంబు గాదింకఁ
జేడె లార యిపుడ చెలఁగి మనము
పరుగు తోన నేగి మరున కీపూవులు
బూజఁ జేయవలయు రాజితముఁగ. 96

గీ॥ అనుచు నీరీతి దమలోన నాడు కొనుచుఁ
జెలులు వనకేళిఁ జాలింప స్వేద కళిక
లొదవెఁ గుచ కుంభ ములపయి నురు పయోధ
రాభిధానంబు దృష్టాంత మైచెలంగ. 97

ఆ-వె॥ ఘనతరముగ మనము వనకేళి నొనరింప
నలత కలిఁగె ననుచు ననిరొ యొక తె
ఘనతరముగ మనము వనకేళి నొనరింప
నలత తొలఁగు ననుచు ననిరొ యొక తె. 98

వ॥ అనిన సమ్మతించి. 99

క॥ ఆ కమలాక్షులు గాంచిరి । నాక ధునీ చుంబి తుంగ నట దమలాంభ
శ్శీకరగణ రంగచ్ఛో । భాకలింబైన యొక్క పద్మాకరముఁ. 100

సీ॥ అనిమిషామృత పరివ్యాప్తమైయలరారి రాజహంస ప్రభారాజిఁదనరి
మకరకచ్ఛపవరమహితమై శోభిల్లి శంఖచక్రావాప్తి సలలితమయి
పృథులకుముద పుండరీక సంకలితమైయల లక్ష్మణోపభోగ్యగతివరలి
శృంగారకవిలోక సేవితంబైయొప్పి పటుశిలీముఖసాంద్ర పటిమనలరి॥
దనరె సురపురి ఘన పథ ధనద నిలయ
హరి కరద్వంద్వ హరిదంత రాంచి తోర్మి
శాని కేతన నృపసభాస్థాన సీమ
సంగరస్థలిఁ బోలి కాసార మాళి. 101

వ॥ అట్టి సరోవరంబుఁబొడఁగాంచి యవ్వారిజనయనలు జనితానురాగలై
మేనకాత్మజ కిట్లనిరి. 102

చ॥ శరచరనేత్ర కోకకుచ చారు వికాస సరోజవక్త్ర భా
స్వరతర కంబుకంఠి ఘనశైవలవేణి యుపీచికావళీ
వరకలహంస యానయయి వర్తిలుచున్న సరోవరేందిరం
గిరిసుత జూచితే యిుచటఁగేళియొనర్చెదమన్న వేడ్కతోఁ. 103

సీ॥ కమల ముఖులార యట్లగుఁ గాక యనుచు
జలక మాఁడుటకై చాల సంత సంబు
మదినిఁ బెనఁగొనఁ గంచల ల్గుదియఁ గట్టి
చెలులతో గౌరి సరసి లోపలకు డిగెను. 104

క॥ అత్తటి బిత్తరులెల్లనుఁ । జిత్తజ బాణములఁబోలెఁ జెలఁగుచుఁజేతు
ల్దత్తఱమున బిగఁబట్టుచు। గుత్తఁపు పాలిండ్ల బంటిఁ గొబ్బునఁబోవన్. 106

వ॥ అంత.

చ॥ భసలములంగలంచుచునుఁ బద్మమరందముఁద్రావి వేడ్కతో
గుసగుసమాటలాడుచునుఁ గోకములం బెదరించి జోపుచున్
బిసములఁద్రుంచుచు న్మిగులఁ బెంపఱఁజేయుచురాజహంసలం
గుసుమ శరాళిఁ బోలు మదకుంజర యానలు గేళి సల్పఁగన్. 107

క॥ ఘనవేణి యొకతె గొబ్బునఁ।జని కలహంసములఁదోలె సరగున నాలో
నన చంద్రవదన కోకము।లను భయమందంగఁజేసె లలనలు మెచ్చన్.

సీ॥ చేడె యొక్కతె కాంచన శృంగమూని
సరగున నొకర్తుపై నీరుజల్లి మునుఁగ
లలనకొప్పని పట్టి శైవలము నాపె
దానిఁగని నవ్విర త్తఱిఁ దరుణు లెల్ల. 109

ఉ॥ ఒక్కతె వెల్లకిల్లఁబడి యూర్మిచయంబుల నీఁదుచుండఁగాఁ
జక్కని చిన్నిచన్నుఁగవ చక్రములంచుఁ దలంచి వేడ్కతోఁ
జక్కవలేగుదెంచి సరసంపు మొగంబునుఁ జూచి భీతి న
మ్మక్కరొ తిక్కరాయఁడని యాచిన తటుక్కునఁ బాఱె మింటికిన్.

సీ॥ కలశ మొక్కటి నీటిలోపలను వైచి
యీఁదుచుండుదు రవనిలో నెల్లవార
టంచుఁ గుచకుంభయుగ్మంబు నలరఁజేసి
యీఁదసాగిరి చెలులెల్ల నెలమితోడ. 111

ఆ-వె॥ అగజ మోము దమ్మియనుచుఁ దుమ్మెద లేగు
దేరఁ బాణి విసరి పాఱఁదోలె
నదియు పద్మమనుచు నరుదేరనాసికా
సురుచి చంపకంబుఁ జూపి దోలె. 112

వ॥ మఱియును. 113

సీ॥ చెలుల మోములకోడి చెలువైన నలినము
ల్గమలాతనూజు బాణములఁ జేరె
జవరాండ్ర కన్నుల చక్కఁదనముకోడి
చేపలెల్లను మారు సిడముఁ జేరె
లలనల కచపాళి లావణ్యములకోడి
తుమ్మెదల్మరుని గుణమ్ముఁ జేరెఁ
దరుణుల వాక్య మాధురికోడి యమృతంబు
మనసిజు డాకేలి ధనువుఁ జేరె॥
హరుఁడు కంతుని సమయించు నపుడు జెదరి
యివ్విధంబున నెలతల కెల్లనోడి
మఱియు నతనునిఁ బ్రాపించి మహిమతోడ
భయము లేకుండఁ జేపట్టె వాని నతఁడు. 114

వ॥ అంత. 115

సీ॥ పద్మారిముఖిగలంపఁగఁ గోకకుచ యోర్తు
భోగిరోమాళి దాపున వసించె
భ్రమరవేణి యొకర్తు బాధింపఁ బుష్పాంగి
గాంచననాస వెన్కఁదనుఁ బోయెఁ
గలహంస గామిని గాసిజేయ మృణాళ
బాహ యభ్రచికుర పజ్జఁ జేరె
పరభృతకంఠి నొంపగఁ గిసలయపాణి
రామాంగి దరిఁ జేరె రమ్య ముగను॥

నెనరఁగాఁ గీరవాణి బింబోష్ఠిఁ దాఁకఁ
గలఁగి యదిబోయె సాంకవ గంధి దరికి
నిటుల జలకేళిఁ జేయుచు నింతు లెల్లఁ
జెలఁగి యుత్తటిఁ దీరంబుఁ జేరి రెలమి. 116

క॥ ఇల ఘనసామ్యము గొప్పల । కలరంగా నుండెననుచు నత్తఱి లోకం
బులు దెలియునట్లుగురిసెను। లలనలతుఱుములను వెడలిలలిజలధారల్.

క॥ అంతటఁజెలులందఱుఁదమ । కుంతలములనార్చి వేగఁగుసుమంబులనం
దంతటముడిచివసంతునిఁ। గంతునిఁబూజించు వేడ్కఁ ఘనముగనొదవన్.

క॥ మాకందభూరుహముదరి । నాకమ్మనివింటివానినరుదుగనిలుపం
గోకిలవాణులుదమలోఁ । బ్రాకటముగఁదలఁచియచటఁబటుతరభక్తిన్.

గీ॥ దట్టముగ నడ్డు కేదంగి దళ్లు గట్టి
తలిరుటాకులు దోరణంబులుగఁ జేసి
కాంచనంబులఁ గొన్నిటిఁ గలయఁ జల్లి
బొండుమల్లెలు బూజసల్పుటకుఁ దెచ్చి. 120

గీ॥ మృగమదంబునఁ బన్నీరు మేళవించి
పొలుపుగా నేలనలికి గప్పురపు ముగ్గు
లిడి కమలకర్ణికను బీఠ మెలమిఁ జేసి
యిక్షుకాండంబులను నిల్పి యింతు లపుడు. 121

క॥ కంతుని వామాంకంబున
సంతసమున రతిని మఱి వసంతుని యలస
త్సంతతి విభు నెదురను నా
చెంతను శుక పిక చయంబుఁ జెలఁగుచు బ్రాయన్. 122

సీ॥ ధ్యానంబు కమలాస్త్రధారికి నావాహ
నము వారిచరకేతునకును నర్ఘ్య
పాద్యము ల్మానస భవునకు నాసనం
బంధకాసుర శాత్ర వాహితునకుఁ

జందనం బబ్జజానందనునకుఁ బుష్ప
        ములు మాధవప్రియ కలిత మతికి
ధూపంబు మరునకు దీపంబు మలయసం
        జాతమరుత్ప్రాణసఖున కరయ॥
    సకల ఫలములు నైవేద్య మకుటిలునకు
    ననుచు నర్పించి వేడ్కతో నబ్జముఖులు
    మార సుకుమార మానసచోర మార
    మార యనుచును వినుతించి మఱియు నప్పుడు. 123

క॥ దండము నీకిదె నండజ। కాండ సుతా కాండజ ప్రకాండా శుక వే
దండా రణశౌండా ధృత। శుండా చండప్రచండ సుమకోదండా. 124

క॥ నీయస్త్రంబుల కెదురే। తోయజభవ రుద్రులైనఁ దోయజ కాండా
తోయజముఖులన నెవ్వరు।నీయమ్ముల ధాక కోర్వ నిజముగఁ జెపుమా.

క॥ ఖండేందుమౌళిఁ గెలచిన। దండిమగడ వయ్యు నిష్టు తరుణి నలచుటఁ
ల్కొండె త్తినట్టి కేలను। వెండియు బంతెత్త దివ్వరు విధమయ్యెఁ గదా.

చ॥ పలుకులు వేయునేల విను పాంథుల నేచకు నేఁటనుండి నీ
జరుహబాణము ల్బరవు శంభునిమీఁదనుఁ జంచలాక్షులం
జలమునఁ బట్టి యేచుటిది సజ్జనధర్మముగాదుజుమ్మి యో
కలితరతీ భవారి శుకవాహ నితాంత లతాంత కుంతుఁడా. 127

క॥ అని యిట్లు బలుకు నవసర
మున శారీ శుక పికాది మొన విడియుచు నా
మనసిజుఁ డెదురను దోతెం
చిన విధముగ మదికిఁ దోపఁ జిడిముడిఁ బడుచుక్. 128

ఉ॥ అత్తఱిద త్తఱంబడర నద్రితనూభవ మానసంబునం
దుత్తలమందికీరహయుఁ డుగ్రతనేయు శరాళికోడియా
బిత్తరులందఱు న్మిగుల బెగ్గడిలంగనుమూర్ఛఁబోవ నా
చిత్తజభల్ల భగ్నయగు చెల్వఁగనుంగొని చేడెలందఱున్. 129

మ॥ అకటా యీవెతనోర్వఁగా వశముగాదమ్మయ్య మీనాంక సా
యక సంఘాత నిపాతమగ్నయగు నీయంభోజ పత్త్రాక్షినే
సుకుమారాంగికిఁ జూప మేలోదవునంచుం భీత చిత్తాబ్జలై
వికచాంభోరుహ పత్రలోచనలు వేర్వేరంగుముల్గూఁడుచున్. 130

క॥ శిశిరోపచారముల నా। శశివదనకుఁ జేసిరిట్లు సరగున నంతన్
శిశిరజలబిస నికరముల । శశికాంతేం దీవరఘన సారాదులచేన్ ॥ 131

వ॥ అంత. 132

ఉ॥ చందన గంధియోర్తు జలజాతములంఘ్రులఁ జేర్చె నొక్క యిం
దిందిర వేణి రంభలను దీరుగనూరులనుంచె నొక్క పూ
ర్ణేందునిభాస్యకై రవము లేక్షణ యుగ్మమునందు నిల్పె సం
క్రందన గోపపాణియొకకాంత బిసంబులఁగూర్చె బాహులన్. 133

వ॥ అంతఁగలవాణి మేనకాత్మజ కేలుఁబట్టి యించుక తడవు నాడీ పరీక్షఁ
జేసివాజ్నిపుణత్వంబు మెఱయ నొక్కసీమంతినీలలామకిట్లనియె.

గీ॥ పూర్ణచంద్రోదయంబన్నఁ బొగులుచుండు
వాతరాక్షస నామము చేతఁగుందు
నీలకంఠరసంబున గ్రీలునేమొ
బాలికామణి మదన తాపజ్వరంబు. 135

వ॥ అనుచున్న సమయంబున. 136

చ॥ అతివలు నీలకంఠరసమన్న సువాక్య సుధాప్రవృష్టిచే
నతనుశరానలార్చి వడియాఱినఁ బూర్వధరాధరాగ్ర సం
స్థిత తరుణారుణాంశువులచే వికసించు సరోజకోరక
ప్రతతినిఁబోలె గౌరి వితతంబుగఁగన్గవవిప్పి చెల్వితోన్. 137

వ॥ నెచ్చెలుల కిట్లనియె. 138

ఉ॥ శంబర నేత్రలార యదృశత్వమునం బడుయామనః ప్రభూ
తంబును సుగ్రమంత్రముల దారితుఁజేయుడు రేలు బైట చా

రంబులు సల్పుగామునకు రంజిల. వేల్పుల వేఁడిపోకు ద
య్యంబున హీనమైన క్రియనార్తిఁ దలంకఁగఁ జేయుఁడుద్ధతిన్. 139

వ॥ అనిపల్కుచు మదనవేదనా భరాక్రాంతయగు మేనకాత్మజం గని కల
వాణి యిట్లనియె. 140

క॥ రాముం గాముం భీముం। బాముం బ్రార్థింపవమ్మ పరభృతరాకా
సోమాం బుజబాణా వా। చీమారుతు లెపుడుఁగాసిఁ జేయరునిన్నున్.

వ॥ అనిన దీనావనతానన తామరసయై మారాడకుండు గిరిరాజ కుమారిం
గనుంగొని నెచ్చెలు లిట్లనిరి. 142

క॥ బాలా చేలవలె న్నీ। వీలాగునఁ జింతనొందె దేలామేలా
వీలా గోలకుఁదాళుము। బాలేందు సమాన ఫాలభర్గునుచేలా. 143

వ॥ అని మఱియును. 144

సీ॥ మారునినెమ్మోము మంటనుక్కఱిపోయెఁ
దొనతేనిబింబంబు దొండిఁబడియె
మాధవుబ్రతుకెల్ల మఱికానపాలయ్యె
వాతపోతముబాముపాతఁబడియెఁ
గీరవారంబుసంకిళులపాల్పడియెనుఁ
గోయిలపుట్టిల్లు గూలిపోయె
మధుపానమత్తత మతిఁజెడెమధుపము
ల్బహార్ఁలమురిచెట్ల పాలఁబడియెఁ॥
గానవీరిచేనేమికాగలదునీకు
నేటినుండియు ధైర్యంబు నెమ్మినిడుము
వనితయావంత వలవంత వలవదమ్మ
యనుచుఁ జెలులెల్ల బోధింపనగతనూజ. 145

వ॥ మనంబున నించుక ధైర్యంబూనియున్నయెడ బాలికలు మందమంద
మధురాలాపంబుల నామె నూఱార్చుచు నిజనివాసంబునకు దోఁడు

కొనిపోయిరని చెప్పినఁ బరమానందభరితుండై ధర్మనందనుండంట
మీఁది వృత్తాంతం బెఱిఁగింపుమని మార్కండేయు నడుగుటయును.

క॥ శ్రీరామ బాణవిదళిత। తారాధిప వదనవిజితతారాధిప శృం
గారాకారా ధీరా। ధారాధరనీలదేహా దశరథతనయా. 147

ఉ॥ శ్రీమహిమాభిరామ శశిశేఖరసన్నుతనామ నీరద
శ్యామ ముఖాంబుజద్యుతివిజితశారదపార్వణసోమ భూమిజా
కామ తనుప్రకాశసమకామ నరేంద్రలలామ సద్గుణ
స్తోమ సురారిభీమ పరిశోషితభార్గవరామవిక్రమా. 148

ఉత్సాహవృత్తము॥

సారసాక్ష భక్తరక్ష సర్వలోకనాయకా
సారసాప్తకులపవిత్ర సన్మునీంద్రసన్నుతా
శారదాభ్రహారహీర సద్యశోవిశేషవి
స్తారసారధైర్యధుర్య సన్నుతాంగశోభితా. 149

గద్య॥ ఇది శ్రీపరమేశ్వర కరుణా కటాక్ష సమాసాదిత సహజ పాండిత్య
సరసకవితాధురంధర ఘనయశోబంధు రాపస్తంబసూత్ర
భారద్వాజసగోత్ర పేరూరుద్రావిడ శ్రోత్రియ బ్రా
హ్మణార్యసోమయాజి కులజలధిజైవాతృ కారుణా
చలేశ్వర తనయ నయగుణవిధేయ లక్ష్మీనా
రాయణ నామధేయ ప్రణీతంబయిన
శివకథా సుధారసంబను మహా
ప్రబంధంబునందు ద్వితీ
యాశ్వాసము.

---

శ్రీపరమేశ్వరార్పణమస్తు.

---

శ్రీరస్తు.

శ్రీరామాయనమః.

శ్రీమహాగణాధిపతయేనమః.

శ్రీ శారదాంబాయైనమః.

# శివకథాసుధారసము.

## తృతీయాశ్వాసము.



క॥ కౌసల్యానందన। నాకాధిపవినుతపాదనాళీకఖలా
నీకహరవదననిర్జిత। రాకాహిమధామరామరాజలలామా.

వ॥ దేవా యవధరింపుము మార్కండేయ మహామునీంద్రుండు ధర్మ నందనునకుఁ మీఁది వృత్తాంతం బిట్లనియె నంత నక్కడఁ గైలా సంబునఁ జంద్రశేఖరుండు డెందంబున నచలేంద్ర నందిని సౌందర్య విశేషంబులఁ దలంచి యిట్లని వితర్కింపఁ దొడంగె. 2

సీ॥ కనకనూపురఘుణంఘుణరవంబులతోడ
బెడగారుకలకంఠినడలతీరు
ధవళకాంతులతోడ ధగధగ లాఁడెడు
తరళాయతాక్షిదంతములబారు
నమృతధారాప్రవాహము నెఱపెడు ముద్దు
గుమ్మ చక్కని పలుకుల బెడఁగు
దళ్కుతళ్కనఁ గాంతిఁజిల్కు మోహంబొల్కఁ
బొనరుచుండెడు చెలిమోముసొగసు

నెనరపరమహంసలను ముక్తౌఘములను
రమణశుకమహాత్వంబును రాజయోగి
నరయవలపించి యధిక మోహమునముంచి
జాఱఁగొని రాగిలఁగ సేయునౌర తలఁప. 3

వ॥ అని మఱియు ఘోరమార వికార ఘూర్ణీకృత వివేకుండై. 4

సీ॥ చలిగట్టు దొరపట్టి చనుగట్టు లనుఁబట్ట
నమకట్టి గట్టు విల్సరవిఁబట్టె
నరవిందముల నోము నందమా సతిమోము
దళిఁగాంపఁదొవవిందుఁ దాల్చె...ను
బలుమీన ములనేలు చెలివాలు కనుదోయిఁ
గనఁబూనినిడెఁ గేల గాలిజక్కి
మరునారి గమిగేరు విరిబోఁడి నూగారుఁ
బడయ వహించె సర్పముల నె..డల
ననఁగ భవుఁడమ్మగువరుచిరాంగములనుఁ
బోలుపరికరములఁదాల్చి ప్రొద్దుఁగడపు!
నరయఁగామారికైన మోహంబుఁ గలుగఁ
జేసె నామేనకాత్మజ చెలువమహహా. 5

వ॥ అట్టియెడ మనోజవేదనానల సంతప్త హృదయుండగు సదా శివు
నకుఁ జెంగట మెలంగు భృంగి యిట్లనియె. 6

క॥ స్వామీ దేవ ప్రచండం। బేమోఁగడువింతయగుచునిప్పుడుతోఁచె
న్నామదికినిట్టికారణ। మేమొండెను తెల్పుమయ్యయిభదైత్యహరా. 7

వ॥ అనిన సర్వేశ్వరుం డిట్లనియె. 8

గీ॥ గౌరినెడఁబాసికంటినికడువికలత
యేమియునుఁదోఁచకున్న దింకేమొనర్తుఁ
గన్నులకుఁగట్టినట్లుండెఁ గలికియిప్పు
డనఁగవినిభృంగినవ్వుచుహరునకనియె. 9

ఆ-వె॥ స్వామినాథుఁజూడ హైమవతీకన్య
యాదిశక్తియౌనఁటంచుఁదోఁచుఁ
గానియెడలనిచటఁగనుపించుటదియెట్టు
లింకసగము సేయు నీశమిమ్ము. 10

క॥ హరుఁడిట్టులనియెభృంగీ। శ్వరయేమగుఁగానిగౌరిసందర్శింపన్
ద్వరపడుచున్నదినామన। మెఱుకలవేషంబుఁబూనియేగెదనఁటకున్. 11

గీ॥ ఏగి యింతినిఁ బొడగాంచి యిటకువత్తు
ననుచు భవుఁడన భృంగి యాతని మొగంబుఁ
గాంచి మీతోడ నెఱుకల కాంతనగుచు
నేను వచ్చెద మోదంబు నెఱపుకొఱకు. 12

వ॥ అనినఁ దత్క్షణంబ. 13

తే-గీ॥ రతిని నిరసించి సప్తాశ్వరాణినెంచి
కమలజనుమించి భారతీకాంతమంచి
యందము జయించి మోహిని నపహసించి
య భవుఁ డెఱుకల సానియై యప్పుడొప్పె. 14

చ॥ కరములగాజులు న్మెఱయు కంధరసీమనుఁ బచ్చపూసలు
న్శిరమున మంచి బుట్టయునుఁ జెన్నలరారెడు సోయగంబు పెం
పరసిన గిల్కు మట్టియలు నందపు గిల్కులు హస్తమందు నా
మెఱుకల యింతికిం గువలయేశుని దంతికి మేలుబంతికిన్. 15

వ॥ ఇవ్విధంబున సర్వలోకేశ్వరుం డెఱుకలకాంతయై పార్వతి యింటికేగఁ
బోవు సమయంబున. 16

ఉత్సాహవృత్తము.

తాటిబుట్టఁదలనుబెట్టి తగినకొత్తగిల్కల
న్నీటుగా ధరించి మంచి నీతులెల్లఁ బల్కుచు
న్నాటిమీఱ సవతి యనుచు శూలివెంట మేలపు
న్మాటలాడుకొనుచు నరిఁగె మగువయగుచు భృంగియున్. 17

వ॥ అట్టియెడ హరుండు భృంగింగని గిరీంద్ర నందిని మందిరంబునకు
ముందుఁగాఁ జనుమన నట్లగుఁ గాకయని తన్నియోగంబున నెఱుకత
వలె బిచ్చం బడుగుచు నెఱుకఁ జెప్పుచుఁ జనిచని హైమవతింగని
యామె కిట్లనియె. 18

సీ॥ అవ్వ యోయవ్వ యోయవ్వ మారాణి వే
యవ్వ భాగ్యము గల్గి యలరవమ్మ
పాఁడి పంటలు గల్గి ప్రబలుదు వేయవ్వ
సిరిగల తల్లివి సిద్ధముగనుఁ
గొడుకుల కోటవై కొమరారుదోయవ్వ
చుట్టాల సురభివై సొంపుతోడ
మూడు జగంబులఁ బ్రోవఁ బుట్టినతల్లి
యమ్మ వా గమ్మవా రమ్మ యనుచు॥
నమ్మ జగదంబ జగదంబ యమ్మ వినుము
నీదు బంగారు కాళ్లకు నిక్కముగను
మ్రొక్కెదను బిచ్చమును వేసి మోదమలర
బుత్తిగానికిఁ గమికెడు బువ్వఁబెట్టు. 19

సీ॥ సోడిగాఁ డి త్తఱిఁ జూడు నీపై బత్తిఁ
గలిగిజుంజుమ్మని కదలివచ్చు
నీజోట్టి యిప్పుడు నేతిలోఁ బడనుండె
నీకోర్కె గట్టెక్కె నిజముగాను
నామాట నమ్ముము నాయందు దయనుంచు
నిజముఁ జెప్పెదనమ్మ నీకు నేను
యమ్మ మాయమ్మ మాయమ్మగో వినవమ్మ
బిచ్చంబు నిడుమమ్మ బిరితిఁగొమ్మ॥
యనఁగ విని గౌరి దానితో ననియె నపుడు
నెఱుక నడిగెద నిజముగా నెఱుకఁజెప్ప

నడిగి నట్టిత్తు నీకిప్పు డడుగవలయు
నసఁగ నామాయ మెఱుకత యామెకనియె. 20

సీ॥ ఎఱుకఁ జెప్పుటకిప్పు డేమి తోఁచదు నాకు
నా యవస్థను విను నాతి నీవు
నా పతి నన్నును నా తోడి వారల
విడచేదా నొక కొండ వెలఁదిఁ గూడ
వలసి ద్రిమ్మరియెడు వాని జాడను నేను
వచ్చి యుంటినినుమ్ము వనిత వినుము
సూచాయలేఁగాని సూటిగాఁ జెప్పంగఁ
జాలను సుమ్ము మమ్మేలు తల్లి॥
మా యెఱుకలసాని మానుగా నీచెంత
నున్నదమ్మ నిజము నొప్పగాను
జెప్పు ననిన నొక్క చెలిని రమ్మని పిల్చి
పలికె దానితోడఁ జెలఁగి గౌరి. 21

క॥ తరుణీనీవిప్పుడుజని । యెఱుకత దరిఁజేరి దానినిమ్ముగనీతో
త్వరితముగఁదోడి తెమ్మనఁ।బరుఁగునఁజని చెలియెఱుకలపడఁతినిఁగాంచెన్.

వ॥ కాంచి యిట్లనియె. 23

గీ॥ పర్వతేంద్రుని పుత్రిక పార్వతి నినుఁ
దోడితెమ్మని నను బంపెఁ దోయజాక్షి
నీవుచేసిన నోములు నేడుపండు
ననఁగనెఱుకత సంతోషమునఁ జెలంగి. 24

క॥ ఎఱుకో యెఱుకో యనుచును
నెఱుకతవలె హరుఁడు ప్రాయి యెలమిని గాంచెన్
శరభృ త్సన్నిభ దేహా
విరచిత మృగరాజ వాహా విపులోత్సాహా. 25

క॥ గిరిరాజతనయగాంచెక్ । బరభృతనమవాణి విమలపల్లవపాణిక్
శరముక్సన్నిభవేణిని । నిరవుగఁదననెదుటనున్న యెఱుకలరాణిక్. 26

సీ॥ పదపల్లవంబుల పైఁదొ ల్త నటియించి
మీఁగాలి తాఁబేళ్ల మీఁది కెగసి
కలితోరు మదకరి కరముల పై కేగి
పిఱుఁదుఁ దిన్నెలమీఁద విశ్రమించి
చనుపూవు గుత్తుల చందంబుఁ బరికించి
మోము దామరపైని మోహరించి
కెమ్మోవి విరిదేనె సమ్మదంబునఁ గ్రోలి
నెఱితేఁటి బోఁటుల నే స్తమాఁడి॥
గౌరి చూడ్కులు యెఱుకల గరితమూపు
లళికులంబులఁ బోలి యన్యోన్య దివ్య
వర్ణనీయ శుభాకార వనవిహార
ములను జేయుచు మఱిమఱి మొనయుచుండె. 27

ఆ-వె॥ సుదతి చక్కఁదనముఁ జూచి యద్భుతమొంది
రత్నపీఠమందు రమ్యముగనుఁ
గూరుచుండు మనఁగఁ గూచుండు నెఱుకత
తోడ ననిమె గౌరి వేడుకలర. 28

ఉ॥ ఎక్కడిదానవీవు హరిణేక్షణ నీదగు కాపురస్థలం
బెక్కడ తల్లిదండ్రు లెవరెందు జరించెదు వేడ్కతోడ నీ
విక్కడి కేగుదెంచుట నిఁకెంతయుఁ బావనమయ్యె గీమునీ
చక్కని చిన్ని నవ్వొలయఁ జానగు పల్కులతోడఁ జెప్పుమా. 29

వ॥ అని యివ్విధంబునఁ బల్కుచున్న పార్వతికి నామాయ యెఱుకత
యిట్లనియె. 30

చ॥ హరిపద చింతనామృతము నంచిత లీలలఁ గ్రోలుచుండి భూ
ధరవర కందరంబుల సదా చరియింపుచు సర్వ దేవతా

వరులు నుతింప మే లెఱుకఁ బాగుఁగఁ జెప్పుచుఁ బెంపునొందునే
నెఱుకలసాని నమ్మ నిజమెల్ల నెఱుంగఁగ నీకుఁ జెప్పితిన్. 31

వ॥ అని మఱియును. 32

సీ॥ ఎఱుకవారలు గల రెందఱైనను మాకు
సరివత్తురే జూడ సరసిజాక్షి
గొన్ని తార్కాణము ల్గొమ్మ నేఁజెప్పెదఁ
బరమేష్ఠి దేవికిఁ బరిణయంబు
మా యెఱుకనేఁగాదె మఱి పాకశాసను
రాణి వివాహంబు రమ్యముగను
మా యెఱుకనేఁగాదె మహనీయముగ మూఁడు
జగములఁ బెండ్లిండ్లు జరుఁగుటెల్ల॥
వినుము మా యెఱుకనెసుమ్ము వెలఁది యిపుడు
నీదు మదినున్న కోర్కెను నిజముగానుఁ
జెప్పి తగు ఫలంబందుదు మెప్పుగాన
నంగ విని గౌరి డెంద ముప్పొంగి యపుడు. 33

ఆ-వె॥ పసిఁడిచేటలోనఁ బరఁగ ముత్యము లిడి
మూఁడుమాఱ్లు హస్తముననుఁ బట్టి
ఫాలతలమునందుఁ బరమ భక్తిగ నుంచి
మ్రొక్కి యిట్లు దలఁచె ముదిత మదిని. 34

ఆ-వె॥ 'మూఁడు కన్నులయ్య ముదముతోడుత నన్నుఁ
బెండ్లి యెప్పుడాడుఁ బ్రేమతోడ'?
ననుచు నిట్లు దలఁచి యాముత్యములఁ జేట
లోన నుంచి యిచ్చె లోలనయన. 35

వ॥ అట్టియెడ నామాయయెఱుకతయాత్మదైవంబులఁదలపోసియిట్లనియె.

సీ॥ సామిసిరిమగండ జగములేలెడు తండ్రిదామోదరయ్యమాదాపురమ్మ
ప్రాఁజదువులనల్లబమ్మకిచ్చినప్రోడ మాపాలివేలుపామమ్మనేలు

మనుబందివేసంబుఁబూనినయోసామి యాదినారాయణాయచ్యుతుం
సింగపుమలదొర శ్రీకూర్మనాయకా నల్లనిదేవరా నలిననేత్ర॥ [డ
నీకుఁ మ్రొక్కులిడుదు నేర్పుతో నిప్పుడు
బొల్లిగద్దనెక్కు నల్లనయ్య
మెఱుఁకఁ జెప్పువేళ నెలనాగకోరికఁ
దెలుపవలయు నాకుఁ దేటపడఁగ. 37

సీ॥ ఉజ్జయనీకాళియోవింధ్యవాసిని యాశ్రితరక్షణియాదిశక్తి
కామాక్షి కొల్లాపురీమహాలక్ష్మి మాయాపురీశ్వరునియర్ధాంగలక్ష్మి
యోసాగరాత్మజ యోలోకములమాత యిందిరాదేవియమ్మలుతల్లి
యోబమ్మయిల్లాల యోసరస్వతిదేవి భారతీదేవియోపలుకుగరిత॥
పరఁగనాదునాల్కఁ బాయకనుండుమీ •
మెఱుకఁజెప్పువేళ నెలమినీవు
పేరుఁబొందినట్టి బెజవాడలోనున్న
దుర్గనిన్నుఁగొల్తుఁ దోడుగమ్మ. 38

క॥ ఒగినేకశునంబులఁజె। ప్పఁగఁబూనితి విఘ్నములనుఁ బాపు గణపతీ
దగమిమ్ముఁదలఁతు మదిలో । జిగిమీఱఁగ నిల్వుఁడెల్ల జేజేలారా. 39

సీ॥ వాకియ్యరే నాదు వదనమందున నిల్చి
యీకాంత మనసు నా యెడఁదఁ దగుల
ననియొంటి వాల్గంటి నంటితి నని యెంచి
కరముఁగేల నమర్చి యెఱుకఁ జెప్పె
నోయమ్మ యోదేవి యోభాగ్యశాలిని
సిరిగల చేయి నీ చిగురు చేయి
యొక్క తలంపున నొక కోరికనుఁగోరి
దొడ్డమేలడిగినఁ జెడ్డలేదు॥
అదియుఁగాయొ పండోయని వేడుచుండితి
వౌనొ గాదొ యనుచు నాత్మఁదలఁచి

కల్ల యగును నిజము గడురమ్యముగ నౌను
యనుచు మదిఁ దలంచి యతివ యిపుడు. 40

సీ॥ తడఁబడుచున్నావు తరుణిరో కాయగా
దది పండు పండుపండగునుసుమ్ము
కల్లలుగాఁబోదు కడునిజంబై తీరు
శీఘ్రమే చేకూడు సిద్ధముగను
నేకోపు పనియన నీకోపు పనియిది
తలఁపుఁ జెప్పెదు నేను దప్పకుండ
స్త్రీపుం విభేద ముల్దిరముగాఁ నుడువుదు
మగవారిపైఁ బ్రేమ మగువ వినవె॥
యెదనుఁదలఁచియుంటి వెన్నాళ్లకౌనని
యొకటొ రెండొ మూడొ యొప్పఁగాని
యేండ్లకొలఁదిగాదు యెలనాగనమ్ముము
కొద్దిలోనయౌనుఁ గొఱఁతలేక. 41

సీ॥ సోడిగాఁడినిఁగూడి చోద్యంబుగానీదు మేనితోనాతనిమేనుఁజేర్చి
నప్పుడునను మెచ్చి యతివకోరికెఁదీర్తుఁ విప్పుడునీనాధుఁడిచటనాకుఁ
దగఁబొడగట్టెను మగఁడనౌదునటంచు నీవుకన్గొనలేవు నేనుగంటి
మేనువడంకమైమేలుగాఁజెమటచే మిళితమై యొడలెల్లఁ బులకరించె॥
నీదుపైని దయను నెమ్మితోఁ బెండ్లాడు
శీఘ్రముగనుఁగోర్కె సిద్ధిఁబొందు
నాదుబుట్టితోఁడు నమ్ముమనుచుఁబల్క
వెలఁదిసమ్మతించి విస్మయమున. 42

గీ॥ ఎందజేని యునెఱుకతలెలమివచ్చి
చెప్పరేతల్లి శకునంబు లొప్పగాను,
మ్రొక్కియడిగిన నాకోర్కెఁ జక్కఁబొడిచి
నట్టులీరీతిఁజెప్పవేరైరిగాని. 43

సీ॥ ఇచ్చెలి మెచ్చి నే నేమిచ్చు దానను
జగములి చ్చినఁ గానిఁ జాలవింక
నని మల్లెపూదండఁ దనప్రియు మెడ నేయు
నటుల ముక్తాహార మతివ మెడఁగ
దించి మేలైన రత్నాంచిత భూషణం
బులునుఁ జీరెలు పీడెములు నొసంగి
నెచ్చెలి! నామీఁద నెనరుంచుమని పెక్కు
విధముల బొగఁడెడు వెలఁదికామె॥
'యిప్పుడేమి తలఁపు లీడేఱినప్పుడు
నీదు భాగ్యమెల్ల నాదిసుమ్మి'
యనఁగ నిజమటంచు నాయెఱుకతనతి
వినయమునను గౌరి వీడుకొలిపె. 44

వ॥ అట్లా యెఱుకతనంపి యేగతి పశుపతి దనకుఁ బతియగు నని యచ-
లేంద్ర గర్భ రత్నాకర రాజ సహోదరియగు గౌరి డెందంబునఁ
దలంచుచుఁ దపమొనరించకఁ గాని సిద్ధిగాదని నిశ్చయించి జననీ
జనకులకడ కేగి వారల కిట్లనియె. 45

ఉ॥ దుర్భరమైన గర్భమున దుఃఖము లెన్నియొఁ బొందివెన్క నా
విర్భవమైజరాదులకు భీతిలి గ్రమ్మఱఁ జచ్చుచున్నటిం
దుర్భరమైన గర్భమున దుఃఖములందుచునుండకిప్పుడే
నిర్భయతందపంబు నతినిష్ఠ నొనర్తు ననుజ్ఞ నీయరే. 46

గీ॥ అయుత యోగంబులేనియు ధ్యానమునకు
సమముగా వట్టి ధ్యాన శతములు నొక్క
జ్ఞానమున కీడుగా వట్టి జ్ఞాన మొదవుఁ
దపముఁ జేసినఁ గావునఁ దపము ఘనము. 47

ఆ-వె॥ అవని జన్మమెత్తి నందున కతిఘన
మైన తపముఁ జేసి యధిక లాభ

మొందుటొండె నట్టులొదవకుండినయెడఁ
గడఁగితనువు నచట విడుచుటొండె. 48

వ॥ ఇది నా నిశ్చయంబని పలుకుచున్న కూఁతుంగని నగేంద్రుండు స్నేహ
మోహ విషాదంబులు ముప్పిరిఁగొనగద్గదికంబున నిట్లనియె. 49

గీ॥ ఒక్క చెక్కిలిఁగొట్టిన నొనరును వన
యొక్క చెక్కిలిఁ గొట్టిన నొదవుఁబాలు
నట్టిపాపవు నీకుగ్రమైన తపముఁ
జేయుటకు బుద్ధియేలమ్మ చిన్నితల్లి. 50

శా॥ లీలంగాంచన సౌధవాటికలనాళీపాళి గొల్వంగనో
బాలా! బాల్య వినోదముల్జరపి సౌభాగ్యంబుతో నుండ కం
గాలవ్యాళకరాళ దుష్టమృగ ఖడ్గవ్యాఘ్ర సంయుక్తమా
భీలంబై తగు గానకేగి తపమింపే జేయుటూహింపఁగన్. 51

ఆ-వె॥ దేవమానిసెప్పె దేవదేవుఁడు నిన్నుఁ
బెండ్లియాఁడి మిగులఁ బెంపుఁజేయు
ననుచు నింతలోన నత్యుగ్రతరమైన
తపమొనర్తుననుట చపలబుద్ధి. 52

వ॥ అని పల్కుచున్న జనకుని వాక్యంబులు విని యించుక తడవు విచా
రించి గౌరి మఱియు నాతని కిట్లనియె. 53

సీ॥ శ్రీశంభుఁ బూజించు చేతులు జేతులు
శివుకథ లాలించు చెవులు జెవులు
ఇందుశేఖరు వేఁడు డెందంబుడెందంబు
త్రిపురారిఁ బొడగను దృష్టి దృష్టి
భవుమందిరముఁ ద్రొక్కు పాదము ల్పాదము
ల్భూతేశుఁ గొనియాడు బుద్ధి బుద్ధి
కామారి కర్పించు కాయంబె కాయంబు
శితికంఠు వర్ణించు జిహ్వ జిహ్వ॥

శర్వుఁ బొందినట్టి జన్మంబు జన్మంబు
నియతి శూలిఁ గొల్చు నిష్ఠ నిష్ఠ
యభవు గొలఁకు సల్పు ధ్యానంబు ధ్యానంబు
దగ హరునకుఁ జేయు తపము దపము. 54

వ॥ కావున దేవదేవుండును నిరంజనుండును నిర్వికల్పుండును నిర్వికారుండును నిరీహుండును నిరామయుండును నిర్గుణుండును నిగమవినుతుండును నద్వయుండును నతీతుండును నాద్యంతశూన్యుండును నాదిదేవుండును నగు నభవుండు భక్తజనకల్పంబుగావున నతనిం గూర్చి తపంబుఁ జేసెదనను కూఁతురి వాక్యంబులకు మోహ విషాదంబులు బెనఁగొన నేమియుననలేరక నగాధి నాథుండా మెకిట్లనియె. 55

గీ॥ అభవుఁ డెన్నంగ హాయికి హద్దుగోడ
తాపసులకెల్లఁ గల్ప పాదపము నీడ
యవ్వెలుంగును నాతల్లి యైన వినుము
'దెలియభావేహి విద్యతే దేవ' యనఁగ.

వె॥ కాన నిచట నీవు కడుభక్తితోఁ దప
మాచరింపు మమ్మ యభవుఁ డరయ
సర్వభూతమయుఁడు సర్వసాక్షియుఁగాన
ముదమెలర్పఁ గోర్కెలొదవజేయు. 57

వ॥ అని యాశీర్వదించి పలికిన జనకుని వాక్యంబులకు డెందంబున నమితానందంబు నొంది జననీజనకులకు వందనంబులుజేసి వారలయనుమతి నచ్చోటుఁబాసి సఖీజనంబులు బరివేష్టింపఁ జాతకచకోరక చక్రవాక రాజహంస మయూర శారీశుకపిక ప్రముఖ సకల ఖగకుల సందోహ కలకలనినద సర్వజన మానసాహ్లాదకరంబును, నిఖిలవృక్షలతాగుల్మ నికాయ సముద్భూత సుమపరాగమిళితమలయ పవన సంచార స్థలంబును, సమస్తదేవర్షి సిద్ధసాధ్య గరుడ గంధర్వ నివాసంబునుఁ, జిత్ర కందర సంస్థానంబునుఁ, గల్పపాదప సంవృతంబును, నానాధాతువిభూషితంబును, మనోజ్ఞంబును, నగు హిమవచ్ఛృంగంబునకేగియచ్చట.

పాలాశదళవృత్తము॥ మృదుమధుర ఫలనివహామిళిత సురశాఖిన్
విదిత జలకులచర విహగకులపంక్తిన్
మదకరి కిరి హరి ముఖమహిత మృగరాజిన్
ముదమొదవఁ గనుఁగొనుచు ముదిత జనుచుండెన్.

అంబురుహావృత్తము॥

దివ్యసురాగసుమ ప్రకరంబులఁ దేనెఁ గ్రోలెడు వేడ్కతో
నవ్యపలాశ సుమంబుల కేగక నారుఁబోసినరీతిఁగా
శ్రావ్యతరంబుగఁ బాడుచువచ్చెడు చంచరీకనికాయముల్
భవ్యతనప్పుడుగన్గొనె నొక్కెడఁబర్వతాత్మజవేడ్కతోన్. 60

మత్తకోకిల॥ మల్లికాచయ మాధవీ వరమాలతీ సుమతల్లికా
వల్లికాగణి వేల్లితంబగు పారిజాతము నీడల
న్వల్లకీకలనాదవైఖరిఁ బాటఁబాడెడు కిన్నరీ
పల్లవాధరఁగాంచె నుల్లము పల్లవింపఁగ గౌరిదాన్. 61

వ॥ ఇవ్విధంబున నచ్చటచ్చటి వినోదంబులు బరికించుచు ముందట నొక్క
రమ్యప్రదేశంబుఁ జేరంజని కుతూహలాయత్తచిత్తయై గట్టుల యెకి
మీని పట్టి సంగడి కత్తెలకిట్లనియె. 62

సీ॥ కృపఁజేయఁడే జగత్సృష్టి కౌశలతఁదా
నన్నలినాస్తుని యన్న కెన్నఁ
గమలేక్షణునకు జగద్రక్షకత్వంబుఁ
గూర్మినీయఁడె వేడుకొన్న మున్నఁ
గాలపాశమునకుఁ గడుఁజిక్కి మొఱఁబెట్టు
మునిపుత్రుఁ గావఁడే మొన్నమొన్న
నుపమన్యుఁ డనువాని కొనరంగక్షీరాబ్ధి
నెమ్మి నొసంగఁడే నిన్ననిన్న॥
నట్టి సర్వేశుఁడగువాని ననుదినంబు
డెందమునఁ గొల్చుచుండ నానందమొంది

కామితార్థంబు లొసఁగఁడే కరుణతోడ
భూరిభక్తౌఘ వరదాత భూతనేత. 63

వ॥ అట్టి సర్వలోకేశ్వరుండును గరుణా సముద్రుండునగు శంకరునిఁగూర్చి తపంబొనరించెదనని దృఢ నిశ్చయంబున. 64

సీ॥ డంబారు వేణీభరంబును దిగనాడి జెడగారుచున్నట్టి జడలుదాల్చి
వలిపెంపుహొంబట్టువలువను విడనాడిపొలుపారువల్కలంబునుధరించి
రమణీయకంఠహారంబులఁ బోనాడి వెరవారు రుద్రాక్ష సరులఁబూని
పరిమళకలవసంపదలఁదూలఁగనాడిచెలువారుభసితంబుఁగలయఁబూసి
భక్ష్యభోజ్య పదార్థముల్పరగ మాని
యబ్బురంబొలయఁగ నిరాహారయగుచు
నెడమపాదంబు పెనువ్రేలి నిలనుమోపి
చిత్తమొండొకచోటికిఁ జేరనీక. 5

సీ॥ తొలుతఁ గామక్రోధములనుఁ బాఱఁగఁదోలి
సత్యవ్రతంబును సంగ్రహించి
తొంబదియాఱు తత్త్వంబుల నెలమి డెం
దంబున నూహించి తఱచి తఱచి
సాత్త్విక భావంబు సత్వరంబుగనూని
యంగాష్టకాసక్తి నమరఁజేసి
ముద్రాసనముల నక్షుద్రత నెమ్మోని
పనిఁగొని వామకుక్షినిఁదనరెడు॥
పాప పూరుషుని దహించి వర మను హఠ
రాజ లయ యోగములను మర్మం బెఱింగి
హృత్సరోజంబునం బరమేశు నిలిపి
తపముఁ గావింపఁజొచ్చె భూధర తనూజ. 6

వ॥ అంత గ్రీష్మ మ్మరుదెంచుటయును. 7

సీ॥ నెమ్మిఁ జొత్తమ్ములు నింగిదిక్కునఁ జూచి
యతిభయంబునడాఁగె నగబిలములఁ

జిలువచా ల్చప్పరంబులక్రింద నడఁగి యుం
డెను నదులడుగుఁబట్టెను జదలను
మేదినీరేణువు ల్మిక్కుటంబుగఁ దోఁచె
సుడిగాలి యెల్లెడఁ గడలుకొనియెఁ
దాళవృంతంబులఁ దాల్చిరి జనములు
మిథునకోటికి రతి మెండుకొనియె॥
వేఁడి గాడ్పులు బడమర విసర నుడుకు
కూడుఁ దినలేకఁ బేదలై వీడు పాఁప
పగ్గముల నయ్యెనూరుఁడు బాగుసేయఁ
బ్రొద్దు తే రాగిచన దినా ల్పొడవు లయ్యె. 68

క॥ స్నానములుభూమిసురులకుఁ। బానంబులుజంతుతతికిఁబచ్చిక మొనకుఁ
బ్రాణంబులు బావులలో। మీనంబులు లేవు నీళ్లు మేదినిలేమిన్. 69

క॥ సుడివడియెఁదేరుబింకముఁ। జెడెసిడమిలఁబడియెఁ జెలఁకుసింగిణితూపు
ల్వడలెమిథునములఁగంతుఁడు।బొడవడఁగకనేఁచెమల్లెపూబంతులచేన్.

ఉ॥ అన్నులమిన్నలం గదిసి హాయిగ దీర్ఘికలందు వారికే
ళిన్నయమొప్పఁగా సలిపి లీలఁ దటంబులఁ జేరి వేడ్కతో
సన్నని చేలముల్ధరియ చందనసారము మేన నొప్పఁగా
వెన్నెల బైటఁ గ్రీడలకు వేఁకువఁ జొచ్చిరి ధన్యు లత్తరిన్. 71

ఉ॥ చెమ్మటమేనగ్రమ్మ దగచేతవడిన్జని నీరుద్రావి కొం
చెమ్ముగఁదెమ్మదేరి యటఁ జిన్నివయారుల ముద్దుగారు వ
క్త్రమ్ములు మాటికింగనుచు రమ్యములైన ప్రపా స్థలంబులం
గమ్మనివింటివాని నెఱకాఁకలఁ దోఁగిరి పాంథవర్గముల్. 72

ఉ॥ చందనగంధము ల్మెయినిఁ జక్కఁగఁబర్వ నగ ల్ధరించి మే
ల్పిందెలుచంకఁబెట్టి పురవీథులఁ బ్రొద్దు దోలంగువేళఁ బూ
ర్ణేందుముఖు ల్గటాక్షముల కేగెడువేడుక లావిటాళి నా
నందము నొందఁజేసెను ఘనంబుగ వేసవి రోజులందునన్. 73

వ॥ అట్టియెడ గట్టులదొరపట్టి పంచాగ్నులు జుట్టునుంబెట్టి బెట్టిదంబగు తపంబుఁ గావించుచుండఁ గొంతకాలంబునకు వానకాలం బరుదెంచు టయును. 74

ఉ॥ తూర్పునఁబుట్టి వాయువులు దోరములై విసరెం బ్రితీచినా
స్వర్పతివిల్లుదోఁచె జలవాహములుబ్బుచు దక్షిణంబునం
దర్పముఁజూపెఁ గ్రొమ్మెఱుపుతళ్కు లుదీచి నలంకరించెఁ గం
దర్పుఁడు దూల్చెఁ బాంథజనధైర్యకదంబము వానకాలునన్. 75

ఆ-వె॥ మిన్ను మన్నటంచు నెన్నశక్యముగాక । కడవవంచినట్లువడిగఁ బెద్ద
ధారలెల్లఁగూడి హోరనుశబ్దంబు।తోడవానవచ్చె వేడుకలర. 76

క॥ ఎక్కడఁజూచినమబ్బులు । నెక్కడఁగనుఁగొన్న మెఱుపులెక్కడఁగన్న
న్నిక్కిలియురుములువాయువు।లెక్కడనెక్కడనుజల్లులెక్కడఁగరకల్

సీ॥ మబ్బులఁగని కేకలుబ్బుచు షడ్జంబుననుఁబాడి పురివిప్పి ఘనతనాడెఁ
వెసహంసలెల్ల మానససరస్సునుజేరె గర్జనంబులువిని కళవళించి
యాదిత్యుఁజాడకనన్నంబుఁదినువారి కాకసంబునదృష్టులమరియుండెఁ
బెల్లుగాఁగురిసెడుజల్లులకార్ద్రిమై పేదగేస్తులయిండ్లుబిట్టుగాఱె॥
వానచేతఁదడిసివడవడవణఁకుచు । పిట్టలెల్ల మస్కపట్టులందు
ముద్దఁగట్టినట్లుమోదమేఱుఁయు లేక।కలఁగుచుండెవానకాలునందు.

ఉ॥ ఏఱులుబొర్లి పాఱెఁ దగనెండిన పెల్లువలెల్లఁజాఱెఁ జి
చ్చాఱెవనాంతరంబులను నంచలుమానసమందుఁజేరె వే
నూఱెమరుండుఁగై దువలనూనతరంబుఁగఁ జాతకాళికిం
దీఱెనునీరువట్టు మఱినెమ్ములయాటలుమీఱె నయ్యెడన్. 79

సీ॥ కమనీయ సత్యలోకముఁబోలె నలరారు
మదమరాళి విరాజ మాన మగుచుఁ
గలిత వైకుంఠలోకముఁబోలె మహనీయ
కమలా రథాంగ సంకలిత మగుచు

ఘనతరంబై తగు కైలాసమునుఁబోలె
నీలకంఠావాప్తి నివ్వటిలుచు
గురుపతివ్రతఁబోలెఁ గుంభజోద్ధతి యదృష్ట
పయోధరాభయై స్తవముఁగొనుచు॥
ధర్మవంతుఁడైన ధర్మునిహృత్తామ
రసముఁబోలెఁ బంక రహితమగుచు
వసుధసంతసిల్లవచ్చె నంతటశరద
ద్వాసరంబు మహిత భాసురముగ. 80

చ॥ రవికిఁ జరచ్చర చ్చరధరం బొగి నడ్డముగాఁగ మేతమా
ని పినుపయిం గనుంగొనుచు నిన్నోఁజేఁ బురివిచ్చి వంచి వేఁ
ద్ర్యవనతకంఠులై యఱచు చంతట శారద డిగ్గి వార్షికం
బ వడిగ నెక్కుచుండె వనవాటికలందు మయూర సంఘముల్. 81

సీ॥ ఖము తృణగ్రాహికత్వముఁ దాల్చె ననఁగ న
భశ్శింకపత యవన రాసు లలరె
వలరాజువారు వంబులు బొఱ రవితేరు
డాసెనో యనిజను ల్గాసిపడిరి
కడలినీటిని రిత్తగాఁ గురియఁగ నుప్పు
డొక్కఁబేరినఁ దెలుపెక్కె మబ్బు
మునుఁద్రాగు నీరువ్రాయినఁ దత్పిపాసఁ గొ
లనుఁజేరు మొయిలునాఁ దనరె జల్లు॥
ఎండచేతఁగ్రాగు నిలయను పెనముపై
బడినదగుచు మిగులఁ బండబారె
ననఁగ దట్టమగుచు నలరారె శారద
రాత్రులందు జోత్స్న రమ్యముగను. 82

గీ॥ కడలి మొలనూలుగాఁ గల పుడమిచెలువ
కడఁగి వెలిపట్టు పుట్టంబు విడిచి పసరు

గడలుకొనుచీరెఁ గట్టి నా నడరఁ దచ్చి
కడల నరిచేలు మెండుగాఁ గడలుకొనియె. 83

వ॥ అట్టియెడఁ బార్వతి తటిల్లతా సన్నిభ తను రుచిజాలంబులు దశది శలంబర్వ నిబిడంబగు వానజల్లుల కించుకేనియు బెదరక నవపల్లవ సమాన కరతలన్యస్త స్ఫటికాక్షమాలికయై బట్టబయల నిలిచి దపంబుఁ గావించుచుండ. 84

గీ॥ దంతి కుంభయుగమును విభ్రాంతిపఱుచు
నింతుల చనులఁబట్టి నిరంతరంబుఁ
గంతుసౌఖ్యంబుఁగొను భాగ్యవంతులెల్ల
సంతసిల్లంగవచ్చె హేమంతమంత. 85

సర్వతః ప్రాస సీసము.

కలమాపలగు సస్యములు వెన్నువంప జే
కులఁ గడు మెఱసె నీటెల విధమున
వలతేని వాఁడవంబులగు రాచిలుకలు
గలకల ధ్వనులతో మెలఁగె మింటఁ
జలిగాలు లెల్లకడలఁ దోరమై వీవఁ
బొలములఁ జేనికాపులు బెగడిరి
జలరాసి మందిరంబుల నీశుకంటనుఁ
జలికోడి డాఁగె నింగలము లెల్ల॥
జలజబాంధవుండు దొలిమలపైఁ దోఁచి
చలికిజంకి గ్రుంకుమలకు వేఁగ
సలలితముగనేగె జలజారి పండువె
న్నెలలు చల్లనగుచు వెలయుచుండె. 86

వ॥ అయ్యవసరంబున. 87

క॥ శిశిరఋతువరుగుదెంచెనుఁ। గృశానుఁడాగిజీవకోటికిం బ్రియుఁడయ్యె
న్నిశలాయతగతిఁదోఁచెను। శశిమిక్కిలిశత్రువయ్యెజగములకెల్లన్. 88

శా॥ ప్రాతస్స్నానముఁ జేయు భూసురులకున్ బాదోద్భవశ్రేణికిన్
ప్రాతఃకృత్యము లాచరింపఁదగు నా ప్రాయంపుఁ గోడండ్లకున్
ప్రాతర్వేళలఁ జేయు కర్మలకు లోపంబబ్బునన్ బుద్ధిచే
భీతుల్నైమ్మదిఁ జొచ్చె శైత్యమహిమన్ బేర్కొంటకున్ శక్యమే. 89

వ॥ అట్టియెడ గట్టులదొర ముద్దులపట్టి మనంబు దిట్టఁజేసికొని బెట్టిదంబగు మంచువలనఁబుట్టు చలికి బెదరక మనంబునఁబట్టిన పట్టువిడువక కుత్తుకబంటి నీటిలో నిలిచి యతిఘోరంబగు తపం బొనర్చుచున్న పెద్దకాలంబున కక్కడ సర్వలోకేశ్వరుండు మదనానలతాపంబునఁ గాగుచు నింక నెవ్విధంబున హైమవతింగనువాఁడనని డెందంబునఁ జింతించి యెట్టకేలకు నొక్క యుపాయంబు నిశ్చయించి. 90

సీ॥ బాలచంద్రునిడాలు నేలుఫాలంబున రంగుగానూర్ధ్వ పుండ్రంబుదీర్చి
భవ్యతరంబైన పాలాశదండంబు హస్తతలంబున నమరఁదాల్చి
భాసురంబగు మధ్యభాగమందునఁజారుతరమైన మౌంజినిఁ దగధరించి
కెంపమ్మిపూవుల డిందుసేయఁగఁజాలుపదములఁబావలుగుచురుపతిచి॥
పచ్చకౌపీన మొక్కటిఁ బరగఁగట్టి
చేఁతనుండెడు భృంగిని శిష్యుఁజేసి
తొలిజడువుబొత్తములు వాని తలనుఁబెట్టి
ధనదమిత్రుండు వటువేషధారియయ్యె. 91

మ॥ మదనధ్వంసి భవుండు శంకరుఁడు సమ్మాన్యుండు శంభుండు దు
ర్మదనాగాసురహారి చంద్రధరుఁడు న్నాజానిపూజ్యుండు స
మ్ముదమొప్పారఁగఁ బన్నమిత్రుకరణి న్మూర్తి త్రయీతేజుఁడై
పదియాఱేండ్లబాలుఁడై గిరిసుతాప్రద్యుమ్నుఁడై యంతటన్. 92

క॥ వామనరూపంబున నా। సామజచర్మాంబరుండు సర్వజ్ఞుండై
సామాన్యంబుగ నత్తతి। హైమవతిసమీపమునకు నరిగెముదమునన్.

వ॥ ఇవ్విధంబునఁ బ్రాలేయశైలశృంగంబుఁ జేరఁజని యొక్క వటవిటపంబు నీడ విశ్రమించి నలుదిక్కులు గనుంగొనుచున్న సమయంబున.

సీ॥ పెనుమబ్బు లల్లజాబిల్లి నిగ్రమ్మిన
చందాన మోముపై జడలు మెఱయ
వలలోనఁబడు జక్కవకవరీతినిఁ జిల్గు
వల్కలంబునఁ జనుగ్గులుబ్కుచుండఁ
బోకపొత్తులలోనఁ బోకగుత్తులమాడ్కిఁ
గుతుకను రుద్రాక్ష తతులు వెలయఁ
దీరుగాఁ బుప్పొడిఁ గారఁబూసినతీవ
పొలుపున నెమ్మేనబూదిదనర॥
గోరులకు నోడి రిక్క చాల్ గొమ్మ పిన్న
దగుటఁ బ్రతిమాలఁ గేల్వట్టె నన వలపట
స్ఫటికమాలిక దనరఁ దపంబు సలుపు
వనితఁ బొడఁగాంచె నంధకవైరి యపుడు. 95

వ॥ అట్లు పొడగాంచి తనమనంబున. 96

క॥ భంబా నఖంబు నడుము న। భంబా నడ హంససన్నిభంబా కరికుం
భంబా కుచయుగ మల కర। భంబాతొడ మైతటిత్ప్రభంబా చెలికిన్.

సీ॥ చక్రహస్తుని సతీసదనంబు వదనంబు రోలంబ వితతుల యొప్పుగొప్పు
కొమరారుచున్నలికుచములు గుచములు సురుచిరపల్లవాకరముకరము
చెలువొందుకల్వల చెన్నులు గన్నులు సరససుధారసస్రావి మోవి
సదమలతరకోకనదములు బదములు సత్ప్రకాశావళీ సఖము నఖము॥
తొరయీచానకెనయైన సారసాక్షు। లన్న నీముజ్జగంబులయందుఁగలరె?
దైవమీనాతిగళమునఁ దాళిబొట్టుఁ। గట్టనేధన్యుఁడగనమకట్టెనొక్కొ.

ఉ॥ అద్దిర దీనిమోవి మధురామృతమించుకఁ గ్రోలఁగల్గినా
గ్రద్దనఁ దుంటవింటిదొర రాజ్యరమావిభవంబు గల్గుబో
ముద్దియకౌఁగిటం బెనఁగి ముచ్చటఁదీఱ రమింపగల్గె నాఁ
దద్దయు మోక్షరాజ్యవనితామణి సంపద చేతిలోనిదా. 99

ఆ-వె॥ అధరమన్న గెంపు హాసంబు ముత్తెంబు
గుచము లుదిరిమలలు గొప్పనీల
మహహా యివ్విధమున నతివమసంబును
గనక మణిమయంబుగాదు గదర. 100

క॥ లలన యదెవ్వనిఁ గించి । చ్చలితత్తని యగుచు గామశాస్త్రార్థంబు
ల్వేలయఁగఁబురుషాయితరతి।ములఁదేల్చునెవానికగునుభూరిసుఖంబుల్

క॥ తెలుపకఁదెలుపుచునున్నవి। కులగోత్రంబులను నతివగుబ్బలబెడఁగుల్
కులగోత్రతనయయగుటను।సలలితముగఁనపుడుబ్రహ్మచారికివేడ్కన్.

వ॥ ఇవ్విధంబున. 103

ఆ-వె॥ సుదతి చక్కఁదనముఁ జూచి శంభుండంతఁ
గామలోలుఁడగుచు ఘనముగాను
నెవ్విధమునదీని నెనయంగఁదగునంచు
నెంచి జేరవచ్చె నెలమితోడ. 104

వ॥ ఇట్లు డగ్గరుచు మనంబున నిట్లని వితర్కింపఁదొడంగె. 105

సీ॥ కలకంఠిపెన్నెఱి యళితిరస్కృతిఁ జేయు
మీనంబులనుమించు మెలఁత కనులు
బడఁతుక కనుబొమ ల్బాణాసనము నెంచుఁ
గలికి చన్నులు ఘటావళి జయించు
సకియ నెన్నడుము గేసరి సన్నిభంబగుఁ
గటిజంఘికలు గో మకరములనగు
ఘనయశోజిత యజాంగన యయ్యో నిస్తుల
శ్రీ యవక్రవృత్తినిఁ దనరుఁ గాని॥
యల మిథునకల్పనం బొండు వెలితియయ్యె
నతివ సౌందర్యరాసుల కలర నిప్పు
డనుచు సర్వేశుఁ డెదను జింతనము చేసె
మహితగుణవృత్తి రామ రామా యటంచు. 106

వ॥ ఇవ్విధంబునఁ జంద్రకళావతంసుండు మాటిమాటికి నమ్ముద్దుగుమ్మ
సోయగంబుఁ దలపోయుచు భృంగి కిట్లనియె. 107

ఆ–వె॥ కుచములన్న నల లికుచములఁ గేరును
గరము తమ్మియొద్దఁ గరముఁ గొనును
దాని నడలతీరు దానినిఁ బోలును
మించు మేని సంచు మించు మించు. 108

వ॥ అనిన విని భృంగీశ్వరుం డిట్లనియె. 109

సీ॥ యువతినెమ్మోను విస్ఫుర్న్మాల కలకంఠి లలితధమ్మిల్లంబు జలధరంబు
రమణిఫాలంబుచంద్రకళ ముఖంబంబుజాక్షులతాంతాంగికర్ణములుశ్రీలు
సతినాసకన్నులు చంపకోత్పలములు వెలఁదుకవాతెఱ బింబమతివ
మధ్యంబు కేసరిమానినికటి పృథ్వియింతియానరిబు మత్తేభమరయ॥
నట్టి వృత్త మూర్తి యగు సువర్ణిని సుశ
య్యావిభాసమాన యగుచు భావ
రస మహితమునను వరప్రబంధ విధుల
క్షితిని బుధులనుఁ గరగింప కున్నె? 110

వ॥ అని యిట్లన్యోన్య భాషణంబులాడుచు డగ్గరిన నచ్చట. 111

సీ॥ చిన్ని జాబిలిచెన్ను నెన్ను నెన్నుదురున రాజిల్లునూర్ధ్వపుండ్రంబువానిఁ
గెందామరపసందుఁజిందుహస్తంబున నవ్యపాలాశదండంబువాని
రమణీయదర్భాంకురశ్రేణిచేఁగడు దీపించుహస్త ముద్రికలవానిఁ
బారద నారద హార హీర పటీర ధవళ యజ్ఞోపవీతంబు వాని॥
మహిమఁగలవానిఁ గటిబద్ధ మౌంజి వాని
గొడుగు దాల్చినవానిని గుజ్జు వాని
జగముచుట్టముఁ దెగడు దేజంబు వాని
వటునిఁ బొడగాంచి రత్తఱి వనిత లెల్ల॥ 112

వ॥ అట్టి దేదీప్యమానుండగు బ్రహ్మచారింగని చెలికత్తియ లిట్లనిరి. 113

మ_త్తకోకిల॥ చిన్ని వెన్నెలకంచు బూదియు జింకకూనయు శూలము
న్మిన్ను వాఁకయుఁ గాలకూటము మేటిపున్కలపేరులుం
జెన్ను మీఱెడువ్యాఘ్రచర్మముఁ జిల్వపోఁగులుదాల్చు నా
సన్ను తామరుఁడైన వేలుపుజాడ నీయెడఁ దోఁచెడుౕ. 114

క॥ అరవిందసంభవుండవొ? । యరవిందాక్షుఁడవొ? లేక యరవిందార్కా
భరణుండవొ? పరికింపఁగ । నరవిందాప్తుఁడవొ? తెల్పుమయ్యమహాత్మా.

వ॥ అనిన నాతండు. 116

ఆ-వె॥ చేడెలార! మీరు జెప్పిన వాక్యము
ల్వినఁగ వినఁగ మిగుల వింతలయ్యెఁ,
దిరిపెమెత్తి కుడిచి గిరికందరముల మె
లఁగు జగత్కుటుంబులము నిజముగ. 117

వ॥ అని పల్కుచున్న బ్రహ్మచారివృత్తాంతంబుఁ బార్వతి కెఱిఁగింపఁ దలంచి మందమందమధురాలాపంబులఁ గలవాణి యామెకిట్లనియె.

సీ॥ నీపాలిశివుఁడన నేపారగావచ్చె
వామనుం డొక్కఁడు భామజూడు
మిట్టివారినిఁబూజ లింపొందఁగాఁజేయఁ
గోర్కెలన్నియునుఁ జేకూడునమ్మ
యనగౌరి యర్ఘ్యపాద్యములిచ్చి యాసనం
బర్పించి మ్రొక్కిన నాతఁడెలమి
శీఘ్రమేవవివాహ సిద్ధిరస్తనుచుఁ దా
నాశీర్వదించుచు నంతలోన॥
భామమోముఁ జూచి ప్రేమమీఱఁగఁ బల్కె
నెవరిదానవొక్కొ? యింతి నీదు
నామమెద్ది సెప్పు? నయమొప్ప నిచ్చటఁ
దపము సేయనేల చపలనయన?. 119

క॥ రతివో? చెలువొందెడు ౹ శ్రీ౹ సతివో? కమనీయభానుసతివో? యలభా
రతివో? హరి సతివో? పా౹ ర్వతివో? నిక్కముగఁదెల్పువనజారిముఖీ.

క॥ లలనా! నీవీ ఘనసీ ౹ మలఁ దప మొనరించనేల? మసలక నాతోఁ
దెలిపిన నీకోర్కెను నే ౹ ఫలితముగ నొనర్తు నిపుడె పంకజనేత్రా.121

వ॥ అని పల్కుచున్న కపటవటుని వాక్యంబులు విని యించుక లజ్జించి
పార్వతి మనంబున నిట్లని వితర్కింపఁ దొడంగె. 122

సీ॥ దరహాసచంద్రికల్ స్థిరపఱుచుచు నుండెఁ
బూర్ణ చంద్రత్వంబు మోమునకును
సహజారుణచ్ఛాయ సార్థకంబొనరించెఁ
గమలసంపద సోగకన్నులకును
మృదుకోమలంబు విశదపరిచెను కోక
నదవైభవావాప్తిఁ బదములకును
సరిమనోహరవిగ్రహంబు దెల్పెడుఁ బుష్ప
చాపజయిత్వంబు రూపమునకు॥
భళిర! యీతఁడు, రతిరాజొ? భవ్య రాజొ?
రాజరాజసుతుఁడొ? సురరాజసుతుఁడొ?
తెలియకున్నది యెవ్వఁడో దివ్యమూర్తి
వచ్చె, నాపాలిభాగ్య దైవంబుఁబోలె. 123

వ॥ అని మనంబున నివ్వెఱఁజెందియున్న యెడ చెలికత్తియ లాతని కిట్లనిరి.

చ॥ వినుమువటుండ! యీపె పృథివీధరనాథుని కూర్మిపట్టి యా
ననజితపూర్ణచంద్ర మదనద్విప గౌరియనంగ నొప్పు నా
వనరుహవైరిశేఖరు నవశ్యము భర్తఁగఁ గోరి యిప్పుడీ
వనమునఁ జేయుచుండె నొకవర్షమునుండి దపంబు నిష్ఠచేఁ 125

వ॥ అని పలికిన కలవాణి వాక్యంబులు విని యమ్మాయామాణవకుండు
డొల్లఁబోయిన రీతిని నివ్వెఱఁజెందిన విధంబున దూపటిల్లిన దెఱం
గున నటియించుచు గౌరిదిక్కుల మొగంబై యామెతో నిట్లనియె.126

క॥ ఏకసక్యంబున కీచెలి నెక్కొకటిం బల్కెడెనొ? నిజంబు విశదపఱిచెనో?
నికటంబు దెలియకున్నది। యకటా! శ్రీకంఠుఁ బెండ్లియాడం దగునే? 127

గీ॥ కలికిరో! నీదు బుద్ధి బంగారుగా న
దెట్లుగాఁ దోఁచె నీబుద్ధి? యింతి నిన్ను
నెవ్వరోఁ గాని కపటంబు నివ్వటిల్ల
మోసపుచ్చిరి సుమ్మ; యో ముద్దుగుమ్మ. 128

సీ॥ కులగోత్రసుతవీవు కులగోత్రరహితుఁ డాతఁడు నీకు నతనికిఁ దగుటయెట్లు?
గుణశాలివీవు నిర్గుణుఁడాతఁ డతనికి నీకును జతఁగూడి నెగడుటెట్లు?
గాంచనాంబరవీవు కట్టఁబుట్టము లేదతనికి నీవతనిఁ జేకొనుటయెట్లు?
లలసర్వమంగళవీ వమంగళుఁడాతఁ డెలమి నీవాతనిఁ గలియుటెట్లు?
లుదిరి మేడలఁ దిరిగెడు సుదతి వీవు;
ప్రేతభూములఁ దిరిఁగెడు బెద్దయతఁడు;
నీకు నతనికి నీడగునే లతాంగి?
యహహా! విను వారు నగరె నీ వతనిఁ గోర?. 129

వ॥ అని దూషించుచున్న వటునింగని గౌరి యిట్లనియె. 130

ఆ-వె॥ చీరపేనునల్లి చీమదోమలయందు। నరులయందు ఖగనచరులయందు
సర్వజీవులందు సమదృష్టివర్తించు। శివునిఁ దెగడుటెట్లుచితమె నీకు?.

వ॥ అనిన నాతండిట్లనియె. 132

ఆ-వె॥ ఉగ్రమైన విషమునుంచెఁ గంఠంబున,
నుగ్రమైన నగ్నినుంచె నొసట,
నలర నుగ్రభీముఁడను నామమునుఁ దాల్చె,
నట్టియుగ్రుఁ గోర నబలదగునె?. 133

ఆ-వె॥ అట్టివానిఁ బెండ్లియాడిన నవ్వాల
పాలఁబడెదు సుమ్ము లాలితముగ,
స్థాణువువలన మఱిఁ దాలిబొట్టుఁ దగఁగ
ట్టించుకొనుము నీవు మించుబోఁడి. 134

వ॥ ఇంతియగాదు మఱియొక్క విశేషంబాకర్ణింపుము. 135

సీ॥ తెరఁదీయఁజూచుచో నరపదివోములు
గానుపింపఁగ నెంతగాసిఁ బడుదొ?
నేనఁబ్రాలిడుపట్ల శిరమున నలరారు
వాఁకఁగన్గొనియెంత భయము పడుదొ?
తాలిబొట్టును గట్టుతఱి మెడలోనున్న
నహిభుస్నమననెంత యదిరిపడుదొ?
చేలముల్ముడివేయువేళ బెబ్బులికళా
సముఁజూచి మదినెంత జంకుఁగొనెదొ?॥

లీల నిరువురుఁగూడి యాలింగనంబుఁ
జేయునెడవాని యఱుతఁదాల్చిన కపాల
మాలికలఁగాంచి నీవెంత జాలిఁబడెదొ?
చాలు! నా విరూపాక్షుని జోలియేల?. 136

చ॥ అలికులవేణి! యేల శివయంచు జపించెద వా శివాఖ్య న
క్కలకును జెల్లుచున్నయదికాదె? శిరీషసుమంబుఁబోలు పే
శలమగునీతనూలతను చండతరంబుఁగ నుగ్రకాననం
బులఁ గృశియింపఁజేసెదు తపోనియమంబను వెఱ్ఱిబుద్ధిచేఁ. 137

ఆ-వె॥ బ్రాహ్మణుండ నగుదు బ్రహ్మచారినినుమ్ము
యింతి వినుము నిర్జితేంద్రియుఁ డను
చదువుకొన్నవాఁడ స్వాధ్యాయమంతయు
ధనముగలదు నాకుఁదరళనయన. 138

చ॥ అయినను నిన్నుఁ బెండ్లిఁదగ నాడెద, నెల్ల విభూతులిప్పుడే
నయముగనీవు బొందెదవు, నాతిరో! యింతియగాదు, రత్నసం
చయమయమైన కొండపయి సంతసమందుచు నుండు వెష్టు; నీ
వయసును, నాదు ప్రాయమును, బాపురె! యీడును జోడుగాఁదగుఁ.

క॥ ఇపుడేమి సెప్పెదను? నీ। తపమునుఁజాలించి నాకుఁ దరుణివిగ మీ
యపఘనము నీకొసంగెద; । నపరాధంబనుచు నెంచకబ్జారిముఖీ. 140

వ॥ అని యివ్విధంబున బ్రహ్మచారి పల్కుచున్న సమయంబున. 141

క॥ శివనిందావాక్యంబులు। చెవిసోఁకిన మాత్రముననె శివ శివయనుచుం
జెవులను జేతుల మూయుచు। శవశవనాగౌరి కటకటంబడివడుగున్.

క॥ కనుఁగొని రోషంబున ని। ట్లనియెను వినయమునవచ్చియద్వయునభవు
న్మనమున నెంచకదూషణ। మొనరించెదుమాటికిట్లు లుచితమెనీకున్.

సీ॥ నిఖిలప్రపంచంబు నిజసనాతనమాయనెఱయించు చెవ్వఁడు నివ్వటిల్లు
నధ్యాత్మవిద్యారహస్య కోవిదులెల్లఁ జింతింతు రెవ్వని చిత్ప్రకాశ
మర్కచంద్రానలాద్యఖిలతేజోమూర్తులందు నెవ్వని తేజమావహిల్లు
నఖిలోపనిషదర్థహర్మ్యాగ్రసీమలఁ జరియించు నెవ్వాఁడు సంతతంబు॥
నెవఁడు నీయందు నాయందు నెల్లజీవు
లందుఁ దానయైవిలసిల్లు నట్టి సర్వ
మయు నతీతు ననాద్యు నద్వయుని నిట్లు
నిందసేయుట దగునయ్య నీకువడుగ! 144

గీ॥ పలుకులోకలతు యేటికి బ్రాహ్మణుండ!
నాదు దేహంబు సర్వేశునకు నొసంగి
యున్న దానను, నీవింక నొండుపలుకు
లుడిఁగి, నీత్రోవ చొప్పున నడచిపొమ్ము. 145

వ॥ అని పలుకుచున్న సమయంబున నమ్మాణవకుని శిష్యుండిట్లనియె 146

సీ॥ క్రోల్పులినైనను గొబ్బుననురుమాడుఁ బటుకరిశిరమైనఁ బగులగ్రుద్దుఁ
గార్చిచ్చునైననుఁగడకంట నిమిడించు శైలంబునైనఁగెంగేలఁదాల్పుఁ
గాలకూటమునైనఁగడిగానొనర్చును బలుపామునైననుఁ బట్టిదిగుచుఁ
బెనువిత్తినైనను వెనుకొనిబరిమాల్చు జమునైన మాల్కొనిచదియఁ
దుదకు సంద్రంబునైనను దొనకుఁదెచ్చు [గొట్టుఁ॥
నితనిమహిమలు గొనియాడ నేరిదరము
వటుని మాత్రంబుగా నెంచవలదితండు
బరగ సర్వజ్ఞుఁడని కేలుబట్టుమబల. 147

వ॥ అని బోధించు సమయంబున. 148

క॥ విల్లుగొని మరుఁడు శరములు। ఝల్లుననిగుడించెఁ జిత్తజల్లులవలె న
ఫుల్లమునడిల్ల పడు చా। యల్లకశిఖి చేతవేఁగి యావటుఁగనియెన్. 149

ఉ॥ చందనగంధి! నీమొగముచందము చెందొవవిందు నందముం
జిందును, గుంద బృందములఁ జిందఱవందఱ జేయు దంతముల్,
కెందలిరాకు పొందికలఁ గ్రిందుపడంగ నొనర్చుమోవి, సం
క్రందన నీలసుందరతఁగంగుపలాడును సోగపెన్నెఱుల్. 150

సీ॥ కుచకోకములఁ బట్టుకొని హింసఁజేయక
వదనేందు బింబంబు ముదమొసంగు
దృక్చలీ ముఖములఁ దెగఁజూడకను
నాసికాగంధఫలి సువికాస మొసఁగు.
గమన మత్తమరాళ సముదయంబునకును
కచఘనాఘనము సాంగత్యమొసఁగు
నూరులన్కరికరయుగళంబునకుఁ బొందు
నొసఁగు మధ్యమ్మృగేంద్రుఁడొప్పమీఱ॥
లలితమగుచు వెలయు కలకంఠ కలకంఠ
మధరపల్లవమున కధికముదము
నిడును సీతపోమహిమచే విరోధులు
చెలిమిఁగలిగి రెలమిఁదలిరుబోఁడి. 151

మత్తకోకిల॥ పూలవిల్తునివాఁడి తూఁపులఁబోలు చూపులకోపుచేఁ
దాళఁజాల,విరాళిఁ బొందెనుఁ దద్దయున్మది, వేడ్కతోఁ
గేలుపట్టుట కిచ్చగింపుము, కేళిఁదేల్చు సుశీల! యో
బాల! యోకచపాళినిర్జితవాల! యో గుణశాలినీ! 152

వ॥ అని యిట్లు మదనోన్మాదంబునఁ బల్కుచున్న మాయామాణవకుని
వాక్యంబులు విని డెందంబునఁగుంది రోషారుణిత నేత్రారవిందయై
మేనకాత్మజ చెలికత్తియల కిట్లనియె. 153

గీ॥ అరయునచల ధర్మోజ్జ్వలుండనుచుఁ, బుణ్య
జనవరాప్తుం డటంచును, ఘనముగాను
బూజఁజేసితి నీతనిఁ బొలుపుమీఱ;
నకట! దోషాకరవతంసుఁడయ్యెఁజూడ? 154

సీ॥ శ్రీరమారమణ సంసేవితపాదాబ్జు ఘనతరగవృషవాహుఁ గాలకాలు
నబ్జసంభవనుతు నమరరాడ్వందితు మహితచంద్రకలాపు మారమారు
నఖిలలోకారాధ్యు నాద్యంతశూన్యు సర్వప్రపంచాతీతు రామరాము
నంధకాసురవైరి నబ్ధినిషంగు సందీప్తవిగ్రహు శర్వు దేవదేవు॥
నభవు నీశ్వరుఁ గుండలిహారుఁ ద్రిపుర
దమను శార్దూలదానవశమను దీన
పోషు దుర్జనసంఘవిద్వేషు భక్త
పాలు సద్గుణజాలు గృపావిశాలు. 155

ఆ-వె॥ నిందఁజేసె నహహ! నీతిఁ దప్పంచు, వీని
నిచట నుంచఁగూడ దెచటికైనఁ,
బొలఁతులార! తగిన బుద్ధులు సెప్పుచుఁ,
దొలఁగఁజేయుఁడనిన నలలితముగ. 156

క॥ కోకస్తనులందఱుఁ దమ । కోకలు బిగఁగట్టి మిగులఁ గోపమెనయఁగా
నా కైతవ వటుని గదిసి । రాకంతూత్సృష్టపేశలాంబకములనన్. 157

వ॥ అంత. 158

క॥ శృంగారవతులఁగని, యా । భృంగీశ్వరుఁ డిట్టులనియె భీతిఁదలిర్పన్
గంగాధర! నీకిటది । క్కుంగల్గిన వేగఁజూచుకొమ్మా యిపుడున్. 159

సీ॥ ఇఁకనేమిచేసెద నెవ్వరుదిక్కు హా కామినీభూతము ల్గదిసిబట్టె
నెందేనిఁబోక మీ రిందేలవచ్చితి రిఁకమిమ్ము విడువరీ యింతులెల్ల
వచ్చిపొంచుగ మీరువసియించియుండక పోకల్లఁబోనేలఁబూనియిచట
వినువకెల్లప్పుడురసయుక్తముగఁజదు వెవరుసెప్పుదురునేనెటకుఁబోదు॥

ననుచు నగుచుచున్న యాశిష్యుఁ గనుఁగొని
యింతులెల్ల నప్పు డెలమితోడ
మొట్టిపెట్టకుండ మును వీనిఁబట్టుఁడీ
యనుచుఁజేఱ నాతఁ డతిభయమున. 160

సీ॥ అయవారి పుస్తకం బంటకుఁడీ మీరు
మీకు మ్రొక్కెదనంచు మెల్లగానుఁ
బాదభగ్నంబైన పగిదిఁ గుంటుచువచ్చు
భృంగినిఁ గని నవ్వి ప్రియముమీర
మీయయ్యవారికి మేముబెట్టెడిపాట్లు
జూడుమటంచును జోద్యముగను
వడిగొనివచ్చిన వడిమొట్టివెట్టుచు
ననువదలుఁడి మీరు నయముగాను॥
నయ్యవారియొద్ద నధ్యయనముసేయ
బోటులారవినుఁడు సూటిమీర
నరయ నేటివరకునైదక్కరములైన
వచ్చుటెఱుఁగ నేను వాస్తవముగ. 161

ఆ-వె॥ అయ్యవారిజోలి యక్కరలేదిఁక। నేమియైనఁగాని నితనికిచట
ననుచువేఁడ నతని నతివలువిడనాడి।వటునిఁజేరఁజనిరి వరుసతోడ.

వ॥ అంత నద్దేవదేవుండు వారలకు నివ్వెఱఁ బుట్టించునట్టి యుపాయంబు
మనంబున నిశ్చయించి. 163

సీ॥ తారహారపటీర ధవళదేహముతోడ
చక్రనికృత్తివాసంబుతోడఁ
చంద్రసూర్యానల చక్షుస్త్రియముతోడఁ
జక్షుశ్రవేంద్ర భూషణముతోడ
నిర్జరేంద్రాశ్మ సన్నిభ కంధరముతోడ
నరుతను రుద్రాక్ష సరులతోడ
సౌదామినీధామ సమ జటావలితోడ
డంబారు వ్యాఘ్ర కేశంబుతోడఁ॥

గేలనలరేడు ముమ్మొనవాలుతోడ
ఘనతరంబైన వృషభవాహనముతోడ
సకియలరుదందఁ గుటిలవేషంబు విడచి
రాజశేఖరుఁడయ్యె నా బ్రహ్మచారి. 164

వ॥ శిష్యుండును భృంగియయ్యె నంత నప్పార్వతి నిమీలితాక్షియు నా
స్వేదగాత్రియు భయ సంభ్రమాక్రాంత స్వాంతయునై యున్న సమ
యంబున. 165

క॥ కలవాణిగౌరికనియెను । గలకలనవ్వుచును, హేమకలశస్తని! బు
ద్ధులుసెప్పితివీవరయుఁగఁ । జెలువునకన నంత నొక్కచెలియిట్లనియెన్.

గీ॥ ఇతని కెగ్గేమిజేసె నీయిగురుబోఁడి
బ్రహ్మచర్యంబు మానిపి వరగృహస్థుఁ
జేయఁగాఁబూనె నవిబల్క శిఖరిపుత్త్రి
కెక్కడనులేని సిగ్గప్పుడేగుదెంచె. 167

వ॥ అయ్యవసరంబున. 168

సీ॥ సాంద్రశరచ్చంద్రచంద్రికాంగమువాని నాగేంద్రవరకంకణంబువానిఁ
జంచలానిభమైనజడలకాంతులవానిఁ దరణిచంద్రాగ్ని నేత్రములవాని
హస్తతలాగ్రవిన్యస్తశూలమువాని నవ్యశార్దూలాజినంబువానిఁ
జారుకంధరజితశక్రాశ్మములవానిఁ గలితఖండేందుశేఖరమువాని॥
కరసరోరుహధృత కురంగంబువానిఁ
బ్రేమఁజిల్కెడు జిఱునవ్వు మోమువాని
వృషతురంగంబుపైని దీపించువాని
గౌరి పొడగాంచెఁ గన్నుల కఱవుదీఱ. 169

వ॥ ఇట్లు పొడఁగాంచి నమ్రవదనయైయుండునంత. 170

క॥ ఇంపు జిగురొత్తఁగా ము
ప్వంపుల విల్లెక్కుపెట్టి వడినిగుడించెం
దెంపునుఁ బెంపునుఁ గదురఁగ
నంపగముల మదనుఁడా పురాంతకు మీఁదన్. 171

వ॥ అట్టియెడ శంకరుండు గౌరి కిట్లనియె. 172

క॥ శారీశుక హారీత మ । యూరీ నికరంబు లేచుచుండెను నిపుడే
నేరీతిఁ దాళఁగలను మి । టారీ పూవిల్తుచే కటారీ నారీ. 173

క॥ హేలా జాలము సేయుట । దేలా ఖండేందుఫాల హేలముమేలా
బాలా? కచజిత చమరీ । వాలా సుగుణాలవాల పావనశీలా. 174

ఉ॥ అన్నులమిన్న! నీదు మహితాత్ముల కోడిమృగంబు రాజుఁ జే
రన్నెనరొప్పనాతఁడు దురంబునకై జనుదెంచి నీముఖం
బున్నయమారఁజూచి పరిభూతినిఁజెంది విచారయుక్తుఁడై
జిన్నదనంబునొందుచుఁ గృశింపఁగఁజొచ్చెఁ గ్రమక్రమంబుఁగాఁ.

చ॥ కలికిరో! నీవు నీబెళుకు కన్గవ కంజనము న్ఘటించి రా
జిలు మకరాంకపత్త్రములఁ జెక్కులఁదీరిచి మేలికస్తురిం
దిలకముదిద్ది గుబ్బలకుఁ దీఱుగ గంధమలంది వేడ్కమీ
ఱ లలి నరుంగుదెమ్ము వలరాయని గజ్జల గుజ్జుమోయఁగన్. 176

ఉ॥ నీదగు చూడ్కినేటులును నీదుసయాటలు నీదుపాటలు
న్నీదు మెఱుంగుగోటులును నీదగు చిన్నఁదనంపుటాటలు
న్నీదు మొగంబుతేటలును నీదు నెయారపు ముద్దుమాటలు
న్నీదగు నీటులు న్గనఁగ నెమ్మదిఁ గోరెద నంబుజాననా. 177

సీ॥ తరుణి! నీనెమ్మోముఁదలఁచిగదా శశధరుని నౌదలపైనిఁదాల్చుటెల్లఁ
జెలియ! నీ బెళుకుఁజూపులఁజూడఁగోరికదా కేల జింకనుదాల్చుటెల్లఁ
గలికి! నీనూగారుచెలువంబుఁగోరికదా చిల్వపోఁగులు దాల్చుటెల్ల
వెలఁది! నీగబ్బిగుబ్బలపెంపుఁగనఁగదా పుత్తడిగుబ్బలిఁ బూనుటెల్ల॥
నింతి! నీయంగకముల కొకింతసాటి
వచ్చుచున్నవియనికదా వానితో ప్ర
యోజనము మాఱఁగల్గ లేకున్న నిట్టు
లూరకేదాల్ప నవసరంబొందుగలదె? 178

ఉ॥ ఏలమొగంబువాల్చెద వదేల నన్నుగనులెత్తిచూడవో
బాల! వనాంతరంబులఁ దపంబొనరింపుచునుండ మెచ్చి నీ

పాలికివచ్చినాఁడ నను భావజుఁగేళినిఁదేల్చి బ్రోవు మిం
కేల వృథాప్రయాసము ఫలించెను గోరిన కోర్కెలన్నియుః. 179

గీ॥ తుంటవిలుకాఁడు శరములు వింటనూని
కంటకప్రవృత్తి నావెనువెంటనంటి
గొంటుదనమున నిప్పుడు వెంటఁదఱుము
నొంటిజిక్కితిఁ బ్రోవు వాల్గంటినన్ను. 180

ఉ॥ బంగరురంగు దువ్వలువ బాగుగఁగట్టి కుచద్వయంబుపై
రంగుగఁ బైఠిణీఅవిక రాజిలఁదాలిచి కంకణధ్వనుల్
రింగునఁబర్వఁ గొప్పు సవరించి తటాలున నేగుదెంచి నా
కంగజుకేళివేడుక నుపాయనమిమ్ము మృగీవిలోచనా. 181

ఉ॥ గర్వితుఁడై మరుండు సుమకాండము లేయఁగఁజొచ్చె నింక గాం
ధర్వ వివాహమాడుటకుఁ దత్తఱమందుచునుండె డెందమో
పర్వతరాజపుత్త్రి! చెయివట్టుట కిప్పుడె మంచిదంచు నా
శర్వుఁడు డాయఁబోయి హిమశైలకుమారిక కొంగువట్టినః. 182

ఆ-వె॥ శాలుమేల్ముసుంగు గీలుకొల్పుచు గౌరి
సిగ్గుదనర మిగుల శిరమువంచి
యనుఁగుఁజెలినిఁజూచి యనురాగమున నిట్లు
శివుఁడు వినఁగఁ బల్కెఁ జిగురుఁబోఁడి. 183

గీ॥ "కన్యనిమ్మని శైలమూర్ధన్యువేడ
దగినవారినిఁ బంపుట ధర్మపథము
తల్లిదండ్రులచాటుదీ తరుణి" యనుచు
విన్నవింపంగరాదెయో వన్నెలాఁడి. 184

చ॥ అన చిఱునవ్వునవ్వుచును నర్ధశశాంకకలాపుఁడామె కి
ట్లనియె లతాంగి! నీహొయ లహర్నిశముమ్మదినెంచు చున్నఁడో
నినుఁగనుటంచు డెందమునసెమ్మిఁ దలంచుచునుండఁ బ్రాప్తమా
యెనునది నేఁడు నీకరుణ నిట్టితటిం బెఱమాటలేటికిః. 185

ఆ-వె॥ కీరవాణి! నీవు గీలుకొల్పినశాలు
మేల్మిసుంగు మిగుల మేలిదగుచు
మాకుఁజూడనలరె మన్మథాగమ దీక్ష
వేళ నుల్లభంపుఁ జేలమట్లు॥ 186

ఉ॥ ఓనగరాజవంశకలశోదధి శీతమయూఖ సోదరీ!
మానితవైఖరిం గుసుమమార్గణముల్మదనుండువేయ నూ
చీ నికరోపమంబగుచుఁ జిత్తమును త్తలఁబెట్టుచుండె నా
ప్రాణములెల్ల నీవి యిఁకఁ బాలనెముంచెదొ? నీళ్లముంచెదో?. 187

గీ॥ అనినఁ గలవాణి యిట్లనె హరునితోడ
భావజారాతివయ్యునో దేవదేవ
నీవె యన్యులికై వడి నీరజాస్త్రి
ధాటికడలితి ననుమాట పాటియగునె?. 188

మ॥ తగునయ్యా మిముఁబోటి ప్రాజ్ఞులకుఁ జిత్తంబిట్లు నానావిధం
బుగనుంటం దలిదంద్రులాప్తులు గడున్మోదంబుతో నింటనుం
డఁగ నీవిత్తిజనిట్లువేఁడనగునా? "న స్త్రీస్వతంత్రా" యనన్
జగతిం బెద్దలవల్లమున్వినమె? యీచందంబు లింకేటికిన్? 189

వ॥ అని యివ్విధంబునం బల్కి చెలికత్తియలా హైమవతిన్నిజమందిరంబు
నకుఁ దోడుకొని పోవుచుండ శంభుండిట్లనియె. 190

చ॥ నిలునిలు పోకుపోకు హరినీలశిరోరుహా! వేడ్కనీవనం
బులమధువానుచున్న యలిపుంజము నిప్పడలిప్రజంబెయా
నెలవున నీవునృత్యములు నేర్పినబర్హిఁదలంప బర్హియాఁ
గొలఁకులనుండుకోకములు గోకములేయగు మమ్ముబాసినన్. 191

చ॥ మరుఁడుశరమ్ములేయ శశిమానుగ వెన్నెలఁగాయఁ దుమ్మెద
ల్వరుసగ్రమోయఁ గోయిలలు బాగుగఁగూయఁ బిసాళి జక్కవ
ల్సరగునరేయ రాచిలుకచాలు హళాహళిసేయఁ బిల్లతె
మ్మెరలాగిడాయ నేగతిని మీనవిలోచనతాళుదానవే. 192

వ॥ అనినఁ గలవాణి యిట్లనియె. 193

క॥ జాలిందూలుచదేలా। బాలేందు కృతావతంస పలవించెదవీ
బాలకయి! "కాముకస్యకుతో లజ్జా"? యనెడుమాటతుదినిజమయ్యెన్.

క॥ అని యివ్విధమునబలుకఁగ। వినిశంభుఁడుగౌరిఁగాంచి వెలఁదిరో! యుష్మ
జ్జనకునివేఁడగఁబంపుదు। ఘనపుణ్యులననుచు మరలె కైలాసమునన్.

గీ॥ కాంత నెడబాయలేక శంకరుఁడు జనుచు
వెనుకఁగను జూపుమేర గన్గొనుచునుండె,
కాంతుఁడట్లేగుచుండంగఁ గనియుబేల
చందమునగౌరి జనుచుండె సఖులతోడ. 196

గీ॥ అరయ వందారు మందారుఁడైన భవుఁడు
కాంతకోరికెఁదీర్చుట వింతగాదు,
తరుణి; తాను ప్రేమించిన పురుషుఁడట్లు
తారసంబైన విడుచుటెంతయును వింత. 197



వ॥ అంతచెలికత్తియలక్కలికి న్నిజాంతికంబునకుం దోడుకొనిపోయి నగేం
ద్రునితో జరిగిన వృత్తాంతంబంతయుఁ బూసగ్రుచ్చిన ట్లెఱింగింప
నాతండమితానందంబున నున్నంతనొక్కనాఁడు విభావరీసమయంబున
నప్పార్వతి నింగియుఁ బుడమియుఁ గనరాని యంగభవ మాయాంధ
కార వికారంబునకు లోఁగి కలంగుచు నెచ్చెలుల కిట్లనియె. 198

చ॥ హరహర! తాళఁజాలఁ గుసుమాస్త్రుని ధాటికు గోడుఁబోసికొం
టిరి చెలులార! పద్మభవనీరజనాభ సురేశ్వరాది ని
ర్జరవరులైన వేడ్కఁగన శక్యముగాని మహేశుదర్శనం
బరుదుగఁ బ్రాప్తమైన విడనాడఁగఁజేసితి రెట్టి కూళలో?. 199

ఉ॥ కూరిమి మీఱ శంభు మదిఁగోరి తపంబొనరింపుచుండ నా
కారుణికోత్తముండు ననుఁ గామరణాంగణసీమఁ బోరు మం
చారడిఁబెట్టఁగా నపుడు హాయిగ నాతనిఁ గూడకిప్పుడీ
మారశరార్తిఁగుందుచును మానుగ వెంగలినైతినయ్యయో. 200

ఉ॥ ఎన్నఁడుఁజూచుటో నభవు? నెన్నఁడు నాతనితోడఁ బల్కుటో?
నెన్నఁడు పెండ్లియాటొ? తగనెన్నఁడు నాతనితో సుఖించుటో?
నన్నగధన్వియోష్ఠమధురామృతపానముమాని వెట్టినై
గ్రొన్ననవింటివాని సుమకుంతము పాల్బడి జిక్కితింగటా. 201

సీ॥ విపులవక్షమువాఁడు పెసగారుబంగారు
గట్టు విల్లొకచేతఁ గల్గువాఁడు
నీలకంఠమువాఁడు నీహారకర హార
నీహార నిభకాంతి నెగడువాఁడు
నిడుదచేతులవాఁడు కడకంట వెడవింటి
బలుదంటమడియించి వెలయువాఁడు
వ్యాఘ్రచర్మమువాఁడు వందారుబృంద మం
దారమై చెలువుచేఁ దనరువాఁడు॥
మించులనుమించు జడలచే మెఱయువాఁడు
కుండలిస్ఫురితాంచిత గండయుగళుఁ
డైన నన్నేలువేలుపు నచటవిడచి
యేలవచ్చితినిచటికిఁ జేలనగుచు. 202

క॥ వామాయతాక్షులారా! | కామితమందారుఁడైన కఱకంఠుఁడు న
న్వేమారుఁగోరి వేఁడిన| మోమోటమివడితి నకట మోసంబయ్యెన్.

వ॥ అనియిట్లు దీనాతి దీనంబులగు వాక్యంబులు పలుకుచున్నతఱి కల
వాణి గౌరి కిట్లనియె. 204

గీ॥ ఇంత చింతిల్లఁగారణంబేమి నీకు?
నీకు సోయగంబెల్లను నీలగళుఁడు
జూచియరుదందెఁగాదె? యాసూనశరుని
పూములికితాకులకు నతఁ డేమియగును?. 205

ఉ॥ కామమురాపబాణశిఖఁ గ్రాగుచునుండఁగ నేల? నమ్మకో!
నామనివాలకించి నను నాగవిభూషణుఁ జేరఁబంపు మా
తామరసారిశేఖరుపదంబుల సన్నిధికేగి యాతనిం
బ్రేమదలిర్పనీకు వెలఁబెట్టని బంటుగఁజేసి తెచ్చెదన్. 206

గీ॥ అనిన గిరిపుత్రి కొంత ధైర్యంబుఁబూని
యనియెఁ గలవాణితోఁ "జెలువునకుఁ జెలికి
జీవితంబులు ప్రియసఖి చిత్రచతుర
వాక్యసంస్థితములుగావె?" వనజనేత్ర!. 207

క॥ నీవాచా ప్రౌఢత్వం। బావిధు కోటీరుచెంత నతి చతురముఁగా
నేవిధిని నెఱపి యిటకా। పావనమతిఁ దోడుకొనుచు వచ్చెదవు కదా?.

వ॥ అనినఁగలవాణి తనసాటి చెలికత్తియలతోడ నిట్లనియె. 209

గీ॥ తివిరి కనకాభిషేకంబుఁ దేఁటులకును
జెలఁగి సాంకవగంధంబు చిలుక గమికి
వీఁక ధవళాంశుకస్ఫూర్తిఁ గోకములకు
నొదవఁజేయుఁడు దర్భ్యయమొదవకుండు. 210

ఆ-వె॥ నేనురయముగాను నీలకంఠునిపాలి। కరిగి మఱలివచ్చునంతవరకు
నువిదలారతగినయూడిగంబులు సేయు। చెలమిగదురనుండుడింతిచెంత.

ఆ-వె॥ అనుచుఁ జెలులతోడ ననురాగమునఁబల్కి-
యగజఁగాంచి యిట్టులనియె నీదు
మేననున్నసొమ్ము మిహిరాంశుశకల శే
ఖరున కానవాలుగా నొసంగు. 212

గీ॥ అనిన విని గౌరి మౌక్తికహారమొకటి
శీఘ్రమునఁదీసి కలవాణి చేతికిచ్చి,
వనిత! "నాపాలి భాగ్యదైవము నిచటికి
నెమ్మిఁ దోడ్తెచ్చి యుసురులు నిలిపిమనుపు". 213

క॥ అనవిని నెచ్చెలి పటురయ। మునఁనేగిన నట్టిసమయమున హిమగిరినం
దినికుసుమ సాయకునిమా। యనుదగిలి చిరాకుఁబడఁగనతివలుభీతిఁ.

వ॥ చేయునది లేక యున్నంత నవమాలికా మదన మోహినీ చంద్రరేఖా
మంజువాణీ హేమలతా ప్రముఖ సఖీజనంబులును, రంభా యూర్వశీ

తిలోత్తమ ప్రముఖ ప్రతివేశినులును, చిత్రరేఖా మంజుఘోషా హేమాప్రముఖ శిల్పినులును, మదాలసా హరిణీ ఘృతాచీ వరూధినీ ధాన్యమాలినీ మనోరమా ప్రమోదినీ పూర్వచిత్తీ కళావతీ మాధవీ ప్రముఖ చేటీజనంబులును, పద్మగంధీ జగన్మోహినీ ప్రముఖ సందేశ హారిణులును సముచిత సత్కారంబుల శిశిరోపచారంబులు సేయుచు విస్పష్టమధురాలాపంబులాడుచునింక నిచ్చటనుండుట కార్యంబుగాదని కుసుమశర శరనికర వేదనా దోధూయమాన మనోంబుజాత య గుచుఁ బ్రతిపచ్చంద్ర రేఖయుంబోలెఁ గళామాత్రావశేషంబై యున్న హైమవతిని నిజగృహాపరిభాగంబునకుఁ దోడుకొని పోవుచున్న సమయంబున నొక్కనెచ్చెలి కరంబువట్టి మందమందగమనంబుల నేగి.

ఆ-వె॥ చేడెలెల్లఁదన్ను సేవింపుచుండ సౌ
ధాగ్రభాగమునకు నరుగుచుండె
కువలయాస్త్రు చేతి కుసుమధనుస్ముక్త
పుష్పబాణమనఁగఁ బుష్పబోఁడి. 216

వ॥ ఇవ్విధంబునఁ జనిచనియొక్క నీలమణిస్థగిత శిరోగృహాంతరంబునఁ దా రకామధ్య శశిరేఖయుంబోలె సఖీజనపరివేష్టితయై గూర్చుండి మద నోన్మాదంబునఁ బెక్కువిధంబులఁ బరితపించుచున్న గౌరింగని చెలి కత్తియలిట్లనిరి. 217

ఉ॥ బింబఫలోష్ఠి! నీ హృదయవీథి విరాళిఁగొనంగనేల? కా
దంబరినింత గ్రోలిన ముదంబొనరించు రమాకుమారు మా
యం బడఁద్రోయునంచుఁ గుసుమాసవమింత సువర్ణపాత్ర సం
ఘంబులనించి దెచ్చి గిరికన్యక తోడను గ్రోలిరందఱుఁ. 218

గీ॥ మదిరచవి నెన్నఁ డెఱుఁగని ముదితలెల్ల
నొడలెఱుంగక త్రాగుచు నొక్కమొగిని
వీనులను మూయుచును మది బెగ్గడిలుచుఁ
గనులు గిరగిర దిరుగంగ కళవళమున. 219

సీ॥ గిరగిర కుతలంబు దిరిగెననియె నొర్తు
  విను మీఁదఁబడుచుండె ననియె నొర్తు
కొండలు బరువెత్తుచుండె ననియె నొర్తు
  వనము లాడుచునుండె ననియె నొర్తు
వనజారి తెగి నేలఁబడుచుండె ననె నొర్తు
  రిక్కలఁ గని వెక్కిరించె నొర్తు
మారుతుఁడదె వచ్చె మదిరనిండనె నొర్తు
  మనసిజుండదె బట్టుఁడనియె నొర్తు॥
వడిగ ననుఁజూడుఁడనిగంతులిడియె నొర్తు
వనిత! 'నా సీధు పాత్రలు గొనఁగ నీక
దెట్టియోజ' యటంచుఁ దా నెలమినొక్క
పంకజాతాక్షి కుచములు బట్టెనొర్తు. 220

క॥ ఒకటిననఁబోవుచునువే । యొకటిననెడువాక్యములునుహుంకారంబు
ల్వికవికలాడెడునవ్వులు । నెకసక్కెంబులును సలిపిరెంతయువనితల్.

గీ॥ వనిత యొక్కతె పుష్పాసవమ్ము నిడిన
పాత్రమందునఁ దనమోము ప్రతిఫలింప
చంద్రుఁ డదె దొంగవలెవచ్చి చషకమందుఁ
బొంచె మధువునానుటకంచు బొబ్బలిడియె. 222

వ॥ అయ్యవసరంబున. 223

క॥ నగరాజతనయ దంతపు । సొగటాలం గేలఁ బూని సుదతుల నడుమ
దుగదచ్చి బారతిగసత । పగడయనుచు సారెవ్రేయువలయధ్వనితోఁ.

వ॥ మఱియు నాసమయంబున. 225

గీ॥ కుసుమసాయక నీవు మా కుచములంటఁ
బోకు పయ్యెద విదలింపఁబోకు కొప్పు
ముడి విదల్పఁగఁబోకు పైఁ బడఁగఁబోకు
మనుచు నొక చెలియకలగొంది యఱచుచుండె. 226

సీ॥ కలశపాథోరాశి గర్భఁపీచినిబుట్టు
నట్టి చంద్రుండు మా కన్నగాడె ?
విరహుల ధైర్యము ల్భేదించు పుష్పబా
ణుండెన్న మా కుమారుండుగాడె ?
యతను సమ్మానియౌ నావసంతుఁడు పర
భృతఖేదములను మాయించుఁగాదె ?
యఖిల జనాహ్లాద మై చెలంగెడుజల
జాతము ల్మా నివాసములుగావె?॥
మా నిజగతి నెఱుఁగుదురు గాన నెలమి
మా కహితములు చేయుట మాని జగతి
మా హితంబె గోరుదురు సమాహితముగ
ననుచుఁ జెలులెల్లఁ బలుకుచున్నంతలోన. 227

సీ॥ స్వర్భానుకఠినదంష్ట్రా జ్వాలికల లోన
గరిడీచేసిన మృగాంక కిరణములును
మఖభేదిదృగ్ఘోర శిఖశిఖావళితోడ
సాము జేసిన కాముసాయకములు
భోగీంద్రవదనసంభూత ఫూత్కృతులలో
నారిఁ దేరిన మారు తాంకురములు
ఘనకర్కశకదంబక స్నేహమొనరించు
చటులోగ్రతర పికార్భటి నిచయము॥
నంతకంతకు వెగ్గలం బై దనర్చ
విరహభరయు క్తయై హిమగిరి తనూజ
మదిని ధృతిఁదూలి డోలాయమాన మాన
సాంబు సంజాతమైయుండె నంచితముగ. 228

వ॥ అత్తటి నా చెలికత్తియలందఱుఁ దత్తరంబున మొత్తమ్ముగట్టి బరు
వెత్తి చిత్తజుని కత్తులగు నెత్తమ్ములకాఁకలకు నొత్తిగిలుచున్న యా

బి త్తఱింగాంచి, యమ్మా! కమ్మవిల్తుని పూవుటమ్ములు నీ నెమ్మేన నాట
కుండ నొక్క యుపాయంబుఁ జేసెదము మా మాటలు నమ్మి నెమ్మ
నమ్మున గ్రమ్ముకొనియున్న నుమ్మలికమ్ము విడనాడి సమ్మదంబున నుండు
మని బోధించుచున్న సమయంబున నెత్తమ్ములదాయంగని. 229

సీ॥ విబుధావళికిఁ గళావితరణఁ గావించి
వరలెడు సన్మార్గవర్తి యితఁడు
కలశపాథోరాశి గర్భసంజనితుఁడౌ
కువలయామోదియౌ కోవిదుండు
తత తమోహరణంబుఁ దద్దయుఁ గావించు
ఘనుఁడైన కౌముదీఖని యితండు
ఆశ్రితద్విజ హృదయ్యాహ్లాద దాయియై
రాజిల్లు ఘన వసురాజితండు॥
వరసుధాకరుఁడు మఱి జైవాతృకుండు
చెలువముగ చక్రహేళన సేయు శీత
కరుఁడహహ యీతఁడని యనుచరులతోడఁ
దుహినగిరిజాత వర్ణింపఁదొడఁగె మఱియు. 230

సీ॥ తొలుదొల్త ముదముచేఁ దొలికడ వరలుట
చదలు ముట్టుట శివు నెమరుకొనుట
రాత్రి సంచారంబు రమణఁగావించుటఁ
బరివేష మిషఁ బాశధరుఁడవగుటఁ
బరికింపఁ గువలయప్రాణబంధుఁడ వౌట
డాజితంబుగ వసురాజవగుట
నలరంగ సొగసైన హరిణంబుఁ దాల్చుటఁ
గమల జన్మండవై ఘనతఁ గనుట॥
విమలవిధునామ మునుఁదాల్చి వెలయుటయును
భావమునఁ దలపోయ దిక్పాల కమల

సంభవాంభోజ లోచనాం శములుగల్గి
రాజవై తివిచంద్ర! విభ్రాజితముగ. 231

వ॥ అని యివ్విధంబున నీహారకిరణుం బొగడిన నంతకంబేకు విరహ మగ్గల మగుచుండెంగాని నించుకేనియు నుపశమింపకున్నదని పల్కు హైమవతి వాక్యంబులు విని మింటవెలింగెడు చుక్కలజేనింగని చెలికత్తియ లిట్లనిరి. 232

ఉ॥ అంబురుహాక్షుల న్మిగుల నార్తిఁదలంకఁగఁ జేయునట్టి పా
పంబు శశాంకరాహుగతిఁ బర్వదినంబుల వెన్నునంటి నీ
వంబుధిఁ బుట్టినందగ నగాగ్రముమట్టిన మిన్ను ముట్టినన్
సాంబు శిరంబువట్టినను జయ్యనఁ బీచమడంపకుండునే. 233

సీ॥ చెలియలియింటి బల్సిరిదొంగిలి సురపా
దులకెల్లపుడు గళాదుండవై తి
తమిసత్ప్రకాశసంతతిని మాయఁగఁజేసి
చక్రావలికిదిగు ల్సలుపుచుంటి
వహిభయోద్రేకంబు నడఁగింపఁ జాలక
కప్పఁగొంటివిసదా కాయమందు
సర్వజ్ఞుని శిరంబుఁ జరణంబుచేఁద్రొక్కి
గురుని సంసారంబుఁ గూల్చినావు॥
మిత్రతేజంబు సహియింప వత్రితనయ
రాజవై యుండి దోషవర్తనము సలుపు
చుండుటనుఁబట్టి జై వాతృకుండవగుట
నరయనీకిప్డె రౌరవప్రాప్తిగలిగె. 236

క॥ జనములునీకరమమృతం । బనిపలుకుదురక్కటకటయంబుజవైరీ
తినలేకవెళ్లఁగ్రక్కిన । ఘనరాహువెఱుంగునమృతకరమోగరమో.

క॥ ఓతుహీనకరకలశజుఁడు । వాతాపినివ్రాలె వనధిపానము వేళన్
హా! తేపెనేనినిన్నున్ । భూతలమునసతులకెల్ల ముదమొదవుఁగదా.

క॥ కులమే ప్రధానమనుకొను । చలరంగారాదునుమ్మి హాలహాలంబా
జలధిని నీతోఁబుట్టుటఁ । దెలిసికొనకపోతివికద ద్విజరాజభువిన్. 239

వ॥ అని పల్కు సమయంబునఁ గొందఱు నెచ్చెలులంతరిక్షంబుననున్న
చంద్రునిందింపఁ గారణంబేమి సన్నిహితుండైన కంతునివేఁడుకోవల
యుఁగాకయని మనసిజునుద్దేశించి. 240

సీ॥ దుగ్ధపాథోరాశి దుహితగర్భాబ్ధినిఁ బూర్ణచంద్రుని భంగిఁబుట్టినావు
ఆద్యంతవిరసమధ్యమ గుణాశ్రయమైన బాణాసనంబుఁ జేఁబట్టినావు
అభవాబ్జభవహృదయాబ్జంబులదరంగఁగువలయాస్త్రములచేఁగొట్టినావు
మాయావియైన శంబరదైత్యవర్యుండు మించిమదించిన మెట్టినావు॥
శుభ్రకీర్తిఁదిగ్భిత్తులఁ జుట్టినావు
విమలవైరాగ్యసంస్తంభ విద్యలకును
ఘనత బిరుదధ్వజంబెత్తి గట్టినావు
మహిత జగదేకవీర రమాకుమార. 241

క॥ భావభవ! బొమలపేరను । బూవిల్లును గొప్పపేరఁబొరినళిగుణమున్
భావముననెంచి మాచెలి। నీవరసాధనములనుచు నెమ్మిధరించెన్. 242

వ॥ అని ప్రార్థించుచు లతాంతాయుధునివలనఁ గొంతైన సంతసంబొదవ
కుండుట నెఱింగి నెచ్చెలి పరితాపాతిశయం బవలోకించి లతాంగులు
సక్రోధంబున నిట్లనిరి. 243

గీ॥ కుత్సితసుమంబుగావునఁ గుసుమమయ్యె
నట్టి కుసుమముల్గదతూఁపులయ్యె నీకు
గొమ్మలఁబొదవు నీయమ్ము దుమ్ముగాను
నీవు ధర్మంబుపరియలై నేలఁగలియ. 244

క॥ మొదటమనోభూతమవై । పదఁపడిశివునేత్రవహ్నిఁ బంచత్వముఁ బొం
ది దగ సకలప్రపంచము । ముదమున నేలితి వయారె పుష్పేష్వాసా.

గీ॥ మారుఁడనుపేరు నీకుఁ బద్మభవుఁడెలమి
మహితముగఁబెట్టెఁ దొల్లి నీమధుపగుణము

నెఱిఁగిగదదానికర్థంబు నెఱుఁగవకట
మారణోపాయ మర్మకర్మఁడు వనుట. 246

క॥ రజనీచరమిత్రుఁడవని! కుజాతములఁజేరు మధుప గుణుఁడవనుచు నీ
రజనాభుఁడూరకుండెను! భుజగాభరణుండు నిన్నుఁబొరిఁగొను వేళన్.

క॥ చేతోభవనీకమ్ములు। నీతల్లి నివాసములగు నీరజముల శం
కాతంకంబులు లేకయె। నీతిఁదొరఁగి యేచుచంద్రునిఁగలయఁదగునే?

వ॥ అని మఱియుఁ బెక్కు చందంబులఁ గందర్పుని నిందించి యిందిందిరా
లక సందోహంబుల్లంబు ఝల్లనమెల్లమెల్లన వీఁచు చల్లని తెమ్మెరఁ
గూర్చి యల్లనల్లననెద్దియోబలుకఁబోవు సమయంబున నొక్కప్రోఁడ
చేడియ వారలకిట్లనియె. 249

ఆ-వె॥ మారుఁడనఁగ జీవమాత్రావశేషుండు
నతనుఁడతనిఁగూర్చి యలుగనేల
విచ్చుకత్తులట్లు వచ్చితాఁకెడుపిల్ల
పమ్మెరనిటు దిట్టవలెనుగాక. 250

వ॥ అనిపవను నుద్దేశించి. 251

సీ॥ అంబకశ్రోత్రనాథాస్యస్థితోదగ్ర
కాలకూటంబుతోఁ గలసి మెలసి
చటులోగ్రతర మహోర్బటిహవ్యభుగ్ఘోర
విస్ఫులింగములతో నియ్యమంది
చండధామాత్మజోద్దండ భయంకర
హుంకారములలోన నూలలాడి
యామ్యాగ్ని సంతప్తయామ్యా దిగబ్ధిరా
ట్కల్లోలములనెల్లఁ గొల్లసలిపి॥
మహిపవరలెదారి! నీవు దుర్మార్గవృత్తిఁ
బైకిదెలియంగనీయక పవన! బాహ్య

శీతలంబున సంచరించెదవు దలఁప
నతి వినయమెల్ల ధూర్తతయంద్రుడుగాదె?. 252

గీ॥ నీవె తనప్రాణపదమని నెమ్మిఁదలఁచు
చున్నయన్నులతల మిన్నవెన్నుఁదన్ని
చకితపతిఁజెదవిఁకఁ బ్రభంజనుఁడవనుచుఁ
దెగడవలెఁగాని మెచ్చి నిన్బొగడఁ దగునె?. 253

గీ॥ అనిల! గరళంబుచేదో నీ తనువుచేదో
కనెదనని రెండు జిహ్వాలఁగదికి చిలువ
గరము నిమిడించుకొనెఁగాని ఖలుని నిన్నుఁ
దినియు వేసటఁబడుచు ఫూత్కృతులొనర్చు. 254

గీ॥ విరహిజనములపాలిటి వేరువిత్తు
వగుచునుడికింతువనికదాయంబుజాత
సూతిమదినెంచిరౌరవస్థునిగఁజేసి
మూలఁబడవైచె మలయసంభూత! నిన్నుఁ.

గీ॥ అల్లిబిల్లిగదిరిఁగిన యంతమాత్ర
మున జగత్ప్రాణుఁడందురు జనములజ్ఞు
లగుచుఁ దగసువర్ణకలాపహారి వగుటఁ
దెలియలేరయ్యొ నీగుట్టు మలయపవన. 256

వ॥ అనియిట్లు పవమానునవమాన వచనంబులఁదూలనాడి చెవులకులుకు
బుట్టించు చిలుకలం గనుంగొని. 257

గీ॥ ఫణిఫణంబులె భక్షించు బర్హిణులకుఁ
జెలఁగి విషబిందువులు జిల్కఁజెల్లుఁగాక
పానకముఁదేనెయును జూత ఫలరసంబుఁ
ద్రావి విషబిందువులు జిల్కఁదగునె చిల్క? 258

వ॥ అని చిలుకలఁ దూలఁబలికి పాంథజన శ్రవణ బాధాకరణ నిజనినాద
కలకలంబులగు కలకంఠంబులఁ గనుంగొని. 259

ఆ-వె॥ పరులపంచఁదల్లి పాలవై వఁగఁబుట్టు। గ్రుడ్డువయ్యు కాకి గుంపులోన
బ్రతికినట్టినీవు పడఁతుల గనికన్ను। లెట్టుఁజేసికూసెదేమి పికమ.

వ॥ అని యివ్విధంబున వనప్రియంబుల నప్రియంబులువలికి మధుకర నిక
. రంబులఁ గనుంగొని యిట్లనిరి. 261

ఉ॥ జుమ్మని మ్రోయుచున్నసరి సూనచయంబుల సీధువానుచుం
ద్రిమ్మరుచున్న లీమసులరీతిని వర్తిలుచుండు మిమ్ముడెం
దమ్మున గుత్తెఱింగియును దర్పకుఁడేమి గుణంబు వేడ్కతో
నమ్ముచుఁ బూలవింటికి గుణంబుఁగఁ జేసెనొ తేఁటిమొత్తమా. 262

గీ॥ అగ్నిబీజాక్షరంబగునట్టి రేఫ। మినుమడించిననామమైననుమీర
లంటరానట్టిచండాలులైతిరకట। కావుననెమీకుమధుపాఖ్యగలిగెభువిని.

వ॥ అని యివ్విధంబున నిందుకందర్ప మందగంధవాహ శుకపిక చంచరీక
ప్రముఖ శత్రుపక్షంబు నిందించి యంతకంతకుఁ బరితాపం బతిశ
యింపుచుండఁగని క్రోధావేశంబునఁ జెలికత్తియలు మఱియు నిట్లనిరి.

సీ॥ వేఁడి వెన్నెలఁగాచి విఱ్ఱవీగెద వేమి తొవఱేఁడ! నీయూపు దొండిగాను
పూఁదూపులేసి పూఁబోఁడినేచెద వేమి మారుఁడా! నీయూపుమండిపోను
కుజనులఁజేరిచొక్కుదువౌర చైత్ర! నీ బ్రతుకెల్ల వనములపాలుగాను
విచ్చుకత్తులరీతి వచ్చితాఁకెద వేమి వాతపోతమ! నిన్నుఁబాముమ్రింగ
తుమ్మెదా! యింక నీ త్రుళ్లు తుప్పలెక్క
కోకిలా! నీదు పుట్టిల్లు కూలిపోను
కీరమా! నిన్నుబట్టి సంకిళ్లువేయ
బర్హి! నీమురిపెము చెట్లపాలుగాను. 265

వ॥ అని యివ్విధంబునఁ దూలబలికి, నా జవ్వని నూఱడింపుచుండిరని
చెప్పినఁ బరమానంద భరితుండై ధర్మనందనుండంట మీఁది వృత్తాం
తంబెఱింగింపుఁడని మార్కండేయ మహాముని నడుగుటయును. 266

క॥ ధామనిధి వంశజలనిధి। సోమా సీతాభిరామ సుగుణస్తోమా
సోమనుతనామ దశరథ। రామా సన్మార్గకామ రాజలలామా. 267

ఉ. ఇందుకళావతంసుఁడు సుమేషునిక్రీడలఁ దేల్చుమంచునన్
స్పందమనోంబుజాతుఁడయి సారెకు వేఁడినఁ గాదటంచునే
నిందులకేగుదెంచితిని నిందునఁగల్గు మహోగ్రపాతకం
బెందునఁదీరునో తెలియ దేమిఁక సేయుదు నంచుఁ దూలఁగన్. 6

క॥ అప్పుడు ముద్దియలందఱు
నప్పొలఁతిని సెజ్జఁజేర్చి యాననముపయిం
గప్పినకేలుదిగిచి కొమ
రొప్పఁగ నశ్రులు జెరఁగుననొత్తుచు మఱియున్. 7

క॥ అమ్మా! యిమ్మాడ్కిని నీ । వమ్మారునిబారిఁబడుచు నడలెదవేలా?
లెమ్మా! నీకోరిక ని । క్కమ్ముగనెఱవేఱునమ్మ; కనకఁపుబొమ్మా. 8

ఉ. కామినులెల్ల నిట్టు లతిగౌరవమారఁగఁబల్కుచుండి బల్
ప్రేమదలిర్పఁగా నపుడు వీడినకొప్పుఁగుదిర్చి కొంగుచే
భామకపోలపాళికలపై దిగఁజాఱెడుబాష్పబిందువు
ల్వేమఱునొత్తుచుండ నరవిందనిభాస్యల కామెయిట్లనున్. 9

క॥ తడవయ్యెఁబోయి ప్రియసఖి । వెడవిల్తువజీరుచేతి విరితూపులపా
ల్బడిచిక్కితి నిఁకనాపై । నుడుపతిధరునకును గూర్మి యొదవునొలేదో.

గీ॥ అనుచు గడిదంపుటార్తిచే నన్నికడలఁ
దోడిచెలికత్తియలు దాను దూరదృష్టిఁ
గనుఁగొనుచునుండ నొకవైపు గానుపించెఁ
దళుకుకనులకు మిఱుమిట్లుగొలుపు కాంతి. 11

ఉ॥ మిక్కుటమైనతేజమున మించును మించుచునున్న దెద్దియో
చక్కనికాంతి నేత్రజలజంబులకెల్లను విందొనర్చుచున్
జుక్కలలో శశాంకుగతిశోభిలెఁ గాంతులనెల్లమించు చ
మ్మక్కి యిదెంతవింతయను చందఱు నద్భుతమోదమగ్నతన్. 12

సీ॥ ఇది జగంబులఁగెల్వ మదనుఁడెత్తినఁ గడు దీపించు మోహనదీపకళిక
కళికగాదిది వియద్గంగసంభవ రక్తరాజీవకోరకరక్తిమంబు
రక్తిమంబిదికాదు రాక్షసారాతివక్షోవాటినలరు కౌస్తుభము కాంతి
కాంతిగాదిది శచీకాంతువరమకుటాగ్రమునరాజిలుపద్మరాగదీప్తి

దీప్తిమాత్రంబుగాదిది దినకరోద
యం బటంచునుఁ జెలులాడునంతలోన
వచ్చెను శివార్పితమణీవిభావిరాజ
మానపాణియై కలవాణి మానితముగ. 13

క॥ వచ్చినకలవాణింగని
హెచ్చినతమి నింతులెల్ల నెదురేగి ప్రియం
బచ్చుపడఁ గాయె పండో
నెచ్చెలి ప్రియమారఁ దెల్పు నిండుముదమునన్. 14

ఆ-వె॥ అనుచుఁ బ్రియముతోడ నంగనారత్నంబు
లచటివార్తలెల్ల నడుగుచుండఁ
గడుముదంబునొంది కలవాణియిట్లనెఁ
బండు పండు రేపుపండుగవును. 15

చ॥ అనిన "నమశ్శివాయ"యను చందముఁ గేలుగవల్మొగిడ్చి నె
మ్మనములహర్షమంది గిరిమండలనాథునిపట్టిఁ జూచి యో
వనిత! ఫలించెఁగోర్కి కలవాణియుఁజల్లనివార్తఁ దెచ్చె నీ
మనమున నున్న చింత నిఁక మానుము బూనుము ధైర్యమిత్తఱిన్. 16

గీ॥ వనితలిట్లాడుతఱిఁ గలవాణి మదిని
"భక్తసముదాయగేయ సద్భాగధేయ
పాలితాఖిలసురజాల భవ్యశీల"
యనుచు శివునకు వందనం బాచరించి. 17

క॥ అంతట శంకరుఁడిచ్చినఁ। చింతామణి నెదుటనుంచి చెలులెల్లను న
త్యంతముదము నొందఁగనా। ద్యంతమునిట్లనియెఁదన యుదంతంబెల్లన్.

ఉ. ముద్దియలార! పన్నగవిభూషణుచందమదెట్టులుండెనోఁ
దద్దయుఁగాంచి యాతనికిఁ దామరసాక్షి తెఱంగుఁదెల్పిర
మ్మద్దెస కేగుమీవనుచు నంపఁ ముఁదెల్పినఁ గార్యకారినై
గ్రద్దన ఖేచరీగమన కౌశలమందితి సంతసంబునన్.

సీ॥ తివ్వనఁజనుచుండఁ జివ్వకై నెదిరింపవచ్చినగతిఁదోఁచెఁ బర్వతంబు
లుప్పరంబున కేగుచుండఁగఁ బెనుమబ్బు లప్పట్ల నెగురుచున్నట్టులయ్యె

నంతకంతకును భాస్వంతుఁడై చంద్రుఁడాకసమెల్ల దానయై గానుపించె
నవ్వేళఁజనఁ దారకావళి ప్రోవులై కనులకు మిఱుమిట్లుగడలుకొలిపె॥
నంత నెదురయ్యెసురనది యద్భుతముగ
నచటి కవనీతలము గొద్దిదగుచుఁ గొండ
లన్నియును జిన్నగుండుల ట్లంబురాసు
లెల్ల పడియలట్లుగ దోఁచె నింతులార. 20

గీ॥ గగనసరిదురువీచికా కలిత లలిత
వికచకువలయపరిమళబృందమిళిత
శిశిరజలకణగణయుత శీత మంద
మలయమరుదంకురౌఘంబు లొలసె నచట 21

క॥ మంజులసమీరణాంకుర । పుంజముగ మనశ్శ్రమంబుఁబోరఁ బాపంగా
రంజితమతిసుర వాహిని । కంజలినొనరించితిన్మహామోదమునన్. 22

మ॥ పరునంబించుక పోఁకఁగానినుచు భాస్వత్కాంచనంబై వసుం
ధరఁబెంపొందినమాడ్కిఁదావక మహాహాద్యచ్ఛీకరంబొందుసోఁ
క రహం గ్రూరమహాఘ్రపాపియు గతాఘస్తోమఁడై రాజిలుఁ
వరుసన్నీమహిమంబులెన్నుటకు నావాగ్జానియుంజాలునే 23

గీ॥ అనుచు నఘమర్షణస్నాన మాచరించి
రుచికరమగు తజ్జలములఁ గ్రోలిమఱియు
నమరనదికిఁ బ్రణామంబులాచరించి
కార్యనిర్వాహకాంక్షనై గదలి చనుచు 24

గీ॥ ఒక్కచోటను గనుఁగొంటినక్కజముగ
లీలఁ దారక లుపకంఠమాలికలుగఁ
దామరసవైరి వజ్రపుఁదాళి గాఁగ
వరలుచుండెడి యొకనగస్వామి నెదుర 25

గీ॥ అట్లుపొడగానవచ్చిన గట్లుఱేనిఁ
జూచి తద్వైభవమునకుఁ జోద్యమంది
మానితంబైన శంకరాస్థానభూమి
యిదియకాఁబోలునని దరి కేగనచట. 26

సీ॥ ఒకచోటఁ గిన్నరవికచాంబుజముఖీ కనత్కాంచనమయవీణానినాద
మొకవంక సిద్ధబింబోష్ఠీసమాజ మర్దల ధింధిమికిటధంధణరవంబు
లొకచాయ గంధర్వయువతీకదంబ సుస్వరయుక్త తతగీతసంకులంబు
లొకచెంత విద్యాధరకలకంఠీమణీ భాసురతర నాట్యవైభవంబు॥
లొకట లలితచారణవధూప్రకలితంబు
నొక్కక్రేవనుఁ గీర మయూర హంస
శారికా పరభృత నాద సముదయంబు
లమరె నా నగభాగ్య మేమనినుతింతు. 27

గీ॥ అప్పుడచ్చోటు నెడబాసి యరుగుచుండఁ
బసిఁడివీణెలఁ గరపల్లవముల మేళ
వింపుచును గేయవిస్ఫూర్తినింపు సాధ్య
ముదితలనుఁగంటి సముదిత ముదితముగను. 28

క॥ సన్నుతషడ్జస్వరమునుఁ
గిన్నెరలను మేళవించి గేయస్ఫూర్తిం
గిన్నరముదితలు వాడఁగఁ
బన్నగములు వొఱఁజొచ్చె భయమున నొకచోన్. 29

ఉ॥ తొండము లెత్తి ఘీంకృతులు దోరముగా నొనరింప మత్తవే
దండచమూశిరస్థ్సలవిదారితరక్తనఖాంచితంబులై
గండశిలావితానము లెగాదిగఁ జెంగునఁ గ్రేళ్లు దాఁటు వే
దండవిరోధిడింభములఁ దద్దయుఁ గాంచితి నంత నొక్కచోన్. 30

శా॥ ఆలోఁ గొన్ని గుహాప్రదేశముల నత్యానందమగ్నాత్ములై
లీలన్ పేశలపుష్పతల్పముల నాళీకాస్యలం గూడి త
ద్బాలోరోజముఖోపగూహనకృతవ్యాపారపారీణులై
కేళీవిభ్రమలోలులైన సురలం గ్రేఁగంట వీక్షించితిన్. 31

వ॥ అంత. 32

సీ॥ ఏసీమఁ గనుఁగొన్న నింద్రనీలమణీవిరాజిత క్రీడాధరాధరంబు
లే క్రేవఁ గాంచిన నిందుకాంతోపలకూటవిభ్రాజిత కూటదీప్తు

లేచాయదిలకింప నాచారుహీరమయోన్నత లలితగండోపలంబు,
లేవంకబరికింప నావిద్రుమాన్వితానూనతరంబైన సానునిచయ॥
మెలమి నేదారిఁగన రత్నకళికమయము
మఱియు నేయిక్కఁజూచిన మహితపద్మ
రాగమాణిక్యసురుచిర ప్రకటకంద
రాన్వితము లౌర యీరజతాగమునకు. 33

ఉ॥ చూడమెరత్నసానువును జూడమెయానిషధాఖ్యశృంగముం
జూడమెవింధ్యశైలమును జూడమెశీతమహీధ్రరాజముం
జూడమెగంధమాదనముఁ జూడమెసర్వనగంబులన్ భళీ
యీడగునేదలంప నొకయించుకమైనను నిన్నగంబుతోన్. 34

సీ॥ సోమపీథులకిది సురుచిరాస్థానంబు పరమశైవులకిది పట్టుగొమ్మ
బ్రహ్మవేత్తలకిది రాజితంబగుతావు తాపసేంద్రులకిది తావలమ్ము
పరహితార్థులకిదిభాసురంబగుచోటు సత్యసంధులకిది జన్మభూమి
విదితవిరాగులకిదియ నివాసంబు ఘనదాతలకునిది యునికిపట్టు॥
పుణ్యశీలురకిదియపో భూరియిక్క
సుకవివర్యులకిదియపో సుందరమగు
నెలవు సన్మార్గులకునిది వెలయుబ్రాపు
భక్తవర్యులకిదియపో భవ్యగృహము. 35

గీ॥ అనుచుఁ దద్గిరివైభవంబునకుమెచ్చి।
యిందదెద్దియో నరయ సర్వేశునిలయ
మేమియునుదోఁచకున్న దిఁకేమిచేయ
నగు నటంచును గొంతదవ్వరుగ నచట. 36

గీ॥ పృథుల భూధరమునకోడి విశ్రమింప
నెలమి నేగుదెంచిన వెల్లయేనుఁగనఁగఁ
బ్రోగువెట్టిన వెన్నెలప్రోకయనఁగ
వరలుచుండెడు నందికేశ్వరునిఁ గంటి. 37

సీ॥ బాలార్కకోటిప్రభాభాసమానమై సురుచిర దేహరోచులు జెలంగఁ
గమనీయసత్కళాకలితకమ్రకిశోరవిధురేఖ మౌళిపై వెలయుచుండ

సలలిత విపులవక్షస్స్థలంబున నవరత్నహారప్రభ భ్రాజిలంగఁ
బవనభుక్పతికరవిభ్రాజిత యజ్ఞోపవీతవరప్రభ లెల్లుఁగుచుండఁ॥
గరటిముఖమునుఁ జంచలకర్ణములును
వక్రతుండము శోభితపద్మకములు
నేకదంతము సుందరాలోకనములు
గలుగు గణనాథు నొకచోటఁ గంటి నెలమి. 38

గీ॥ అప్పుడవ్విఘ్ననాథున కమితభక్తి
వందనములాచరించి యావలకునరిగి
యొక్కచోటనుభృంగి నింకొక్కచోటఁ
జండికేశ్వరుఁ గనుఁగొని చనఁగఁజనఁగ. 39

సీ॥ పవనభుక్పురత్నభాసుర స్తంభము ల్పవడంపుఁ జేవదూలములు భవ్య
పద్మరాగోపల ద్వారబంధంబులు వైడూర్యవిమల కవాటములును
శక్రనీలమణి ప్రశస్తజాలంబులు బటుహీర భిత్తికాపాళికలును
దగుపుష్యరాగవితాన వితానము ల్మౌక్తిక తోరణమాలికలును॥
వితత చంద్రకాంతోపల వేదికలును
జారు మాణిక్య దీపికాజాలములును
గలిగి దీపించుచుండు నక్కడిహజార
మొకటిఁగనుఁగొని మదిముదమొంది యపుడు. 40

సీ॥ ఈమహీధ్రలలామమేకదా పురవైరి రాజసంబుననుండురాజధాని
యీగిరీంద్రవతంసమేకదా యింద్రాదిబర్హిర్ముఖులకు సభాభవనము
యీశిలోచ్చయరత్నమేకదా ప్రమథగణంబులకెల్ల నానందదాయి
యీనగగ్రామణియేకదా తతభక్తబృందంబులకునెల్ల వీడుపట్టు॥
మఱియు నీభూమిధరరాజమకుటమొకద
పుణ్యవంతులువసియించు బుణ్యలోక
మనుచుఁ దన్మహిమాతిశయమునకలరి
లోనికేగుచుండితి సంతమానితముగ. 41

గీ॥ అచటనిశ్శబ్దముగనుండె నవలఁజనఁగ
యంత్రపాంచాలికా నిచయంబులుండె

వానిచెంగటఁ బుష్పతల్పంబుమీఁదఁ
గామశతకోటి సన్నిభాకారుఁ గంటి. 42

సీ॥ కాఁబోలునీతఁడా కమలాధినాథుండు? గాదుబో శంఖచక్రంబులేవి?
కాఁబోలునీతఁడా కమలసంజాతుండు? గాదుబో హంసప్రకాండమేది?
కాఁబోలునీతఁడునాకవిభుండు?గాదుబోకాయమందునవేయికన్ను లేవి?
కాఁబోలునీతఁడా కమలారి? కాదుబో యతనికక్షీణకళాళిమెచట?॥
ననుచు సంశయాకులచిత్తనగుచు నచట
వెలయుమణిపుత్త్రికాపాళిఁగలిసి నిలిచి
యతనిచందంబు నరయుచున్నంతలోన
నాతఁడిట్లుండెఁ గడిదంపుటార్తిచేత. 43

క॥ ఉసురను దలయూఁచును న
ట్టెసలంగనుఁగొనును బొరలు లేఁచు నడలు హా
కుసుమోపమాంగియను నతఁ
డసమశరామేయసాయకాకుంచితుఁడై. 44

ఉ॥ ఏలనెకోపమూనితి? వదేలనెమూఁడ వీఁకిప్పుడింతవా
దేలనె? మోమువాల్చెదవదేలనె? నన్ననిపల్కరించవే
బేలనె? దెల్ప వేయిపుడు వేగమెయించుకఁగంటివా యదే
చాలును పూలవానలని సంతసమందెద నంబుజాననా. 45

క॥ అలుకా ముద్దులుజిలుకఁగఁ। బలుకాడవు శుక పికాళి పల్కుకేకలు బూ
విలుకానిములికితాఁకులు। ములుకాడినరీతిఁదోఁచె ముద్దులచిలుకా.

వ॥ అనిమఱియు మనోవికారంబున. 47

క॥ తరుణీమణిరోమావళి। వరకుచ కచ జఘనతల విభవము లలఫణా
ధర ధరణీధర ధారా। ధర ధరముల చెలువములను దనరహసించున్.

సీ॥ జలజాతపత్త్రలోచన సుందరాస్యంబు
నిండుచందురు నటుండుండుమనును
బల్లవారుణపాణి భాస్వత్కుచంబులు
మెండుగొండల నటుండుండుమనును

విద్యున్నిభాంగి శోభితమందహాసంబు
పండువెన్నెల నటుండుండుమనును
భ్రమరకుంతల వరవాక్ప్రియం బల కీర
తండంబులను నటుండుండుమనును॥
నువిద కెమ్మోవి కెంపునటుండుమనును
యుగ్మలి గమనము కరి నటుండుమనును
భళిర! గట్టులమెకిమీనివట్టి సొగసు
వలపుపుట్టింపదే యెట్టివారికైన. 49

క॥ అని యొక్కచిత్రపటమును
గొని తనముందరను నిలిపికొని మోహమున
న్మనసిజుసివమెత్తినగతి
నెనర శిరఃకంపనంబు నెగిఁగావించున్. 50

ఉ॥ హాకనకోపమాంగి! కమలాయతపత్త్రవిశాలనేత్ర! రా
కేకలకంఠకంఠి! యిటులేటికినాపయిఁగోపమూనితీ
వ్రూ కలహంసయాన? నెనరొప్పఁదటాలుననవ్వితేనిచాల్
నాకదె పాలవానని మనంబున సంతసమొందుచుండెదన్. 51

గీ॥ అనుచు నార్తిచేఁబరవశుఁడగుచు మిగులఁ
బొగులుటయును హా రతిచేతి ముద్దుచిలుక!
హానగాత్మజ! యనుటయు నరయ శివుఁడె
నెనరశృంగారమగురూపమూనెనేమొ॥ 52

చ॥ అనుచు నిదాఘకాలముననార్తిఁగలంగుచునున్న కేకి యా
ఘనతరవార్షికాంబుధరగర్జితమున్విని బొంగురీతి నా
మనమునవామహామహానిమంజులవాక్కులకుబ్బి యుబ్బి యా
తనిపయిఁ దారహారము క్రమతంబుఁగనుంచితి వేడ్కతోడుతన్. 53

వ॥ అని గౌరింగని. 54

చ॥ స్మరపరితాపవేదనవశంబునఁ గ్రాగుచునున్నయట్టి నీ
వరకుచవాటిమధ్యమునవర్తిలుచున్నకతంబునం గజా

సురరిపుకంఠపీఠినిడఁ జుట్టుమటంచునుసోఁక నంతలో
హారుఁడుబిత్తానలేచి మణిహారముఁగాంచి మహాద్భుతంబునన్, 55

క॥ ఎక్కడిమౌక్తికహారం। బిక్కడికేరీతివచ్చె నేజవ్వనిదో
నిక్కంబు దెలియకున్నది। చక్కఁగనెఱుఁగవలె దీనిచందంబెల్లన్. 56

క॥ ఈదామముఁగన్నంతనె। మోదంబద్భుతము నధిక మోహము మదిలో
మేదురమయ్యెను మనసిజ। ఖేదంబడఁగె నిపుడు కృతకృత్యుఁడనైతిన్.

క॥ మునుపొకమారీదామముఁ। గనినట్లుగఁదోఁచెనెచటఁగనుఁగొంటినొగా
నినిజంబు దెలియకున్నది। యనిసంశయపడుచుఁదారహారముగనుచున్.

సీ॥ ఒకమారు కంఠపీఠికయందుధరియించు
నొకమాఱు కరముననొనరఁదాల్చు
నొకమాఱు కనుదోయినొప్పఁగాఁగదియించు
నొకమాఱురంబుననుంచునెలమి
నొకమాఱు నిజకళాచికలోననిడికొను
నొకమాఱు మీఁదికినొనరఁదీయు
నొకమాఱు తనువెల్లనొగిఁజేర్చుచుండు నిం
కొకమాఱు ముద్దుఁబెట్టుకొనుప్రీతి॥
నింక నొక్కమాఱు నంకంబునందిడు
నొక్కమాఱుగాంచు నొక్కమాఱు
దామవంశతిలకసేమమాయని మాటి
మాటికడుగుచుండు బోటులార. 59

ఆ-వె॥ ఇవ్విధమున నాతఁడెలమిచే మౌక్తిక
హారమా! రమాకుమార ఘోర
దుఃఖవార్ధిలోనఁదొడిబడు నాకొక్క
తెప్పవైతి నిన్నునుతింపఁదరమె?. 60

ఉ॥ ఎక్కడనుండుదాన విపుడిక్కడికెవ్వరునిన్ను దెచ్చి రే
జక్కవగుబ్బలాడి సరసంబున నీదనచన్నుదోయిపై
మక్కువమీఱఁదాల్చునె సమాహితమొప్పఁగఁ దానిమాని నీ
విక్కడికేగుదెంచుకతమేమొ నెఱుంగఁగ వేగఁజెప్పుమా. 61

వ॥ అని మదనోన్మాదంబునఁ బల్కుచు దెలివొంది. 62

ఆ—వె॥ తెలిసెనిప్పు డౌర! దీనినింతకుమున్నె
గంటి నెలమి గౌరికంతమందు
ననుచుఁ జిత్రపటమునందున్న దామముఁ
గాంచు చదియెనిజమటంచు నెంచు. 63

ఉ॥ సేమ మెసర్వమంగళకు సేమ మెతప్ప్రియురాండ్ర కెల్ల నో
దామకులాగ్రణీ ద్రుతగతంబుగఁదెల్పుము నాడునెచ్చెలుల్
భామినిఁదోడుకొంచును నివాసము జేరిరి గౌరి యిప్పుడా
కాముని శాతచూతశరకంపితయై వడిగుండెలెండఁగాఁ, 64

క॥ నేనెంత వేడికొన్నను। మానితముగవినక చెలులమాటలువిని యా
సూనాంబక ధాటికిఁ గడు। లోనై యడలదె సరోజలోచన జెపుమా?.

గీ॥ అనుచు గడిదంపుటార్తిచే నంగజాత
శాతచూతాస్త్రనిర్ఘాతయాతనావి
ధూతచేతోంబుజాతుఁడై యాతఁడుండఁ
బ్రీతినిట్లంటి నాభూతనేతకపుడు. 66

చ॥ అకటమహేశ! నీవునుసుమాంబకధాటికిఁగుందెదేల? మా
వికచపయోజలోచన పవిత్రచరిత్రహిమాద్రిపట్టి మా
నికపువిభూషణంబులనునెమ్మిధరింపదు తాల్మివీడి ని
ప్పుకలని పాన్పుక్రొవ్విరులమట్టదుసుమ్ము వియోగవేదనన్. 67

ఉ॥ ఏమని దెల్పుదాననుమహేశ్వర చేడియచంద మెల్ల; నో
భామిని! దేవదేవునిజవంబునఁ దోడ్కొని రమ్మటంచు మా
కామిని దెల్ప వచ్చితినిఁ గార్యవశంబున నింతియచ్చటం
గామ దురాపతాపహతిఁ గ్రాగుచు నుండెనిఁకేమియయ్యెనో. 68

క॥ ఇక్కడ నీవును మాచెలి। యక్కడ విరహార్తిచేతనడలెదరేలా?
నిక్కమ్ముగ నిప్పుడు నీ। వక్కడికరుదేర శుభములగునీకనుచున్.

గీ॥ మిన్న కుండితినంత నావన్నెకాఁడు। దిక్కులన్నియుఁ బరికించియక్కజముగ
నెచ్చటనునన్నుగానక యేమిచిత్ర। మనుచుఁగళవళమ్మందుచునంతలోన

చ॥ రతిపతిపుష్పభల్లనికరంబులపాల్పడి పెంపుఁదక్కి సం
తతవిరహార్తిచేతఁగడుదాలిమిఁ బ్రీలుచునున్న నాకుఁ బ
ర్వతసుతవార్తఁ దెల్పుచు సుపాణిసరంబునుగాన్కదెచ్చి యుం
చితముగఁ బ్రాణదానమును జేసినపుణ్యవరేణ్యులెవ్వరో?. 71

గీ॥ తెలియకున్నది నావెతదివ్యవాణి
గాంచి యీశుభవార్తను గడుముదమునఁ
దెలిపెనో లేక పార్వతిచెలులలోన
నొకతెయే తెంచి దెల్పెనో ప్రకటముగను. 72

గీ॥ అనుచు సందేహమానసుండగుచు నెల్ల
దిశలుఁ బరికించి రత్నపుత్త్రికలుమాత్ర
ముండెనిచ్చోట నిందున నువిదయొకతె
గలసెఁగాఁబోలు నాకది తెలియకుండ. 73

మ॥ అరయంగావలెనంచు శంభుఁడు మహాహ్లాదంబునన్ బొడఁ ద
త్స్వరసాంకర్యవిహీనతం దెలుపు భాస్వద్యంత్రపాంచాలిక
ల్వారుసన్నృత్యములాడఁజొచ్చె నపుడాభవ్యుండుఁ దత్తన్మణీ
వరపాంచాలికలంగనుంగొనుచు వే వచ్చెన్ననుండాయఁగాన్. 74

గీ॥ అపుడునృత్యముఁ జేయలేనైతినేను । నన్నుఁగన్గొని యాతఁడానందజలధి
నోలలాడుచు నిట్లనె మేలిపుణ్య! వతిరో! నాపాలిభాగ్యదేవతవె నీవు?.

క॥ ఆహా నినుగన్నంతనె। మోహం బద్భుతము నధికమోదం బొదవెం
దేహముపులకించెనపర।మోహినివనుభ్రాంతివ్రెడమెముదితరో నాకున్.

సీ॥ అనవిని దృఢనిశ్చితాత్మనై యతనికిఁ జెలఁగుచుజోహారుజేసి నిలిచి
యవధారుదేవ మహాదేవ సర్వేశ యఖిలైకమాన్య హిమాద్రితనయ
రుచిరాస్యహాసితసరోజారి మధురవచోరమ్యనిర్జితకీరి గౌరి
య్యామెనెచ్చెలులలో నధికురాలను నేను కలవాణియని నన్నుఁబిలుతు
వారలిప్పుడు మాచెలి "ఘోరమార [రెల్ల॥
సాయకాగ్నిస్ఫులింగదోధూయమాన
మానసాంభోజయగుచు" సమాహితముగ
నిన్నుదోడ్కొనిరమ్మని నన్ను బనుప. 77

క॥ పురములు గ్రామంబులునున్
వరపట్టణములును నదులుఁ బల్లెలును మహా
గిరులుఁ గనుగొనుచు నిటనీ
గిరీంద్రమునుఁగంటిఁ బూర్వకృతపుణ్యమునన్. 78

గీ॥ సంతసంబున నిచ్చటివింతలెల్లఁ
గనుచు నిటుపేద పెన్నిధిఁగాంచినట్లు
నీకుపదపద్మములుగంటినెమ్మితోడ
వినుము మాచెలిచందంబువిన్నవింతు. 79

క॥ వనితలతో మాట్లాడదు
ఘనముగ డెందమున వేడుక "శివాయనమో"
యనుచున్ 'ద్వమేవగతి'యను
కొనుచున్ దనలోననేమొ గొణుగుచునుండున్. 80

ఉ॥ పూనదుమేన మానికపుభూషణము ల్విరహార్తిఁగుందుట
ల్మానదు తావకీయమహిమంబులునెచ్చెలులెల్లఁదెల్ప నా
నౌనని రాజశేఖరున కారయనంచితమైన పద్మినీ
మానవతీవిలాసగరిమంబులు నెమ్మదికింపుపుట్టునే. 81

గీ॥ అనుచుఁగన్నీరునింపుచు నార్తితోడ
కనలి గిరిశునిహృదయంబు గఱఁగుటెపుడొ
తండ్రి ధైర్యంబు నొకయింత తనయనయ్యు
బోలనైతిని చెలులార! బేలనైతి. 82

గీ॥ అనుచుగడిదంపుటార్తిచే నంతకంత
కొనరఁగొడవలుబడుచుండు నువిదయిపుడు
నీవుసర్వజ్ఞుఁడవు నీకు నేను దెలుప
వలయు విషయంబులుండునే? వామదేవ! 83

వ॥ అనిపలికినపలుకుల కులికిపడి సర్వేశ్వరుండిట్లనియె. 84

శా॥ ఏమేమీ! తుహినాద్రిరాట్తనయయేయిట్లాడినిన్నంపెనా?
నామీఁదంజకితైణనేత్ర కెదలోనంగూర్మివాటిల్లెనా?

ప్రేమందత్ప్రియకాంతలీపనికి నిర్విఘ్నంబుఁగావింతురా?
భామా! భామినివార్తఁదెల్పితివిచాల్యభవ్యప్రదంబయ్యెడుఁ. 85

గీ॥ గిరులెకతినంబులందును వరగిరీశుఁ
డరయఁగాఁతిన్యేఁడగుఁగదా? యట్టివానిఁ
జూపులనేధృతిఁబాపి యుష్ణూపులూచు
వార లెంతటివారో యువతి యెఱుఁగవె?. 86

వ॥ అనిననివ్వెఱఁజెంది లేనిబీరంబున నిట్లంటి. 87

గీ॥ ఆకమలముఖితోఁ బొత్తు లేకయున్న
నిబిడమాకానఁగాయు వెన్నెలవిధముగ
నీదుసౌందర్యవిభవంబు నిష్ఫలమగు
ననినఁ జిఱునవ్వుచూపుతో నాతఁడనియె. 88

క॥ మనసిజుఁడతిసాహసుఁడా! తనినెచ్చెలి సత్ప్రికాశతతినడఁచుచు రా
త్రినిసంచరించువాఁ డిం! కను విరహాంబోర్వఁజాలఁ గలుపుముకలికీ.

ఉ॥ చూడమె దేవకామినులఁ జూడమెసిద్ధపయోరుహాక్షులం
జూడమెకిన్నరాంగనలఁ జూడమెసాధ్యమృణాళబాహలం
జూడమెమర్త్యభామినులఁ జూడమెపన్నగకన్యలఁ భళీ!
యీడగునేదలంప నొకయించుకయైనను గౌరికారయఁ?. 90

గీ॥ అనిన సమ్మోదముననిటులంటి నేను
దెలియరానిదియున్నదే, దేవ! నీకు
నిపుడు నీవచ్చుటికివచ్చెదేని తత్ప్ర
ణంబ కొఱలేక సకలశుభంబులొదవు. 91

గీ॥ కానఁ గుసుమాస్త్రిఘాటి కగ్గలముగాఁగ
నప్పగించెదవో లేక యొప్పిదంబు
తోడఁ బ్రోచెదవో పువ్వఁబోఁడి నింక
మీఁద నాభారమెల్లను నీదెసుమ్ము. 92

ఉ॥ నా విని యాతఁడిట్లనియె నాతిరో! నీవునుఁజూచి తేగదా
భావజశాతమాతసుమభల్లసమాజఘుధాతకోర్వ కెం

తే వనటందపించుటలు దేటగ నెమ్మదిలోననమ్ము నా
కేవిధమైనసందియము లెన్నఁగ లేవు వరింతునద్రిజన్. 93

గీ॥ నీవు బలుప్రోడవెన్నంగ నోయొయారి!
నీదువాక్యంబులకు నెద నెనరువుట్టెఁ
గాని పార్వతి గురుజనాధీన గాన
సందియముదోఁచుచున్నది డెందమునకు. 94

గీ॥ అయినఁగానిమ్ము రేపు నిశ్చయముగాఁగఁ
రాయబారుల దుహినాద్రిరాజుకడకుఁ
బంపి పాణిగ్రహణమును పొందిమీర
నిర్ణయించెదగాకనె నెమ్మితోడ. 95

క॥ కావున నీశుభవార్తను । మీావనితారత్నమునకు మేలిమితోడ
న్వేవేగఁ దెలుపఁ బొమ్మా! భావజుధాకల కదెంత భయపడును మదిన్.

క॥ నావిని యిట్లంటిని యో । భావజదర్పాపహర! పార్వతి మదిలో
నా వాక్యములనునమ్మక! పూవిలుతునిధాటి కెంతఁబొగులును భీతిన్.

క॥ ఆపలుకునువిని చంద్రక । లాపుఁడు నెయ్యమున నిజకళాచికలోనం
దీపించెడు రత్నకులక । లాపము నొకదానిఁదీసి లలినిట్లనియెన్. 98

మ॥ ఇదిచింతామణి రత్నరాజ మలదేవేంద్రుండునాకిచ్చెన
మ్మున మొప్పారఁగమున్న దీనిమహిమంబుల్దెల్పఁగాశక్యమే
యిది యెవ్వారలచెంతవర్తిలును వారేవేళ నేకోరికె
ల్మదినూహింతురో వారికాఫలము సంప్రాప్తించు శీఘ్రంబునన్. 99

క॥ ఈరత్నము రుచివిజితన । భోరత్నము దీనిమహిమఁబొగడఁదరమె బ్ర
హ్మారగవిభులకయినయో।పారత్న ముగాననుమకొసంగఁదలఁచితిన్.

మ॥ అని నాచేతికొసంగ నంతటను నత్యానందమగ్నాత్మనై
చు "నమోయోగినుతాయ విశ్వగురవే సోమావతంసాయ" యం
చును సద్భక్తిదురంగలింపఁ గరముల్జోడించి నిల్వంగన
న్గని దీనిం దుహినాద్రిరాట్సుతకు వేగంబిమ్ము బొమ్మీవనన్. 101

క॥ ఇచ్చోటికి నేవచ్చితిఁ । జెచ్చెర శివుఁడిచ్చినట్టి చింతామణినిం
దెచ్చితి దీనింగొనుమో। నెచ్చెలి! యనుచుఁగలవాణి నెమ్మినొసఁగినన్.

క॥ అంతటఁ జింతామణిఁ గ। న్నంతనె వనటలుదొలంగె నగజాత్మజ క
త్యంతముదంబొదవెనునా। ద్యంతముఁగలవాణిచరితమంతయుఁ దెలుపన్.

సీ॥ అంతఁగొందఱుచెలు లత్యంతనంబున హిమవంతునిదరికేగి సంతసమున
విరహార్తిచే గౌరి వెఱపొందులయు నంతఁజెలులెల్ల బోధింప శివునిచంద
మరయంగఁగలవాణియను చెలిచేఁదారహారంబునూడిదయంపుటయును
నదిగొని శంకరుండతిమోదమును జెంది తగినవారలను భూధరుని వేఁడి॥

రమణినడుగంగ రాయబారంబుకొఱకుఁ
బంపుదును రేపటంచును బలికి కలికి
కొక్క చింతామణీరత్న మొసఁగుటయును
దెలుప ముదమూన నలరెఁబృథ్వీధరుండు. 104

వ॥ అంత. 105

గీ॥ చదలునందునఁ జనిచని చంద్రుఁడొప్పె
నపరగిరికడ ముదిమిరాయంచపగిదిఁ
దల్లినరసెడు హంసపోతంబు కరణి
వెలుఁగుచునుదోఁచెఁ బొలికడ వేఁగుజుక్క. 106

గీ॥ ఖగకులంబులుగూసెఁ జీఁకటులువాసెఁ
గులటలకుభీతిగలిఁగె వెన్నెలలుదొలఁగెఁ
గలువలుముడింగె నీరజములు జెలంగె
దిక్కులలరారె నంతటఁ దెల్ల వారె. 107

వ॥ అంత నా నగాధినాథ పుత్త్రియు భయసంభ్రమాక్రాంత స్వాంతయై
యుండి. 108

గీ॥ ఒనరఁ జెలులెల్లఁ గైదండలొసఁగఁ బువ్వుల
పాన్పుడిగి మెల్లమెల్లనఁ బదములిడుచుఁ
జెలువ దివసాద్యకృత్యంబు లెలమిఁదీర్చి
కొనుచుగురువును మనమునఁగొలుచుచుండె. 109

వ॥ అనివిజ్ఞాపించిన సంతుష్టాంతరంగుండై ధర్మనందనుం డటమీఁది వృత్తాంతం బెటిఁగింపుమని మార్కండేయు నడుగుటయును. 110

క॥ పారావారగభీరా। చారుయశోవార విమలజగదాధారా
మేరునగధీర సారా। చార శుభాకార దీనజనమందారా. 111

మ॥ అజ జంభారిముఖాఖిలామరచకోరౌఘస్ఫురత్పూర్ణిమా
ద్విజరాడ్బింబ దయావలంబ మునిహృత్పంకేజ లోలంబ స
ద్విజదోషాచలశంబ సద్గుణకదంబ ప్రోల్లసద్భూరి భ
క్తజనప్రాంచితచాతకప్రకరసత్కాదంబినీడంబరా. 112

సుగంధివృత్తము॥ వాలి ధాతుసప్తకంబు బాహువీర్యమొప్ప నీ
లీలఁ ద్రుంతుఁ జూడుఁడంచు లేచి యొక్కకోలచేఁ
దాలసప్తకంబుఁ ద్రుంచి తత్క్షణంబ తమ్మిరా
చూలిభీతి మాన్పినట్టి సూరిలోక పాలనా. 113

గద్యము॥ ఇది శ్రీపరమేశ్వర కరుణాకటాక్ష సమాసాదిత సహజపాండిత్య
సరసకవితాధురంధర ఘనయశోబంధు రాపస్తంబసూత్ర
భారద్వాజగోత్ర పేరూరుద్రావిడ శ్రోత్రియ
బ్రాహ్మణార్య సోమయాజి కులజలధిజైవాతృ
కారుణాచలేశ్వర తనయ నయగుణవిధేయ
లక్ష్మీనారాయణనామధేయ ప్రణీతంబైన
శివకథా సుధారసంబను మహా
ప్ర బం ధం బు నం దుఁ
చతుర్థాశ్వాసము.



శ్రీకృష్ణార్పణమస్తు.

శ్రీరస్తు

శ్రీరామాయనమః.

శ్రీమహాగణాధిపతయేనమః.

శ్రీ శా ర దాం బా యై న మః.

# శి వ క థా సు ధా ర స ము.

## పం చ మా శ్వా స ము.



మిత్రకులపయోనిధి। సోమా దశరథతనూజ శోభితనామా
కామారినుతచరిత సు। త్రామార్చితపదసరోజ రవినిభ తేజా.

వ॥ దేవా యవధరింపుము మార్కండేయమహామునీంద్రుండు ధర్మనందనున కంటమీఁదివృత్తాంతం బిట్లనియె నట్లుబరిభాతసమయంబగుటయును మహాదేవుండు గాల్యకరణీయంబులు నిర్వర్తించి మహానందపయోధితరంగమాలికాడోలికలఁ గేళికాకలన రాగిలుహృదయారవిందంబు గలవాఁడై యుండ నచ్చెరువ మెలంగు భృంగి యాతని కిట్లనియె. 2

ఆ-వె॥ బాలశశికలాప పంచాక్షరీరూప। మానిహృదయలోల దీనపాల
నీవు చందమరయ నేఁడొకవింతగాఁ।గానుపించెశుభముగలుగునట్లు.

ఆ-వె॥ అనఁగ నిట్టులనియె నభవుండు, భృంగీశ!
గడచినట్టిరేయి గౌరిచంద
మెలమిగదుర నాకుఁ దెలియఁజెప్పెను గల
వాణి యనఁగ నొప్ప పంకజాక్షి. 4

ఆ-వె॥ భృంగి! వినుము పెండ్లిపెద్దల రావించి
గట్లజేనిదరికిఁ గన్య నడుగ
నిపుడరాయబార మెలమితోఁబంపంగఁ
దలఁచినాఁడసుమ్ము సలలితముగ. 5

గీ॥ నీతి నిపుణత బుద్ధియు నిర్మలతయు। సంపదయుబలమును గల సత్యశీలు
రైనవారలు గావలె ననిరిబుధులు।వరవివాహమునకురాయబారమరుగ.

క॥ దివిలో భువిలో పన్నగ। భువనములో వినుతిగను తపోమహితులు స
త్యవహో నిరతాత్మకులును। రవి తేజులు సప్తఋషులు బ్రాహ్మణ వర్యుల్.

వ॥ కావున నీరాయబారంబున కానిరాబారుల రావించెదనని నిశ్చయించి.

ఆ-వె॥ భక్తవత్సలుండుఁ బాపవిభంజనుఁ
డప్రమేయుఁ డమలుఁ డమరవినుతుఁ
డమితమైన కుతుక మంతంత కుప్పొంగ
స్వాంతమందుఁ దలఁచె సప్తఋషుల. 9

వ॥ అయ్యవసరంబున. 10

సీ॥ నాకధునీజల స్నానంబుఁగావించి రమ్య భూతిత్రిపుండ్రములు దాల్చి
వల్కలంబులుగట్టి వ్యాఘ్రాజినంబులపైని దర్భాసనాసీను లగుచు
రుద్రాక్షసరములఱుతదర్భహస్తముద్రికలుఁ వ్రేళ్లనుమౌంజియుఁగటినలర
మహనీయదండకమండలువులు గ్రాల నాహ్నికంబులుదీర్చునంతలోన॥
దేవదేవుండు శంభుండు దీనపాలుఁ
డమరలోకేశ వినుత పదాంబుజుండు
సర్వలోకేశ్వరుఁడు మది సంస్మరింప
సంభ్రమాయత్త చిత్తులై సప్త ఋషులు. 11

గీ॥ ఇవ్విధంబునఁ దలఁచుట కెద్దియేని
యవసరం బుండనోపు నటంచు నతని
భూరినిర్హేతుక కటాక్షమునకు సంత
సించి గమనోన్ముఖులయిరి శీఘ్రమునను. 12

వ॥ వారిలోన. 13

క॥ నైష్ఠికుఁడునుఁ శిష్టుండు వ। రిష్ఠుఁడు మహనీయగుణ గరిష్ఠుండు సుర
జ్యేష్ఠసమానుండు ఋషి। శ్రేష్ఠుఁడుఁ గరిష్ఠుఁడగు వసిష్ఠుం డంతన్.

వ॥ తనధర్మపత్నియగు నరుంధతి కిట్లనియె. 15

ఉ॥ ఓతరలాయతాక్షి సుగుణోదధి వింటె సమస్తనిర్జర
వ్రాత నమస్కృతాంఘ్రిశతపత్త్రుఁడు భూతగణేశుఁడుం జగ
త్పూతచరిత్రుఁ డీశ్వరుఁడు భూరికృపామతి సంస్మరించె మ
మ్మాతతభక్తితోఁ జనెద మచ్చటి కీవును వచ్చెదే యనన్. 16

ఉ॥ ఆతరుణీలలామ హృదయాంబుజమందున భర్తృపాద కం
జాతయుగంబు నిల్పికొని సారెకు నాతని సంస్మరింపుచుం
బ్రీతిజనింప నిట్లనియె విశ్వగురుం గనుఁగొంటకన్న వి
ఖ్యాతశుభం బదెయ్యది మహాత్మ ముదంబున వచ్చెదం జుఁడీ. 17

వ॥ అనవిని సంతుష్టాంతరంగుండయ్యె నంత మహాదేవుని దర్శించుటకై
ప్రముదితహృదయారవిందులై యందఱుఁ దక్షిణంబ. 18

సీ॥ కనకవల్కలములు గట్టి ముక్తాఫల
యజ్ఞోపవీతంబు లమరఁజేసి
రమ్య రత్నాక్షసూత్రంబుల ధరియించి
యాశ్రిత సురభూరుహముల రీతి।
నలరి వచ్చుచునుండ నంబరవీథి ల
సత్కేతనము డించి స్యందనంబు
నిలిపి సూర్యుఁడు గరములుమోడ్చి మ్రొక్కినఁ
గని గనన్ట్లు వేగమున నవని॥
కేగుదెంచుచునున్న వారెలమినిఁ బ్రళ
యాంతమందు వరాహదంష్ట్రాగ్రమునను
విశ్రమించెడువారునై విమలభక్తి
శక్తిఁ బొడగాననవచ్చుచు సప్తఋషులు. 19

క॥ వాసిగఁగనిరెదుర ననా
భాసమ్ము సుమచాపజిష్ణువాసముఁ గుజన
త్రాసము యోగీంద్రమనో
ల్లాసము గైలాసమును విలాసమున ఋషుల్. 20

క॥ అఁటఁజని సర్వజ్ఞుండగు
నిటలాక్షుని విమల పాదనీరజములకున్

నిటలతట ఘటిత కరసం
పుటులై సాష్టాంగముగను మ్రొక్కుచుఁ బ్రీతిఁ. 21

వ॥ ఇట్లని వినుతించిరి. 22

సీ॥ భక్త శరణ్యాయ పాలిత పుణ్యాయ దివిజాగ్రగణ్యాయ తే నమోస్తు
వరమృగోద్ధరణాయ పన్నగాభరణాయ త్రిపురసంహరణాయ తే నమోస్తు
గంగోత్తమాంగాయ కరుణాంతరంగాయ దీనార్తిభంగాయ తే నమోస్తు
పాతకతదోషాయ చతురసద్భాషాయ జ్ఞానసువేషాయ తే నమోస్తు॥
మానినందన పాలాయ తే నమోస్తు
సూనసాయక కాలాయ తే నమోస్తు
మానితాశానుచేలాయ తే నమోస్తు
దివ్యసద్గుణ శీలాయ తే నమోస్తు. 23

సీ॥ హస్తిదైతేయ జీవానిలాహీంద్రాయ
పాలితేంద్రాయ తుభ్య న్నమోస్తు
విలయకాలాభీల హాలహాలాహారాయ
భవ విదూరాయ తుభ్య న్నమోస్తు
సకల నిర్జరనుత సద్గుణజాలాయ
భక్తలోలాయ తుభ్య న్నమోస్తు
లలితామృతాంశు కళా కిరీటాయ ప
శ్యల్లలాటాయ తుభ్య న్నమోస్తు॥
పటుతరరసారథాయ తుభ్య న్నమోస్తు
హాటకాద్రిచాపాయ తుభ్య న్నమోస్తు
పంకజాక్షరోపాయ తుభ్య న్నమోస్తు
ప్రబలపురసూదనాయ తుభ్య న్నమోస్తు. 24

వ॥ అని యివ్విధంబున నుతించుచున్న ఋషీంద్రుల నతిగౌరవంబున సమ్మానించి యుచితాసనంబులఁ గూర్చుండఁబెట్టిన శంకరునకు నమస్కరించి మఱియును. 25

గీ॥ ఎలమి నేవేదములఁ బఠియించినాము
ప్రియత నేహోమములఁ నగ్ని వ్రేల్చినాము

వేడ్క నేతపంబులను గావించినాము
వానిఫల మిప్పుడే మాకుఁ బ్రాప్తమయ్యె. 26

క॥ ఇరవుగ నీ మాదృగ్గో।చరమగు రూపంబు సృష్టి సల్పెడిదో లే
కరయఁగఁ బోషించెడిదో।హరియించెడిదో నెఱుఁగమయ్య మహేశా॥

గీ॥ మీరు మమ్ముస్మరించిన కారణమునఁ
గడుముదంబున మిము క్షేమ గనుటవలన
మిహిరకర సూర్య పదవులమీఁది పదవి
నుంటిమనుటకు నయ్యె మా కుపబలంబు. 28

గీ॥ అవని నెల్లవారలు హృదయాంబుజముల
ధ్యాన మొనరించినం గానరాని మీరు
మమ్ము నెదఁదలంచిన యంతమాత్రమునను
నఖిలజగముల శ్రేష్ఠుల మైతి మభవ. 29

క॥ ఈవడువున మముయుష్మ।ద్భావమున దలంచుటకుఁగతంబెయ్యదియో
దేవ! భవద్దర్శనమున।మావృజినౌఘంబు దొలఁగె మాన్యతగలిగెన్,

గీ॥ ఈశ! మాప్రార్థనంబులకేమి వాని
నవలనిడి మీమనంబున నహరహంబుఁ
జింతనముసేయు గార్యంబుఁ జెప్పి మాకు
సెలవొసంగిన వేడ్కతోఁ జేయఁగలము. 31

క॥ అనియిట్లుమునులువల్కఁగ। వినిరదనాంశువులుమాలి వెలయుబాలచం
ద్రునికాంతివృద్ధిఁజేయఁగ। ననియెన్ లే నగవుతోడ నభవుండంతన్.

గీ॥ తెలియకుండునె యేప్రవృత్తులును మాకుఁ
గలుఁగకుండు నటన్న వాక్యంబు మీకు?
నైన! మా యష్టమూర్తులలోన నొక్క
మూర్తిచేఁ గార్యసూచనఁ బూనవలసె. 33

ఆ-వె॥ శత్రుపీడఁబడిన సర్వసుపర్వులు। నన్ను జేరి యాచనమ్ము జేసి
రొక్కసుతునికొఱకు నొనరెడుదృష్టిచేఁ।దనరుచాతకములుఘనునిఁబోలె.

ఆ-వె॥ హవ్యభుక్కుకొఱకు యజమానుఁ డరణినిఁ
బోలె నందనుండు వ్రేడముటకయి
భూధరాధినాథ పుత్త్రికై నేనిప్పు
డిచ్చగించుచుంటి నెలమితోడ. 35

క॥ నాకై హిమవంతుఁడు గా। రీకన్యక నడుఁగఁబడుట బ్రియమగుమీచే
లోకోత్కృష్టానుష్ఠిత । మా కార్యములకు వికల్పమగునే? దలఁపక.

గీ॥ ఉన్నతుండును స్థితిమంతుఁ డుర్వీభార
మును భరించెడువాఁడునై దనరు గట్ల
తేనితోడను సంబంధమైనయెడల
నది సుయోగ్యంబటంచును మదిఁ దలంతు. 37

గీ॥ ఎలమి నాఁ దెల్పు గార్యంబునిదియ: జగతి
నెల్ల సత్పురుషులును మీవల్లఁ దెలుపఁ
బడిన యాచారములరీతి నడుచుచుంద్రు
గాన మీ కిఁకఁ దెలుపు సంగతులు గలవె?. 38

గీ॥ తలఁప నార్యయా నీ యరుంధతియు నీ సు
కార్యనిర్వాహమునకుఁగాఁ గర్త్రియగుట
మిగుల లెస్సయా; సతులకు జగతినిట్టి
కార్యములలోన నిపుణత గలుగుఁగాన. 39

వ॥ అనిపల్కు సమయంబున. 40

గీ॥ మునిసమూహంబులోపల మొట్టమొదటి
వాఁడగు భవుండె యీరీతి భార్యకొఱకు
నాసఁబడ ఋషులకువీడె నపుడెఁ దాము
నరయఁగ సతీయుతులమైతి మన్న లజ్జ. 41

ఆ-వె॥ అంతలోన శంభుఁ డంతర్హితుఁడు గాఁగ
బ్రతిజనంబు విష్ణుపదము నంటి
దృఢతనరిగి యోషధీప్రస్థపురమును
గనిరి నిముసమునను గడు ముదమ్మున. 42

సీ॥ రుచిరాబ్జరాగగారుత్మతకల్పితఘననూపురకృతాలకాపురంబు
శక్రనీలోపలసంఘవిరాజితగురుకాంచికాకృతగోపురంబు
వజ్రవైడూర్యవిభాసురుచిరగళాభరణకృతాబ్జసంభవపురంబు
మరకతమౌక్తిక మహితనాసాభరణకృతమానితరమా నాథపురము॥
నగుచుఁ దత్పురలక్ష్మి మహావిచిత్ర
రత్నగోపురాకారత రమ్యమగుచు
నితరపురములనగుచునియ్యిలను వెలసె
బాపురేయనిజనులెల్లఁ బ్రస్తుతింప. 43

గీ॥ మహిత కమలానురాగ సమ్మానితంబు
నమిత శుచియుక్త రాజహంసాశ్రయంబు
ననిమిష వ్యాప్తమానంబు నగుచుఁ దత్పు
రంబు దనరారుఁ గమలాకరంబు వ్రాలె. 44

క॥ వర మణిఘటిత గృహావళు।లురు నిశలనుఁదోఁపనీఁకనుండుఁగనుకఁ ద
త్పురి వానికొదవెనాఖ్యలు। వరుస నిశాంతంబులనఁగఁ బ్రస్ఫుటఫణితిన్.

సీ॥ రాజ మార్గమువ్రాలె రాజమార్గంబులు
రాజహంస ప్రచారమునఁ దనరుఁ
గమలా కరమువ్రాలెఁ గమలాకరంబులు
గమలాంచితంబులై కడు వెలుంగు
ఘన వనంబునుబోలె ఘనవనంబులు బ్రీతి
నాశ్రిత ద్విజజాత మగుచు వరలు
నమరాలయము వ్రాలె నమరాలయంబులు
శృంగార దీప్తిచేఁ జెలఁగుచుండు॥
దానవారిఁ బోలె దానవారియును సా
రంగ రక్షచే వెలుంగు చుండు
నప్పురంబునందు నొప్పారు విభవంబు
లెంచఁదరమె యల విరించికైన. 46

మ॥ వర జాంబూనద హర్మ్య సంఘటిత భాస్వద్రత్నసంఘాత దీ
ప్తరుచు ల్దత్పురి రేఁ బవల్లఁ దొలఁగింపంజేయు శీతాంశు భా

స్ఫార దీప్తుల్ గనరామిఁ జారులు సతీ కాలానుగుణ్యంబులౌ
స్వర సంగీతసురాగ గానములచే సాధింతు రక్కాలమున్. 47

గీ॥ అమిత సత్కవిసంఘ సమాశ్రయమయి
రాజ గురు బుధ మిత్ర వర్గమ్ములు దన
లోనఁ బ్రతిబింబమిషమునఁ గానిపింపఁ
బరిఖ నృపసభాస్థానంబు కరణి నొప్పు. 48

గీ॥ పరిఖయను కాసెఁగట్టి తత్పురవరంబు
మేటి రణశూరుఁడునుబోలె మెఱయుచుండ
నహిపురంబులు భీతిచే నడుగఁ బట్టె
రాత్రులఁజరింతు రల పరరాజ చరులు. 49

గీ॥ కరమునందున శతకోటిఁ గలుగుమేటి
యేటి ధనవంతుఁడని వాని నీసడించి
దనరుచుందురు జారులు దత్పురమునఁ
గరములను శంఖ పద్మము ల్గలుగుకతన. 50

ఉ॥ బాలిక లప్పురిం గలుగు బంగరుమేడలనెక్కి వీణెలన్
మేలుగ మేళవింపవిని మెల్లన నచ్చరమచ్చికంటు ల
వ్వేళలఁ జాలరంధ్రములవెన్కను నిల్పడి తొంగిచూతు ర
త్తాళ లయ గ్రహంబులను దాము గ్రహింపఁదలంచుచు న్వెసన్. 51

మ॥ పురి నాట్యాంగణపాళి నంబుజముఖు ల్మోదంబుచే దుందుభు
ల్వరుసన్ మ్రోయఁగఁజేయఁగా నది ఘనధ్వానౌఘవిభ్రాంతిచేఁ
బురులన్విప్పుచు దృష్టిపాత్రమగుచున్ బొల్పొందు కేకు ల్నట
త్తరుణీవర్గముకన్న మున్నుగను నృత్యంబు ల్వడిన్సల్పెడిన్. 52

ఉ॥ అన్నులమిన్న లప్పురిని హర్మ్యతలాగ్రములందు గుంపులై
వెన్నెలకుప్ప లాడఁగను వేడుక దొంగగుచేడె రోయుచో
వెన్నెలకందుఁగాంచి చెలిపెట్టిన పోగనియెంచి బట్టి రా
యన్నయమొప్ప నందుఁ గననయ్యెనుఁ గందు జగాన నందమై. 53

ఉ॥ బాగుగ నప్పురి న్సతులు బాహ్యవనంబులఁ జేరి వేడ్కతో
దాఁగుడుమూఁత లాడఁగ దస్కరియాచెలి వారి రోయఁగా

నేగెడుచోట నవ్వోలఁదిదృక్కులఁ బుష్పొడిగప్పి ప్రీతిమై
దాఁగినవారికిం గెలుపుదార్చె సమీరణుఁ డెట్టి మాన్యుడో. 54

గీ॥ నలువ రత్నముల్నిర్మించి నగరి పణ్య
వాటికలఁ ద్రోయ లఘుమణు లబ్ధిఁ బడిన
నందుచేనది రత్నాకరాఖ్యఁ డనరు
బయల రవి విధు లన రెండు వరలు లఘిమ. 55

మ॥ కరిదానాంబు లసత్ప్రవాహముల మార్గస్తోమము ల్పంకమై
వరలం దక్కరు లాదితేయసరిదంభఃప్రోద్భవామేయక
ర్బుర పద్మంబులఁ దొండముల్వఁగపుచుఁ బొల్పొందఁగా దూయఁ ద
త్పురి నా పుష్పొడిరాలి చిట్టెమగు నాత్రోవం జరింత్రాప్రజల్. 56

ఉ॥ రాజితమైన తన్నగరి రాజసుతు ల్సురరాట్సుతుండు వి
భ్రాజితవృత్తి వార్థివగు వాజులనెక్కి సవారిఁజేయ గో
రాజతురంగ మగ్గతి తెరంగులఁ బర్విడలేక యోడి స
త్తేజముఁబాసి వెల్లనయి దిక్కులుజూచును భీతచిత్తయై. 57

గీ॥ ఒనర రవితేరు దినమునకొక్కసారి
హేమగిరిచుట్టుఁ దిరుగునదేమివింత
యనుచుఁ దత్పురమునఁగల స్యందనములు
దిరిగివచ్చును గడియలో దిక్కులెల్ల. 58

ఉ॥ వేడుక నప్పురింగలుగు వీరభటు ల్బ్రజగాధినాథునిం
బోడిమిమీరఁదాఁకి రణముంజరిగించెడువేళఁ బాఫతే
డోడిన ఖడ్గధారను బదాఘముఁ ద్రెళ్లఁగఁ జేయు వాని ని
ట్లాడిరి పన్నగుం డురగుఁ డంచు జనంబులు నాటనుండియున్. 59

క॥ నాలుగుమోములచే ముది। వేలుపుపఠియించునాల్గువేదము లనుచున్
లీలంబఠియింతురుబడు। నాలుగు విద్యలొక మొగమున నచటివిప్రుల్.

ఆ-వె॥ రాజ రాజరాజ రారాజ రతిరాజ । రామరాజ రాజరాజసఖుల
శుద్ధియచటిరాజు లురుసత్కళా విత్త।మానరూప వీర్యమహిమములను.

క॥ తొమ్మిది పాతరలుగల ధ। నమ్ముండెం గాని నిల ధనదునకు మాసౌ
ధమ్ముల ధననిధులన నమి। తమ్ములుగాఁ గలవఁటంద్రు దత్పురివైశ్యుల్.

మ॥ అపురాయంచు జగంబు మెచ్చఁగ బురంబందుండు పాదోద్భవు
ల్నవధాన్యంబులచేను గళ్లములలోన న్మాన్చి శీఘ్రంబ త
ద్యవస ల్నింగినిముట్టఁ బ్రోవులిడఁగా నవ్వేళఁ దూర్పెత్తి పో
యువడిం బాలసమీరణుండు మదినత్యుత్సాహవర్ధిష్ణుఁడై. 63

సీ॥ ఏజాడగనుఁగొన్న శృంగారయుక్తులై పొసగుధీరోదాత్తపురుషవరులె
యేవీథిగనుఁగొన్నఁ బ్రావీణ్యయుక్తులై వరలుధీరోద్ధతసరసమతులె
యేయిండ్లగనుఁగొన్న నించువిల్తునిఁబోలుధీరశాంతాహ్వయచారుతనులె
యేరచ్చలనుగన్న సారసద్గుణులైన ధీరలలితనామ దీప్తవరులె.
యేగృహంబులఁగనుఁ గొన్న నెంచియుంచి
నట్టిపద్మిని శంఖిని హస్తినియును
జిత్రిణీప్రముఖులగు మంచి సొగసుఁగల
నాయికాశ్రేష్ఠలెన్నఁ దన్నగరియందు. 65

గీ॥ తమలపాకుల పందిళ్ల దళ్లచుట్టు
వెలయుక్రంపుటనఁటుల పెండెలదరి
వరలులోవలఁ జలువకైవచ్చుమృగము
లప్పురిమృగమదముతావి గుప్పుమనఁగ. 66

గీ॥ వికచకువలయ మకరంద బృందమిళిత
శిశిరమలయానిలుఁడు ఘర్మశీకరముల
నడఁప రతి పరిశ్రమ వీడియంత నెడలు
మఱచినిద్రించుచుండ్రుదంపతులు నిశల. 67

ఉ॥ సందెడుసోగపెన్నెఱులు సారసవైఖరిమించుకన్గవ
ల్చందొవవిందునందమును జిందఱపందఱఁ జేయుదంతము
ల్కెందలిరాకు పొందికలఁ గేరెడుమోవులశీవి తత్పురం
బందలివారకామినుల కందఱికేఁ దగునుమ్మునియ్యెలన్. 68

సీ॥ అతిమనోహరమైనచతురవాక్యంబు లేశుకమహత్వమునై నజూరబట్టు
గబ్బిగుబ్బ బెడంగుగొబ్బునఁ లోఁగొనుఁ గుంభసంభవసము జృంభణంబు
నెగిభరద్వాజమహోన్నతి సోగలాకందోయితీరు సుంకంబుగొనును
సుందరంబై తగు మందయానంబులే పరమహంసలనైన మరులుగొలుపు

నాటవెలఁదిచెంత దేటఁగీతియు మంచి
లక్షణంబు మాటలకు నియమము
నలరఁగలిగెనేని యతుల లోఁగొనుటకు
నర్థ సంగ్రహమున కబ్బురంబె. 69

క॥ కమలానురాగమగు నీ। సుమగంధల వాలుగంటి చూపులటంచున్
గమలానురాగు లతిసం।భ్రమమున నరుఁగుదురు వారవనితలదరికిన్. 70

సీ॥ విరిబంతు లెదనుంచి మరుఁగు బెట్టెదవేమొ?
యవి సువర్ణలతోదయములుగాన
జాతియేదోఁ దెల్పు? జాతులకేమి ప
ద్మినియన్నఁ గొనెదవే? మేల్మితోడ
వనితరో! ఘ్రాణ్న పువ్వనుజూపు వెలనిత్తు,
నరసి సొమ్మియ్య నీ తరమటయ్య?
గొబ్బున నీదండఁ గోరినాఁడను నేను
వెలబెట్టి గొనుమీవు వలసెనేని॥
యనుచును విటాళి నర్మోక్తు లనవరతముఁ
బలుకుచుండంగఁ దద్విధిఁ బ్రౌఢగతుల
వాగ్విలాసంబులను వారి భావమరసి
వెలయుచుందురు వీటఁ బుష్పలావీజనములు. 71

గీ॥ శాలికా పాలికా పాలి లీల నరప
లందు నిలుచుని పలుకాకి బృందములను
నొడిసెద్రాడులచే ఉువ్వుచుండి కేక
లిడఁగఁ గేకులు బ్రతికేక లిచ్చుచుండు. 72

సీ॥ సరగున నెదురేగి సాష్టాంగవందనం
బులు జేసి నిజగృహంబులకుఁ దెచ్చి
యర్ఘ్యపాద్యములిచ్చి యాసనంబులమర్చి
బోలుపొందఁగా విభూతుల నొసంగి
దేవతార్చనకుఁ బార్థివలింగపూజకు
లక్షలా బిల్వదళంబులిచ్చి

పంచభక్ష్యములతోఁ బరమాన్నములుబెట్టి
ప్రీతి దక్షిణలతో విడెములనిడి॥
శివుని సత్కథలను వారు చెప్పవినుచుఁ
బయనమైనను దూర మంపకముపెట్టి
సెలవుగై కొంద్రు పరమశైవుల సమీప
మునను శైవులు దత్పురంబునను భక్తి. 73

గీ॥ నగరిలోపల సంతర్పణము జరిగిన
దినమునందున విప్రులు తృప్తి నార
గించి యలసటనొందుటఁ గాంచి శిష్యు
లకును బెంపుడుకీరము ల్చదువు జెప్పు. 74

గీ॥ పురినిఁ బ్రతిగృహంబున మణిపుత్త్రి కలను
గుమ్మములకడఁ గని వెలగొమ్మలనెడు
సంశయమునెందు పరదేశ ఛాందసులను
విష్ణుబుద్ధిఁ బూజింతురు విప్రు లెలమి. 75

క॥ ఏతాదృశ పురమణి కధి। నేతయగుచుఁ బ్రజలనేలునెనరున సుగుణో
పేతుఁడు సకలజగద్వి। ఖ్యాతచరిత్రుండు హిమవదాఖ్యుఁడు ఘనతన్.

సీ॥ తన యశోరమణికి వనజారి నాసికా
భరణంబునందు సుప్పాణిగాఁగఁ
దన శౌర్యవహ్నికిఁ దపనీయబింబంబు
కరఁగిన బంగారుకడ్డి గాఁగఁ
దన జయలక్ష్మికిఁ దారాగణంబులు
జారు మౌక్తికముల సరములుగాఁగఁ
దన దానజలసముద్రమునకు సురనది
కలయవచ్చెడు దోఁటకాల్వ గాఁగ॥
దన సుగుణమణిరాశి వితానము నను
దివ్య చింతామణిలఘుగతి మణి గాఁగ
వరలుచుండును సంతోషభరితుఁ డగుచు
జగతి హిమవంతుఁ డార్యులు సన్నుతింప. 77

గీ॥ అంతట మహర్షులు నగరీద్వారముదరి
కేగి నిలచినఁ దత్పాలు రెలమితోడ
శీఘ్రమున నేగి యఁట గొల్వుసేయుచున్న
గట్లదొరఁగాంచి యనిరి వా రిట్లుమ్రొక్కి. 78

గీ॥ అహిత రాజన్యకుంభి సింహా పరాకు;
యమిత దీనార్థి సురభూరుహా పరాకు;
ప్రథిత సద్గుణరత్నాకరా పరాకు;
మహిత ధైర్యసంభూత ధామా పరాకు. 79

గీ॥ వ్రతిజనం బులు మొగసాలవద్దనిలచి
యున్న వా రిప్పుడో తేఁడ యన్న నతఁడు
గడుముదంబును జెంది తత్క్షణమ తనదు
గద్దియనుడిగ్గి వారలకడకు వచ్చి॥ 80

చ॥ ఎదురుగనిల్చి భూధరకులేంద్రుఁడు మౌనుల కెల్లమ్రొక్కిన
ద్విదితముఁగాభజించి పదతీర్థములందలయందుఁదాల్చి వా
రిఁ దనగృహంబులోపలికిఁ బ్రీతిగఁ దోడ్కొనిపోయి యచ్చటన్
సదమలరత్నపీఠముల సంతసమొప్ప నొసంగి యిట్లనెన్. 81

గీ॥ మీరు దర్శనమిచ్చుట మేఘముద్భ
వింపకయె వర్షమొగిసంభ వించినట్లు
పుష్పములుపుట్టకయె పండ్లుపుట్టినట్లు
దలచుచున్నాఁడ నిప్పుడో తపసులార. 82

ఆ-వె॥ మఱియు మీప్రకాశమానమైనట్టిద
ర్శనమువలన గుహలఁదనరు తమమె
కాదు హృదయమునను గల్గుతమంబును
దొలఁగిపోయెనేడు సలలితముగ. 83

క॥ ఇదియేనాసాధ్వీమణి । యిదినాసుతనంశ జీవితేందిర మేమున్
ముదమున మీకార్యంబుల । నెదురాడక సేయువార మెల్లప్పుడిలన్.

గీ॥ అనుచు నిట్లు గుహలు ప్రతిధ్వనుల నిచ్చు
నట్లు బలుకంగఁ బ్రీతి నా గట్లతేఁడు

తనదు జంగమ స్థావరాత్మకమునఁ దగు
రెండుదెఱఁగులఁ బల్కిన ట్లుండె నపుడు. 85

క॥ హిమవంతుం డివ్విధిఁగుతు।కమునంబలుకంగబుషులుఘనముగనంతో
షముఁజెందనాంగిరసముని।యమితాగమవేత్తయనియెనందఱుమెచ్చన్.

సీ॥ నిజమాడితివి నీదు నెమ్మనంబరయ నీ
యురు శిరంబులఁబోలె నున్నతంబు
భువి చరాచర భూతములు గుక్షిలో నున్న
కతన వైకుంఠుఁ బోలితివి నీదు
సంతానములుదధి చలదూర్ములను మీఱు
చును జగంబులను బావనముచేయు
శ్రీశాంఘ్రిఁబుట్టి యదెట్లు శ్లాఘ్యంబయ్యె
నట్లగు గంగ నీదగు శిరంబు॥
నందుఁబడి నీ విలనుఁ దాల్పవైతివేని
బిసమృదుఫణాళిచే ఫణివెసధరించి
యలరుటెట్లు గ్రిందికి మీఁది కడ్డమునకు
వెలయు నీదు మహిమలు త్రివిక్రము గతి. 87

గీ॥ విమల యజ్ఞభుజస్మధ్యభాగమును బొంది
నట్టి నీచేత మేరువు వ్యర్థమయ్యె
స్థావరాంగంబున కఠినతయును జంగ
మాంగమున భక్తి నమ్రతలయ్యె నీకు. 88

గీ॥ ఇపుడు మేమువచ్చిన కార్య మెలమి వినుము
కార్యలాభంబు నీయది కార్యఘటన
చేయుటనుబట్టి యందుశ్శ్రేయసముగఁ
బుట్టునంశంబు మాయది భూధరేంద్ర. 89

సీ॥ అష్టవిభూతుల కధినాథుఁడెవ్వాఁడ
దేవఁ డుపమానరహితుఁడు దలఁప
దనరూపముల విశ్వమును దాల్చునెవ్వాఁడ
దేవఁడు లోకంబుల నెల్లఁ బ్రోచు

నఖిల తేజోమూర్తులందు వెలుఁగునెవ్వఁ
డెవఁడు సర్వమునకు నీశుఁడరయ
యోగులు దమమది నెగిఁజూతు రెవ్వని
నెవని మాయఁ గనలే రెట్టివార॥
లట్టి సర్వేశ్వరాఖ్యఁ దా నర్థచంద్ర
సహితముగఁదాల్చె నెవ్వఁడా సర్వమయుఁడు
నీసుతను వరియింపంగ నెమ్మనమునఁ
దలఁచుచుండెనుసుమ్ము భూధరకులేంద్ర! 90

గీ॥ తగినవరునకుఁ దనయను ధారబోసె
నేని జనకున కెవ్విధమైన దుఃఖ
మొదవదండ్రు నీ సుతతోడ నుడువిభధరు
నలరఁ గూర్పుము వాక్కుతో నర్థమట్లు. 91

సీ॥ సకల చరాచరసంయుక్తుఁడును జగజ్జనకుఁడౌ శివున కిచ్చినను నీదు
సుత జగజ్జననియై శోభిల్లు విబుధులందఱుఁజంద్రమౌళికి నతులొనర్చి
మఱియుఁ గోటీరసన్మణిదీప్తిచే నామె లలితపదంబు లలంకరింత్రు
దలఁప నుమా కన్య దాతవీ వీశుండువరుఁడు యాచించెడివార మేము॥
అహహా ; యిట్టిలాభము నీ కులాభివృద్ధి
యౌఁ జుమీ లోకసంస్తుతి నలరునట్టి
యభవునకు సుతాసంబంధ మలరఁజేసి
జగతి నాతనికిఁ గురుండ వగుము నీవు. 92

క॥ మునులిట్లను సమయంబున। జనకునిదరి మోమువంచి చంచ ల్లీలా
వనరుహదళ నిచయంబుల। ఘనముగ లెక్కించుచుండె గౌరిముదమునన్.

క॥ అంతటహిమవంతుఁడుగడు।సంతసమును జెందితనదుజాయంగనుఁగొ
న్నంతట్ననామెయునరియనె।నెంతయుఁగులసతులుభర్తకెదురాడరుగా.

గీ॥ ఉత్తరంబిచ్చుటకు నిది యుచితసమయ
మనుచుఁ దలపోసి హిమవంతుఁ డాదరమునఁ
దన కొమార్తనుఁ దొడలపైనునిచి ముద్దుఁ
బెట్టికొను చిట్టులనియె సంప్రీతితోడ. 95

గీ॥ "విశ్వగురునకు భిక్షవై వెలసితీవు"
బ్రహ్మఋషు లర్థులైన కారణమున గృహ
మేధి ఫలమబ్బె నా కిప్డు మేల్మితోడ
ననియెఁగూఁతురిఁతో వేడ్కనద్రివిభుఁడు. 96

క॥ మునులార! సంతసమున। న్విను ఁ డీ 'శివపత్ని' మీకు వేడుకతో వం
దనములను సేయుచున్నది। కనుకక దీవనలొసంగి కరుణింపుఁడోగిఁ.

ఆ-వె॥ తగినచోటుగాంచితనయ నొసఁగుమని। పెద్ద లనిరిగానఁ బేర్మితోడ
నట్టిశుభముగ గ్లైనమర వందితులార। మీకృపావిశేషమేనుంచమున.

గీ॥ అనుచు నీరీతి హిమవంతుఁ డనఁగఁ దమ య
భీష్టసంసిద్ధియగుటకు నెంతను సంత
సించి "శీఘ్రమేవ వివాహసిద్ధిర స్తు
టంచు" మానీంద్రు లాశీర్వదించి రపుడు. 99

సీ॥ అంతఃపురంబున కాయరుంధతి చని మేనకచేత సమ్మానమొంది
యనియెనాదేవితోనతివరో!వినవమ్మ"యభవుండునీయల్లుఁడగునుసుమ్ము
ఇంతకన్నను లాభమేమున్నదో యమ్మ! నీభాగ్యమేమందునెమ్మితోడ
నీదంపతుల పెండ్లి యెల్లజగంబుల కానందమొనరించు" ననఁగ నామె॥
యిట్టులనె 'సర్వశుభములు నెలమి మాకుఁ
గలుగు మీ దీవనల చేతఁ గాదె' యనుచుఁ
బ్రీతిఁ 'బరమ పతివ్రతా శ్రేష్ఠలైన
మీ తలంపెన్నఁ డైనను మిథ్యయగునె?'. 100

గీ॥ అనుచు నిట్లాడుతటి గౌరి యామెపాద
ములకు వందన మొనరింప ముదముతోడ
నధికమగుకూర్మితో నంకమందునుంచి
కొనుచుఁ "బెండ్లికూతురవుగమ్మనుచుఁ" బలికె. 101

వ॥ అంత హిమవంతుండు బెండ్లి ముహూర్తంబెప్పుడనియడిగిన నాఋషు
లాలోచించి నేటికి మూఁడు దివసంబులున్నదని చెప్పనమితానందంబు
నొంది నమస్కరించిన సప్తఋషులు నతని మనీషావిశేషంబులకు
సంతసించి బహుభంగుల నాశీర్వదించుచు సర్వేశ్వరునిచెంత కరిగి

యచ్చటఁ జరిగినవృత్తాంతం బాద్యంతం బాతని కెఱింగించి యనేక వందనంబు లాచరించి పునర్దర్శన మయ్యెడుమని యథేచ్ఛంజని రంత శంభుండును మదన వేదనా దోధూయమాన మానసాంభోజుండగుచుఁ బార్వతి నెప్పుడుగనుగొందునో యనుచు నిముస మొకయుగంబుఁ గాఁ గాలంబు గడుపుచుండె నని యెఱింగించిన సంతుష్టాంతరంగుండై ధర్మనందనుం డటమీఁదివృత్తాంతం బెఱిఁగింపుమని మార్కండేయు నడుఁగుటయును. 102

క॥ నీలాంబుదనిభ తనురుచి। జాలా కరుణాలవాల సజ్జనపాలా
శీలా బుధలోలా రిపు। కాలా మునిహృదయఖేల కాంచనచేలా. 103

ఉ॥ మేరుమహీధ్రధీర ధృతమీనముఖాద్యవతార సజ్జనా
ధార ప్రశస్తకీర్తిజిత తార పటీర తుషార మౌక్తికా
హార శతార వార కరుణామృతపూర మునీద్ధ్రసజ్జనం
చార లస చ్చతుర్నిగమసార వినాకృత కార్య కారణా. 104

తోటకవృత్తము॥ ఇనవంశవిభూషణ కీశరథీ। వనజారినిభాస్య విభాశరధీ
యనవద్యనిబద్ధమహాశరధీ। ధనరాడ్హితసన్నుత దాశరథీ

గద్యము॥ ఇది శ్రీపరమేశ్వర కరుణాకటాక్ష సమాసాదిత సహజపాండిత్య
సరసకవితాధురంధర ఘనయశోబంధు రాపస్తంబసూత్ర
భారద్వాజగోత్ర పేమారుద్రావిడ శ్రోత్రియ
బ్రాహ్మణార్య సోమయాజి కులజలధిజైవాతృ
కారుణాచలేశ్వర తనయ నయగుణవిధేయ
లక్ష్మీనారాయణనామధేయ ప్రణీతంబైన
శివకథా సుధారసంబను మహా
ప్రబంధంబునందుఁ
పంచమాశ్వాసము.

---

శ్రీ పరమేశ్వరార్పణమస్తు.

శ్రీరస్తు.

శ్రీరామాయనమః.

శ్రీమహాగణాధిపతయేనమః.

శ్రీ శా ర దాం బా యై న మః.

# శి వ క థా సు ధా ర స ము.

## ష ష్ఠా శ్వా స ము.



కర నతమందారా। సాకేతపురీవిహార జగదాధారా
లోకైకవీర వర ర। త్నాకర గంభీర గుణగణాలంకారా.

వ॥ దేవా యవధరింపుము మార్కండేయమహామునీంద్రుండు ధర్మనంద
నున కట్టమీఁదివృత్తాంతం బిట్లనియె. 2

గీ॥ అంతశుక్లపక్షంబున నలరు పుణ్య
దినమునను లగ్నసప్తమంబున శుభగ్ర
హములు దనరార. మంచిలగ్నమునను హిమ
వంతుఁడు వివాహవిధికి నుపక్రమించె. 3

వ॥ అంత హిమవంతుఁడు సుహృజ్జనామాత్య బంధువర్గ పరివేష్టితుండై నిండుగొలువుండి మహానందంబున నమాత్యశేఖరుంగని గౌరీకల్యాణంబు నేఁటికి మూఁడుదివసంబులుండెం గావునఁ బట్టణం బలంకరింపఁ జాటఁబంపుమని నియోగింప నాతండునుఁ బరిసేవకుల రావించి యట్లు కావింపఁ బౌరపురంధ్రులమితానందంబు నొంది తమతమ గృహంబుల వివాహంబులు జరుగువిధంబునఁ బ్రయత్నంబులుసలుప యత్నించి 4

సీ॥ ముందుఁగా వీథులఁ బందిళ్లు వేయించి
కప్రంపుటనఁటిమొక్కలను నిలిపి
మందిరంబులను సమ్మార్జనంబొనరించి
మృగమదంబునను నట్టిండ్లనలికి

వరుసనోరులకు జేవురుపూతలను బూసి
ఘోలువుగాఁ జుక్కబొట్టులను బెట్టి
దగుభిత్తికలకు సుధాసేచనము జేసి
పసిఁడితోరణము లింపెసఁగఁ గట్టి॥
విమలహారావళ్యగ్రములను టెక్కెముల నిల్పి
యంత్రపాంచాలికా నిచయముల నెల్ల
వీథులందున శృంగారవిభవ మొప్ప
నుంచి రత్తఱి పౌరులు నుల్లమలర. 5

గీ॥ అంత హిమవంతుఁ డతికుతూహలముఁజెంది
పర్వతశ్రేష్ఠులకు శుభపత్త్రికలను
వ్రాసిశీఘ్రంబుగాఁబంప వార లమిత
కౌతుకాయత్త చిత్తాంబుజాతు లగుచు. 6

వ॥ ఉన్నంత. 7

సీ॥ ఎవ్వాఁడు జేజేలకెల్లను దావలం
బెవఁ డనంతగుణాఢ్యుఁ డెంచిచూడ
నెవ్వాఁడు బర్వతాధీశులలోమేటి
యెవఁడు రత్నంబులకెల్ల ఠావు
ఎవ్వాఁడు బరితప్తహేమకూటభగుం డ
దెవఁడు వసుంధర నెలమిఁ దాల్చు
నెవ్వఁ డీశునికేల నివ్వటిల్లెడు విల్ల
దెవఁ డసమాన సమిద్ధచరితు॥
డట్టి మేరుధరిత్రీధరాన్వయామ్బు
త్పాబ్ధి పూర్ణిమాశీతాంశుఁ డరుగుదెంచెఁ
దనదు జంగమాకారంబుదాల్చి ముద్దు
మనుమరాలి వివాహంబుఁ గనెడు వేడ్క. 8

॥ చెల్లెలిపెండ్లిఁ జూచుటకు శీఘ్రముగన్ జననెంచి వేడ్కతో
నల్లలితంబుమీఱఁగను సారెలఁగైకొని వేల్పుఁద్రోవఁ దా

నల్లనవచ్చె శీతలనగాగ్రజుఁ డించుకశ్రమైన నింద్రుచేఁ
దల్లడమందఁబోక హిమధామగిరీంద్రుఁడు సంతసింపఁగన్. 9

క॥ ఆలోఁ జెలియలిపెండిలి । నాలోకింపంగఁదలఁచి యతిమోదితుఁడై
శైలాళులెల్లఁ గొల్వఁగఁ। గోలాహలుఁడేగుదెంచె గురుఁడెదఁబొదలన్.

ఉ॥ ఆతతి వింధ్యభూధరుఁ డహర్పతితేజుఁడు వచ్చె నంతలోఁ
బ్రీతిగ రోహణాచలగరిష్ఠుఁడు వచ్చెను మాల్యవంతుఁడున్
ఖ్యాతిజనింప ముందుబొడకట్టెను దక్షిణామే ముదంబుతో
శ్వేత వినీల శోణ పృథివీధర ముఖ్యులు వచ్చిరెంతయున్. 11

చ॥ అరయఁగ గంధమాదనసమాఖ్య పరోదయ చక్రవాళ మం
దర మలయ త్రికూట నిషధ ప్రముఖాఖిల భూధరౌఘశే
ఖరు లరుదెంచి రత్తఱిఁ బ్రకాశముగాఁ దమజంగమాకృతు
ల్వరుసఁగఁదాల్చి వేడ్క హిమవంతుఁడు బ్రోచుచున్నవీటికిన్. 12

ఉ॥ వచ్చిన పర్వతేంద్రుల నవారణభూరి దయార్ద్రదృష్టిచే
హెచ్చుగ సత్కరించి తనయింటికి నందఱిఁ దక్షిణంబ దో
డ్తెచ్చి వివాహసంగతులుదెల్పుచుఁ బ్రొద్దులువుచ్చుచుండెఁ దా
నిచ్చనువచ్చినట్లుగ నగేశ్వరుఁ డంతట వెండికొండపై. 13

గీ॥ దేవదేవుండు శర్వుండు భావజారి
విధుకళాధరుఁడు సమస్త విష్టపముల
నుండువారల మదిలోన నొక్కమాఱు
వేడ్కతోడను స్మరియించె విదితముగను. 14

॥ అంతట వాణీకాంతుఁడు।గాంతాయుతుఁడగుచు వేఁగఘనముగ వరటా
కాంతునిపై నెక్కుచుఁ గడు।సంతసములరారవచ్చె శంభునిదరికిన్. 15

సీ॥ అచ్చరల్గొల్వంగ నైరావతారూఢుఁ డగుచునింద్రుఁడువచ్చెనంతలోన
వహ్ని కాలాసుర వరుణవాయు ధనాధిపతిముఖ దిక్పతు ల్వచ్చిరెలమిఁ
దపన శశి కుజ బుధ గురు కవి రవిసంభవ రాహుకేతువు ల్వచ్చిరపుడు
గరుడ గంధర్వ కిన్నర సాధ్య సిద్ధ విద్యాధర యక్షాదు లరుగుదెంచి॥
రంతఁ దారకలును దేవతాంగనలును
బ్రీతి నేతెంచి రరగులు వేడ్కఁ గొలువ

వాసుకియుఁ దక్షకాదులు వరుసతోడ
వచ్చి రెలమిచే శంభు నివాసమునకు. 16

గీ॥ రూపసంపద్విజిత పుష్పచాపుఁ డగుచు
వైభవముమీఱ నుచ్చైశ్శ్రవంబునెక్కి
యాజయంతుండు వచ్చినయంతలోన
నిందు వేడుక నలకూబరుండువచ్చె. 17

సీ॥ కశ్యప పాత్రి వసిష్ఠ కౌండిన్య శాండిల్య గౌతమ కౌశిక కణ్వ కపిల
వామదేవ వ్యాస వాల్మీకి జైమిని జమదగ్ని జాబాలి సుముఖ విముఖ
వత్స భరద్వాజ వరతంతు కుత్స త్రిశంకు రోమశ భృగు మంకణ చ్యవన పౌండ్ర నారద పైలవ శక్తి శంఖదళాద మాండవ్య గార్గ ధూమ్ర॥
ముఖ మునీంద్రులు భూతి త్రిపుండ్ర ఫాలు
లల కమండల దండ కృష్ణాజిన ధరు
లగుచు శిష్య ప్రశిష్యౌఘ మరసి గొల్వ
వచ్చి రత్తటి శంకరుపాలి కెలమి. 18

వ॥ అంత నమ్మహాదేవుని దర్శింప నేనును నరిగితి. 19

క॥ అద్రికుమారీ రుద్రుల। భద్రవివాహోత్సవంబుఁ బరికింపఁగ న
క్షుద్రాకృతులై సప్తస।ముద్రులు నరుదెంచిరపుడు ముదమెదఁ బొదలన్.

గీ॥ తపనపుత్త్రియు సింధు గోదావరులును
సహ్యజయు నర్మదయు సరస్వతియు మలయ
దుహితయునుఁ జంద్రభాగయుఁ దుంగభద్ర
మొదలుగా వచ్చి రల నదీనదము లటకు. 21

క॥ రూపవిభవ విజిత కుసుమ
చాపులగు చనేకపార్శ్వచయ రథముల సం
దీపితులగుచును సప్త
ద్వీపపతులు వచ్చి రెలమి దీపింపంగన్. 22

సీ॥ మాళవ చోళ నేపాళ బంగాళ పాంచాల నుత్కల మళయాళ గౌళ
లాట మరాట కర్ణాట మద్రాంధ్ర కళింగ విదర్భపుళింద యవన

కొంకణ కెంకణ కోసల కాశ్మీర శక సింధు ఘూర్జర సాళ్వకరుశ
భోజ విదేహకాంభోజ కుంతలవత్స మద్రద్రవిడపాండ్య మగధ మత్స్య
బాహ్లీక నిషాద సౌరాష్ట్ర బర్బర కురు
కేకయ త్రిగర్త గాంధార లోకనాథు
లెల్ల నిజవాహనంబుల నెక్కి వేడ్క
వచ్చి రత్తఱి నిండువైభవము లలర. 23

గీ॥ ఖగహయుని భీతిచేత రాక్షసులుదక్క
ప్రాణివర్గంబులోఁ జేరి రానివాఁడు
స్వర్గ మర్త్య పాతాళ భువనములందు
నెమకిచూచిన లేఁడు పందెమునకైన. 24

సీ॥ కమలజాతుని శిరఃకంపనంబున సుధాశనవిభు మందహాసమున సురల
నాలోకనంబున నహిపుంగవులనెల్లఁ గడకంటిచూపుల గ్రహ దిగీశ
గరుడ గంధర్వ కిన్నర సిద్ధ సాధ్య విద్యాధర ఖేచర యక్షపతుల
గరసంజ్ఞచేతనుఘనమైనముదముచేవాయెత్తిమునులనోహోయటంచు
వసుధులను సర్వదిగ్దేశ మనుజపతులఁ
జూచిచూడని మెల్లని చూపుచేతఁ
గుశలములనెల్లనారసి కూరిత్మోడ
బ్రహ్మఋషులను గనుఁగొని పల్కె భవుఁడు. 25

గీ॥ కమలనాభుండు శేషుండుఁ గలశభవుఁడు
ధ్రువుఁడు దప్పనందఱువచ్చిరి విదితముగ
వారు రాకుండుట కదేమి కారణంబొ
యనుచుఁ దలపోసి శంకరుండంతలోన. 26

గీ॥ కడుముదమున 'సర్వజ్ఞుండుగానఁ' దనదు
కేలనలరెడు ముమ్మొనవాలు నపుడు
భూభరంబునకైబంపఁ బొలుపుమీఱ
నంత నది యట్లుచేయ ననంతుఁ డలరి. 27

ఉ॥ వచ్చె ఫణామణిద్యుతు లవారితమై మిఱుమిట్లు గొల్పవై
యచ్చరముఖ్యలచ్చెరువునంద నిలాధరనందనుల్

జెచ్చెర మానసంబులను సిగ్గువహింప లస త్తనూరుచుల్
హెచ్చి సుధా శరత్కువలయేశుల నవ్వఁగ శంభుపాలికిన్. 28

గీ॥ అట్లు ఫణిసార్వభౌముఁ డత్యద్భుతముఁగ
నేగుదెంచిన సర్వలోకేశ్వరుండు
మృదు మధుర భాషణంబుల మేలివార్త
లారసి విశేషముగవాని గారవించె. 29

వ॥ ధ్రువునకొక్కని కమ్మహాత్మ్యంబు కరతలామలకంబగునట్లు వరం
బొసంగుటంజేసి యతండు రాఁడయ్యె నంత॥ 30

క॥ అల శంభుఁడు దనమదిలో । పల ఘటజాతుని స్మరింపఁ బరమాహ్లాదం
బలరఁగలోపాముద్రా। జలజాక్షికి నిట్టులనియె సరగున నతఁడున్. 31

గీ॥ వింటివే ప్రాణనాయిక! వృషభగమనుఁ
డెలమిచే వివాహంబున కేగఁదలఁచి
నన్ను స్మరియించె నేనేగినఁ గుతలంబు
దల్లక్రిందుగఁబడునంచుఁ దలఁచుచుంటి. 32

గీ॥ కాన దీనికుపాయంబుఁ గానవలయు
ననుచు నాతఁడుదలపోసి యామహాత్మ్య
వంబుఁగన నేగుటకు నుపాయంబుఁగంటి
ననుచు వేడ్కతో నెఱిఁగించి యామెఁగలసి. 33

క॥ కలశభవుడు దనదు కమం
డలు వచ్చోటనునిలిపి హాటాహుటి వచ్చెం
గలశజుఁడొకయెత్తు కమం
డలువొకయెత్తనెడుమాట నాఁడే కలిగెన్. 34

గీ॥ అట్లు వచ్చిన కలశజు నధికగౌర
వమున సత్కృతిఁగావించి భవుఁడుదనదు
డెందమందున సనక సనంద నాది
ఋషికులావతంసులను స్మరించె నెలమి. 35

క॥ మనమునఁ దలఁచినతోడనె । సనక సనందన సనత్సుజాతాదిమునుల్
దినమణిసన్నిభ తేజులు । జనుదెంచిరి వేడ్కతోడ శంభుని దరికిన్. 36

క॥ వచ్చిన మునులంగనుఁగొని। హెచ్చుగ ముదమంది వారికిట్లనె శివ్రుఁడా
పచ్చనిపుట్టముఁగట్టెడు। లచ్చిమగనిఁబిలువ్రుఁడుమునులార! యనంగన్॥

గీ॥ విని మహాప్రసాదంబని వేడ్కతోడ
నఖిలలోకేశ్వరుని చెంత నాజ్ఞఁగొనుచు
మునివరేణ్యులు వైకుంఠమునకుఁబోయి
దానవారినిఁ గానక దైన్యమంది. 38

గీ॥ ఆడితప్పితిమో యెన్నఁడైన లేక
యితరమైన దోషములొనర్చితిమొ గాక
శ్రీశుమాయయొ దెలియరాదేమి సేయ
నగునటంచును వినుతించి రంద అతని. 39

సీ॥ దేవ జగన్నాథ దేవేశ చిత్తంబు పంచేంద్రియంబుల వశత్వచేత
నవిరళ దుర్విషయానుభవములందు వర్తించి సత్ఫలభ్రాంతి మిడుత
దీపశిఖను వ్రాలి దెరలినవడువున నశియించుచుండుఁగాన విషయాను
భవములయందున వైరాగ్యమే మోక్షసాధనం బట్టి సుసాధనమున॥
కరయ బాహ్యాంతరారుల నడఁచినట్టి
భూరి నీనామమంత్రమే మూలమనుచు
నిన్ను వినుతింతుమెప్పుడు నెమ్మనముల
మదనగోపాల మునిమనస్సదన లోల. 40

సీ॥ జగతి నానావిధ జన్మపరంపర
లందున నరజన్మ మధిక మంను
బురుషజన్మమె మేలు భూమీసురుండౌట
కడు లెస్స విద్యాప్రకలితుఁడగుట
నరయంగ నుత్కృష్టమగుఁగాన నిన్నియుఁ
గలిగి స్వేచ్ఛావృత్తినలరు కీర
మల పంజరమునఁ దగిలి కృశించెడుభంగి
విషయేచ్ఛలను పాశవితతిఁ జిక్కి॥
దుర్గతులఁజెంది భీతినొందుదురు జగతిఁ
గాన తత్త్వార్థమారసి జ్ఞానులగుచు

ముక్తులైనమే ల్దీనికి మూలమీవె
మదనగోపాల ముని మనస్సదన లోల. 41

సీ॥ తసర వేదాంతశాస్త్రములు సాంగంబుఁగాఁ
జదివి పాండిత్యసంపదలఁబొదలు
వారు నీషణములువదలుట బ్రహ్మసా
క్షాత్కారమొందుట జగతి దుర్ల
భంబని దలఁచుచు వైరాగ్యమొందక
ధనధాన్యముల నమ్మిదర్పగర్వ
భరితులగుచుఁ దమోబంధురంబగు నూతఁ
బడు దెల్విఁగల గ్రుడ్డివాఁడు బోలె॥
నైహికసుఖంబులొందుచు నమితదుర్గ
తులను గనుచుందురు గాన సలలితముగ
మోక్షసాధనమున కీవె మూలమరయ
మదనగోపాల మునిమనస్సదన లోల. 42

సీ॥ దృగ్గోచరంబగు సృష్టి యచింత్య మా
యాశక్తి కల్పితంబని దృఢముగ
నెఱిఁగి కామప్రభృత్యరివర్గమును దురా
శను దుష్టజనముల సంగతియును
వదలి సజ్జన సహవాసంబు సేయుచు
మిత్ర పుత్ర కళత్ర మైత్రి విడిచి
దనరు దాసీ దాస జన గృహ క్షేత్రాదు
లందు మమతమాని డెందమునను॥
మోక్షసాధకంబగు కర్మములనుఁజేయు
చును నిరంతరమును నీను ఘనతరాఖ్య
భక్తితో జపించిన మోక్షపదవిదొరకు
మదనగోపాల మునిమనస్సదన లోల. 43

సీ॥ అవని శ్రోత్రాద్యవయవ యుక్తమానవప్రాణి
ఘనతర భక్తిమార్గమును జెంది

త్రికరణశుద్ధిగా దేవదేవుని సేవ
చేయు చుంగంటులచేత నల న
ధోగతి ప్రదములౌ దుష్కార్యములను జే
తలుమాని భగవత్కథా శ్రవణముఁ
ద న్నమస్కరణముఁ ద త్స్వరూపావలో
కనము ద త్పూజాదికములయందు॥
నిత్యమును బ్రవర్తించి యుండినను నట్టి
యు త్తముండు సంసారాబ్ధి నెనరదాఁటి
మోక్షమార్గంబుఁ జెందును ముదముతోడ
మదనగోపాల మునిమనస్సదన లోల. 44

సీ॥ నయముచేఁ బరదూషణపరాఙ్ముఖుండయ్యు
సుగుణసంపత్తితో జగతిని నతి
మృదుభాషి యగుచును విదిత సత్యవ్రత
నిష్ఠుండుగానుండి నీదుదివ్య
మగునామకీర్తనాయత్త మానసుఁడయి
యుండిన భాగవతోత్తముండు
భక్తియోగబల ప్రసక్తిచే నుత్తమ
మోక్షపదంబును బొంద నర్హుఁ॥
డగునుగాన తద్యోగసంప్రాప్తి కరయ
నీదుకృపయె సాధనమని నెమ్మితోడ
నిన్ను వర్ణింతుమెప్పుడు నెమ్మనముల
మదనగోపాల మునిమనస్సదన లోల. 45

సీ॥ కడఁగి వేదాంతసద్గ్రంథంబులను బ్రతి
పాదింపఁబడియుండు పరమతత్త్వ
మైనదై తనరు జ్ఞానానందసత్య స్వ
రూపాద్యఖిల లక్షణోపలక్షి
తంబైన వస్తువు దలఁప నీవేగాని
వేరొండుగాదని ప్రీతిచేత

ఘనులెల్ల భావించికొని కృతార్థతఁజెంద
యత్నింతురెప్పుడు నట్టిపరము॥
పురుషుఁడే మాకు సేవ్యుఁడా పురుషభజన
వలన నిఖిలజనంబుల కెలమినర్థ
ములును బ్రాపించుఁగాదె సమ్మదముతోడ
మదనగోపాల మునిమనస్సదన లోల. 46

సీ॥ అంతటఁబరిపూర్ణుఁడైయుండి యెవ్వాఁడుజలధిలో శేషాహిశయ్యనుండఁ
సర్వప్రపంచ పోషకుఁడయ్యె నెవ్వాఁడు ఖలశిక్ష సాధురక్షణ మొనర్చ
వివిధావతారముల్వెలయఁదాల్చుచునెవ్వఁడరయసనాతనుండైవసించుఁ
దనరంగనుసకలాంతర్యామియైయెవ్వఁడెన్నఁగ యోగులహృదివెలుంగఁ
నరయ నెవ్వాఁడు సంసారియగుచు వెలసి
దలఁప నిస్సంగుఁడగుచును దనరుచుండు
నట్టి సత్పరబ్రహ్మ మీవని దలఁతుము
మదనగోపాల మునిమనస్సదన లోల. 47

క॥ అని సనకాదులు వినుతిం। చినఁబీతాంబరధరుండు శీఘ్రంబుగఁ ద
ర్శనమిచ్చి గారవించిన। నెనరొప్పఁగ మఱియు నిట్లనిరి సంప్రీతిన్. 48

గీ॥ పటుతరంబైన భక్తిచే నిటలతటము
లందుఁ గృత కరసంపుటులగుచు "విష్ణ
వే నమోనమ" యనుచును మానితముగ
నెలమిచేతను సాష్టాంగముల నొనర్చి. 49

వ॥ ఇట్లని వినుతించిరి. 50

సర్వలఘుసీసము॥
జలజనయన మునిజననుతపదజల
రుహ కనకవసన విహగగమన
పుడమియు సిరియును నడుగులునిమురఁగఁ
గడుముదమునుగని నడరెడొడయ
తొలిపలుకుల చివర లునికిగలిగిన
కనికరములగని కడిఁదిబిరుద

గొనబుగ వలమురియును సుడికయిదువ
యనుభయ కరములఁ దనరు వలఁతి॥
పలు దెఱఁగులుగలుగు బలు పొలసుఁదినెడు
బెడఁగుగములను నడఁచిన బిరుదుమగఁడ
కడలినిఁ జిలువపరుపునఁ గడఁగి నిదురఁ
గొఱలు చెలువులగని నిను గొలుతు మెపుడు. 51

గీ॥ అవధరింపుము దేవ! శశాంకమౌళి
పార్వతినిఁ బెండ్లియాడంగఁ బర్వతేంద్రు
వీటికేగంగఁదలఁచి త్రివిష్టపముల
నుండువారల రావించె నెప్పమీఱ. 52

గీ॥ అట్లువచ్చినవారల నతిముదమున
క్షేమములనెల్ల నారసి చిత్తమునను
మమ్ముస్మరియింప మేమేగి మదినిఁబొంగి
యతని వినుతించుచుండ మమ్మాదరించి. 53

క॥ మునులార! యిపుడు శ్రీనా। థున కీత్తెఱఁగెల్లఁ దెలిపి తోడ్తోడనె నా
తనిఁ దోడి తెండనంగను। ఘనతరముగవచ్చి మిమ్ముఁగాంచితిమెలమిన్.

ఆ-వె॥ ఏమియానతియన శ్రీశుఁడిట్లనె మౌని। చంద్రులార! మిగులసంతసించి
నాఁడనైన మాకు నగజతోఁబుట్టువు। గాన నచటికేగఁబూనినాఁడ.

క॥ ఈసంగతి రజతాగని। వాసున కెఱిఁగింపుఁడనఁగఁ బనివిని శీఘ్రం
బాసనకాదులు శర్వుని। వాసిగఁగని దెల్పి రచటి వార్తల నెల్లన్. 56

క॥ తెలిపిన నంతట విని యా। జలజాంబకధారివైరి నంతసమున నా
జలజాక్షుని భావం బెసఁ। దలపోయుచు మెచ్చికొని విధాతృనకనియెన్.

గీ॥ అరయ సుముహూర్తమాసన్నమయ్యెఁ గానఁ
బెండ్లికై యందఱముఁ దర్లి వెడల వలయు
నింక జాగొనరింపక యెల్లవార
లకు నెఱింగింపు మీమాట లాలితముగ. 58

గీ॥ అనినవిని పద్మయోని తా నతిముదమున
నలరి యందఱ కభవునిత

వారలందఱు సంతోషభరితులగుచుఁ
దక్షిణమె వారి వారి ముస్తాబులైరి. 59

గీ॥ అంత శంభుఁడు దనవారి కాజ్ఞ నొసఁగ
భృంగిరిట చండికేశ్వర విఘ్ననాయ
క ప్రముఖులును ప్రమథసంఘంబులు నతి
సంభ్రమాయత్త చిత్తాంబుజాతు లగుచు. 60

సీ॥ మహిత రుద్రాక్షదామంబు లందఱికిని శ్యామలకంఠంబు లందఱికిని
భస్మత్రిపుండ్రాంక ఫాలంబులందఱి కాపాండు దేహంబు లందఱికిని
లలిత హస్తత్రిశూలంబు లందఱికిని నర్ధేందుమకుటంబు లందఱికిని
యహికుల బ్రహ్మసూత్రాళులందఱికినినలయోగదండంబులందఱికిని॥
దరుణ పల్లవశతకోటి ధాతురాగ
ధిక్కృతియొనర్పు పాటల దీర్ఘతర జ
టామకుటము లందఱికి నిటాలతలము
లందుల నుదగ్ర నేత్రంబు లందఱికిని. 61

గీ॥ అట్లు ప్రమథులు ముస్తాబులగుచు నెదుర
నిలిచి మ్రొక్కిన శర్వుండు నిండుముదము
జెందీ ధర్మస్వరూపుఁడౌ నందికేశ్వ
రుని మనంబున దలప నా ఘనుఁడు ప్రీతి. 62

సీ॥ శ్వేతాద్రిపై నొప్పు శృంగముల్వాలెశిరం
బున శృంగయుగళంబు పొలుపునెఱప
కైలాసశిఖరిపై గండోపలము రీతి
మూపునందు బలుమూపురము వెలయ
నాకప్రదేశంబున వియత్తరంగిణీ
లీలమెడను గంగడోలు మెఱయ
పటువిశ్రుతంబులై భాసిల్లు ద్విద్వయ
శరధుల విధమున గొరిజ లలర॥
ప్రథిత వాసుకివిధమున వాల మమర
గ్రీవమున జిక్కులట్లు గింకిణులు చనర

బ్రోదిపెట్టిన వెన్నెల ప్రోగనంగ
వచ్చె వృషభేంద్రుఁ డత్తఱి భాసురముగ 63

గీ॥ ఇవ్విధంబున నందీశుఁ డేగుదేర
సంభ్రమాయత్త చిత్తాంబుజాతుఁ డగుచు
సర్వలోకేశ్వరుండగు శంకరుండు
బోరిఁ జతుర్విధాలంకార భూషితుఁడయి. 64

సీ॥ ఒకచాయవిబుధనాయకుఁడు సమ్ముఖమున
నడరుచు వెలిపట్టుగొడుగుఁ బట్ట
భృంగీశ్వరుండు జండీశుండు నుభయపా
ర్శ్వములఁ లలిత చామరములు వీవ
భసితత్రిపుండ్రకోద్భాసితు లగుచును
బ్రమథవర్గము బరాబరు లొనర్ప
డమరు వీణాది వాద్యములఘోషములతో
భూతనాయకులెల్ల ముందు నడువ॥
బ్రహ్మ మొదలుగ దేవతావరులు మునులు
మంగళాశీర్వచనములు మహిమబలుక
సూర్యు డుదయాద్రిఁబోలె విశ్రుతవృషేంద్రు
పైనధిష్టించి కదలె వివాహమునకు 65

గీ॥ ఇట్లు శుభముహూర్తంబున నిల్లువెడలి.
మునులు యోగులు నమరప్రముఖులు గొలువ
ముదముచే నోషధీప్రస్థ పురము దరికి
నిండువైభవమున వచ్చె నీలగళుఁడు. 66

క॥ అంత గుతూహలమున హిమ
వంతుఁడు గులగోత్ర మిత్ర బాంధవ బుధ సా
మంతామాత్య పురోహిత
సంతానముతోడ నెదురుచనె నీశునకున్. 67

గీ॥ ఇవ్విధంబుననీశున కెదురువచ్చి
కప్రపువిడెంబుల నొసంగి ఘనతరముగఁ

దగిన సత్కారములుజేసి నగరమునకుఁ
దోడుకొని వచ్చుచుండె సంతోషమునను. 68

వ॥ అంత. 69

సీ॥ ఏవీథిఁ దిలకించినా విన్ననంటు పందిళ్లులేనట్టి వాకిళ్లులేవు
ఏచాయ వీక్షించినా చారుకనకమయంబులుగాని హర్మ్యములులేవు
ఏజాడఁ జూచినామృగమదఘుమఘుమ గంధంబులేని చక్కటులులేవు
ఏయిక్కఁ గాంచినా హీరాదినవరత్న కాంతులీనని కేతుగణము లేదు॥
మఱియు నెచ్చోటు నరసినా మంచి మంచి
మించు తళుకులమించు నెమ్మేనిచాయ
లొలుకు పద్మినీజాతి గాకున్నయట్టి
నెలఁతలును లేరు వీటఁ బందెమునకైన. 70

గీ॥ అంత డమరు వీణాదివాద్యములు సెలఁగ
నచ్చరలు ముందు నాట్యంబులాడ రాజ
మార్గమున వచ్చుచుండిన భర్గుఁజూడఁ
బౌరయువతులు సంతోషభరితలగుచు. 71

చ॥ ఒకయెలనాగ కన్నుగవ కొప్పుగఁ గాటుకఁ బెట్టఁబూని వ్రే
ళ్లకుమెదిసించి యుండునెడ లాలితమొప్ప శివుండు వచ్చెనం
చొకపికవాణిదెల్ప విని యుబ్బుచుఁదొందఱచేత వ్రేళ్లకా
టుక మెడఁబూసివచ్చెను దటుక్కున నీలగళుం గనుంగొనన్. 72

చ॥ ఒకచపలాక్షి మజ్జనము నెప్పుగ సల్పుచునుండి భూతనా
యకుఁ డరుదెంచుటల్విని మహోత్సవచేఁ గటిబద్ధచేలయై
ప్రకటకుచద్వయం బుభయపాణులమూయుచు వచ్చె నంతలో
లికుచము లమ్మహేశునకు లీలను గానుకఁ దెచ్చెనో యనన్. 73

చ॥ ఒకలలితాంగి వేడ్క లిగురొత్తఁగఁ దంబుర వ్రేళ్లమీటి గే
యకలన బాడుచుండియు మహేశునుఁజూడఁగ గోరి వచ్చుచున్
బ్రకటముగాఁగ ద్వారనికర ప్రతిబింబములెన్నియేని బ
ల్లుకురములందుఁగాంచి మదిలోనగలంగెను ద్రోవగానమిన్. 74

క॥ మనములరఁగ వీణాని
స్వనముబలుక మేళవించి స్వరయుక్తముగా
ఘన "శివకథాసుధారస
మును" బాడుచువచ్చె నొర్తు ముక్కంటికిఁగన్. 75

శా॥ గంగాజూటునిరాక విన్నదగుచుం గంజాక్షియొక్కర్తు మా
తంగాంచద్గమనంబు నెన్నుడచే ద్వారప్రదేశంబునన్
శృంగారంబగు గొప్పదువ్వుచునువచ్చెం జూచువారెల్ల వే
డ్కం గాళిందిని మాళిఁబూనెనొకొ యీ కాంతాలలామం బనన్.

మ॥ చిగురుంగేరెడు మోవిఁగల్గు నొకరాజీవాక్షి బల్వింతవే
డ్కఁ గడుంజెందుచు ఫాలనేత్రుఁగనుకాంక్షంబూని శీఘ్రింబుగా
వగలాడు ల్దనుమెచ్చ నగ్నిశిఖ సత్ఫాలంబునం జిత్రికం
బుఁగఁ గీల్కొల్పుచు వచ్చెఁ జూపఱులకు న్మోదంబు జెన్నారఁగన్.

చ॥ తరుణియొకర్తు శంభుఁగన ద్వారసమీపముఁజేరి శంకరా
భరణసమాఖ్యరాగమును బాడుచు నంతట మంద్ర మధ్య భా
సురతర తారకంబులను జొక్కపువీణెల మేళవించి శం
కరగుణకీర్తనల్సలిపెఁ గౌతుకపూరిత హృత్సరోజయై. 80

క॥ అంతంగొందఱుచెలు ల। త్యంతముదావహముతోడహర్మ్యాగ్రములం
దెంతయుగుంపులుగూడి పు। రాంతకుఁగనియొకరికొక్కరనిరిగ్గతులన్.

సీ॥ ఇతఁడ కే జగములనెల్లఁగాల్పఁగవచ్చు హాలహాలంబును మ్రింగినట్టిజెట్టి
యితఁడకే భువనసంతతినిజంపఁగఁబూను మిత్తినేపడచిన మేటివేల్పు
ఇతఁడకేవిష్టపాహితుఁలైనపురదైత్యవరులనుబొరిగొన్న బాహుబలుఁడు
ఇతఁడకేకాలచోదితుఁడయిశరణన్న మునిపుత్త్రిఁగాచినపుణ్యమూర్తి॥
యితఁడకే సర్వవిబుధసన్నుతచరిత్రుఁ
డితఁడకే లోకములకెల్ల నీశ్వరుండు
ఇతఁడకే యోగిజనములయెద వెలుంగు
నితఁడకే భక్తులకు మోక్షమిచ్చుదాత. 82

సీ॥ వనిత! యీతనికి నివాసంబగుటకుఁ గై
లాస మేపుణ్యంబుఁజేసెనొక్కొ?

సతివ ! యీతనికి వాహనమై దనరుటకు
వృషభ మేపూజఁ గావించెనొక్కొ ?
వెలఁది! యీతనిఁ బరివేష్టించుటకు భూత
విసర మేదానంబు లొసఁగెనొక్కొ ?
నబల ! యీతనిమౌళి నలరియుండుటకును
జంద్రుఁ డెట్టితపంబు సల్పెనొక్కొ ?॥
నాతి ! యీతని కేల నంతతము వెలయ
శూలమేనోమునోచె నొక్కొ ? లతాంగి !
యితనికంఠంబునందు సంతృప్తిమెఱయఁ
గుండలీంద్రుఁడేవేల్పునుఁ గొల్చెనొక్కొ ?. 83

గీ॥ అనుచు నీరీతి నాడుచున్నంతలోనఁ
గొంతఱంగన లొక్కచో గుంపుఁగూడి
నిండు వైభవాన్వితులయి నీలగళుని
తోడ వచ్చుచుండిన విబుధులనుఁగాంచి. 84

వ॥ తమలోనిట్లనిరి. 85

సీ॥ అశ్వమేధాద్యనేకాధ్వరంబులొనర్చువారల కేవీడు వాసభూమి
యేపుటభేదనం బెన్నఁ గిన్నర సుర సిద్ధ గంధర్వాది సేవితంబు
సంతాన సురగవీ చింతామణులకునే స్థలము భాసురమగు తావలమ్ము
సకల సౌభాగ్యప్రశస్తంబులకునెల్ల నెనర నేపురవరం బునికిపట్టు॥
అట్టి నాకపురంబేలునట్టి యింద్రుఁ
డదిగొ నైరావతారూఢుఁడగుచు శివుని
చెంతఁ దనరారుచుండెను సంతసమునఁ
గలికి ! కనుఁగొంటె యాతనిఁ గన్నులార. 86

గీ॥ అగ్నిహోత్రుఁ డితం డాతఁ డంతకుండు
నైరృతి వరుణ వాయు ధనదులు వారు
వారె నలకూబరుండును వాసవాత్మ
జుండు వారిఁ గ్రమంబునఁ జూడు మబల!. 87

క॥ సురవర గరుడ ఖచర కి। న్నర గుహ్యక కింపురుష ఫణాధర విద్యా
ధరసిద్ధ సాధ్య యక్షులు। వరుసగ నరుదెంచుచున్నవారలు గంటే. 88

ఉ॥ మిక్కుటమైనతేజమును మేటిపరాక్రమమున్ భుజాబలం
బెక్కుడులావుగల్గుచు మహేశునిచెంగట గుంపుఁగూడుచుం
దక్కిన దేవయోనులు ముదంబునవచ్చుచునున్నవారదే
లెక్కలకెక్కువైదనరి లేమ! కనుంగొనుమింపుతోడుతన్. 89

సీ॥ కాఱ్కొన్న గాఢాంధకారతూలికల కాభీలతరజ్వాల తీక్ష్ణకీల
సమదమందేహరాక్షస భుజోద్ధతభూజవారంబునకును గుఠారధార
భూరిభయంకరాకార సంసార సాగరధుతకల్లోలతరణ తరణి
శీతాంశుకిరణ మూర్ఛితపద్మినీ పునర్జీవనాధార సంజీవిఘుటిక
యలరఁ బదినూఱుచేతులుగలుగు వేలు
పాఱునొకగుఱ్ఱములఁ బూన్చినట్టి తేరి
పైనివాలఖిల్యులు గొల్వ వామదేవు
చెంత నరుదెంచుచుండె వీక్షింపు మబల. 90

గీ॥ జారులకుసూడు చోరులవేరువిత్తు
సరసిరుహరమా పహృతిోహరుఁడు విరహి
జనములకు గుండెగాలంబు జక్కవకవ
విప్పు చలువలకుప్ప జాబిల్లిఁ గంటె?. 91

గీ॥ కుసుమకోమల! యీతండు గుజుఁ డతండు
వేలుపులబువ్వపట్టి జేజేలయొజ్జ
యాతఁ డాతఁడు శుక్రుఁ డీయనఘుఁడు శని
యాతఁడేరాహు వాతఁడు కేతువబల. 92

గీ॥ అష్టవసువులునుమ్ము వా రంబుజాక్షి!
భుజగపుంగవు లిటుచూడు భుజగవేణి!
మేటికర్కోటకుఁడువీఁడు మెఱుఁగుబోఁడి!
యింద్రునకుఁజెలి తక్షకుం డితఁడు తరుణి!. 93

చ॥ వరసురదానవాన్వయులు బాలసముద్రము ద్రచ్చువేళ మం
దరగిరిచుట్టుఁజుట్టుటకుఁ ద్రాటితెఱంగుననుండినట్టి భా

సురతరధైర్యశాలి పరిశుభ్రయశోజితశారదాంబుదుం
డురగకులాబ్ధిసోముఁడు గుణోదధి వాసుకిఁ జూడుమంగనా. 94

శా॥ పాతాళంబున భూమిభారవహుఁడై పాథోధిలో దైత్యసం
ఘాతారాతికిఁదల్పమై శివునిశ్రీకంఠంబులో హారమై
వాతప్రాశనలోకపాలుఁడయి భాస్వచ్ఛుభ్ర దేహుండునై
ఖ్యాతిం జెందిన శేషుఁడాతఁ డతివేడ్కంజూడు మబ్జాననా. 95

గీ॥ శారదాదేవికి విభుండు సత్యలోక
మేలునయశాలి నలువ జేజేలపెద్ద
జగములన్నియు నిర్మించు చతురబుద్ధి
బ్రహ్మ యాతఁని జూడుమా పంకజాక్షి. 96

క॥ ఓపడఁతి! యతనిఁగాంచుము! లోపాముద్రకువిభుండు లోకోత్కృష్టుం
డీపావనచరితుఁడు ము! న్నాపోశనముగనుగొనియె నబ్ధిజలంబుల్. 97

సీ॥ ఊరుభాగమున భూభారంబుఁ దాల్చిన కశ్యపుఁడాతండు కంబుకంఠి!
పరమేష్ఠిసృష్టికిఁ బ్రతిసృష్టిఁ జేసిన కౌశికుండీతఁడు కాంచనాంగి!
హరి హరబ్రహ్మల నాత్మజులుగఁగన్న యత్రియాతండును మ్మంబుజాక్షి!
తొడరి స్వర్పతిమేను దుర్భగత్వమొనర్చినట్టి గౌతముఁడీతఁ డబ్జవదన!॥
బ్రహ్మసన్నిభుఁడగు భరద్వాజుఁ డతఁడు
శిష్టచారిత్రుఁడైన వసిష్ఠుఁ డితఁడు
ధవునిచెంగట నదె యరుంధతి మృగాక్షి,
జామదగ్ని యాతఁడుసుమ్ము కోమలాంగి!. 98

గీ॥ వారె భసిత త్రిపుండ్రకోద్భాసమాను
లగుచు శిష్య ప్రశిష్యౌఘ మరసిగొల్వ
దేవదేవునిముం దరుదెంచుచున్న
వారు మునిపుంగవులుచూవె వారిజాక్షి. 99

సీ॥ నాతి! యొక్కటి రెండు నాల్గెనిమిది పది
యాఱు ముప్పదిరెండు నలువదియును
నాల్గు లక్షల యోజనములు విస్తీర్ణమై
క్రమమొప్పగ లవణేక్షువ సు రాజ్య

దధి దుగ్ధ జల సముద్రంబులు నిజరూప
ములుదాల్చి ధర్మపత్నులయిదనరు
పుణ్యతరంగిణు ల్మానసిసేవింపంగ
వాయుదేవునిచెంత వచ్చుచున్న॥
వారలదె వారు రూపవై భవసమగ్రు
లును గభీరనిధు ల్పుణ్యఘనులు విమల
దానశీలురునుమ్ము సంతసముతోడఁ
గాంచుమను చోకచెలి కొక్కకలికి బలికె. 100

మ॥ సరసీసంభవనేత్ర! గాంచు మలక్రౌంచ ప్లక్ష శాకాఖ్య పు
ష్కర జంబూ కుశ శాల్మలీ ప్రముఖ భాస్వద్ద్వీపసంఘాతపా
లురు చంద్రార్కకులోద్భవు ల్ఘనయశు ల్పూర్ణప్రతాపోదయు
ల్వరుసన్ వచ్చుచునున్నవార లదె లీలన్ శ్శంభునిం గొల్చుచున్. 101

క॥ వనితరో! జంబూద్వీపం। బునఁగల నరనాథసుతులు బురుమన్మృగేంద్రు
ల్మనసిజసమానరూపులు। ఘనదాతలుసుమ్ము వారిఁగనుఁగొను మెలమిన్

గీ॥ అనుచు నీరీతి నాడుచున్నంతలోన
నగకులేంద్రుండు కాంచన హర్మ్యములను
వేడ్కతోడను శివునకు విడిదియొసఁగఁ
గడుముదంబున విడిసెను గాలగళుఁడు. 103

వ॥ హిమవంతుండును నిజగృహంబునకరిగి తనమనంబున సర్వలోకేశ్వరు
నివివాహకార్యనిర్వహణంబునకు లక్ష్మీనాథుండు సమర్థుండగుఁగాని
యితరులకు శక్యంబగునే యని దలంచి భక్తిపూర్వకంబుగా నాతని ని
ట్లని వినుతింపందొడంగె. 104

దండకము॥ శ్రీమద్రమామానినీ మానసాంభోజమిత్రా సురాధీశనీలావళీ
చారుగాత్రా ప్రఫుల్లాబ్జనేత్రా కనజ్జైత్రయాత్రా సరోజాసనస్తోత్ర
పాత్రా నమద్యోగిసంఘాటవీ చారుచైత్రా సుచారిత్ర సౌవర్ణ నేత్రాది
దైతేయసంతాన తూలాగ్ని హోత్రా శకుంతీంద్రపత్త్రా భవాంభోధి
సద్యానపాత్రా మనోజాతకోటి స్ఫురత్సుందరశ్రీవిచిత్రా కుగోత్రా

వళీభూరివల్లీలవిత్రా పవిత్రా సురారాతిభీమా యశోజన్మసీమా జగద్గీతనామా గుణస్తోమధామా ప్రభావాభిరామా భుజంగేంద్రతల్పా మహాసిద్ధసంకల్ప భక్తౌఘకల్పా సురేంద్రాగ్ని కాలాసురాబ్ధీశ వాతార్థపేశానముఖ్యాష్టదిక్పాలకానేక బర్హిర్ముఖానీక కోటీర రత్న ప్రభాజాల సందీప్త పాదారవిందద్వయా యద్వయా ద్విద్వయోపాయవిద్వద్వతంసా నృశంసారి షాడ్గుణ్యచాతుర్యధుర్యా యవార్యప్రతాపా నతానీకహృద్దీప పాదాబ్జనిష్ఠ్యూతభాస్వద్వియద్వాహినీశీకర ఝాళితోదగ్ర గో బ్రహ్మహత్యాది పాపా పరబ్రహ్మరూపా లసచ్ఛార్ఙ్గచాపా సమిద్ఘోరకోపా నిరస్తోపతాపా సుధామాధురీ భాసురాలాప దామోదరా కేశవా శ్రీహరీ నారదానేకపేంద్రాంబరీష ప్రభృత్యంఘ్రిభక్తౌఘ హృత్పద్మ మత్తద్విరేఫా సుధాసార నీహార హారావళీ తార డిండీర హీరేంధుకోటీర పాటీర కర్పూర కాశాధిపాకాశ గంగా చతుర్దంత దంతావళోచ్చైశ్శ్రవః కాశ కుందేందు మందార సంకాశ కీర్తిప్రకాశా కృపానీరధీ సారథీ కృష్ణ నారాయణా చక్రపాణీ కృపాణీ హృషీకేశ రామానుజా పద్మనాభా మురారీ పురారిప్రియా వాసుదేవా చిదానంద గోవింద వైకుంఠవాసా నృసింహప్రభూ జాతరూపాంబరా శ్రీధరా భవ్యశీలా జగన్నాథ గోపాలనీళా రమాభూ సతీ కుంభికుంభోపమానస్తనన్యస్తకస్తూరికార్ద్రాంచితోరస్థలా దేవ దేవాదిదేవేశ కౌండిన్య శాండిల్య మాండవ్య గాధేయ కణ్వాత్రి వాసిష్ఠ వల్మీకజవ్యాస జాబాలి గర్గ్యాద్యనేకర్షిసంఘాత సంస్తూయమానా మహోదార హేమాద్రిధీరా యకూపారగంభీర ధారాధరాకార నీదివ్యలీలావతారప్రభావంబు లెన్నంగ నెవ్వారికిన్ శక్యమే ధీరులై వేదవేదాంతవిజ్ఞాన వైరాగ్య సంపన్నులై నిర్గుణత్వంబునన్ యోగిచంద్రుల్ పృథివ్యంబు తేజో మరుద్వ్యో మయంబైన సర్వప్రపంచంబునంగల్గు భాస్వచ్చర స్థావరాకారము ల్నీదు రూపంబులంచు న్మది న్నిన్ను సంప్రీతితోఁ గాంతురో స్వామి జాంబూనదంబొక్కఁడైయుండి నానావిధానేక భూషాకృతిన్ లీల వర్తించుపోల్కిం బరబ్రహ్మమైయుండి నానావిధాకారము ల్దాల్చి వర్తింతు వోదేవ నీసద్గుణంబు ల్నుతింపంగ శేషాదులుం

జాల రెన్నంగనే నెంత వాఁడం బ్రమత్తుండ యుష్మత్కృపాపాంగ
వీక్షాతిరేకంబునఁ దివ్యసందర్శనంబిచ్చి రక్షింపు మీశా నమస్తే
నమస్తే నమః. 105

వ॥ అని వినుతించుచున్న సమయంబున. 106

సీ॥ తొలుదొల్తవినవచ్చె జలజాక్ష శౌరి శ్రీ
హరి భక్తమందార యనుపలుకులు
వరలెనాపిమ్మట సరిగమపదనిస
యనుచు వీణాధ్వను లమితముగను
దనరారె బ్రహ్మసత్యం జగన్మిథ్య బ్ర
హ్మైస్మ్వాహ మనుపల్కు లావెనుకను
నంతట దైతేయకాంతార దావపా
వక జయజయయను పలుకులలరె॥
వేగఁ బొడగానవచ్చిరి భాగవతులు
దొల్త నాపిమ్మటను నారదుండు వెనుక
పరమహంసలు నావల వందిమాగ
ధాదులును వచ్చిరత్తరి సాదరముగ. 107

సీ॥ నీలమేఘచ్ఛాయనేలు దేహముతోడ
రాజత్సువర్ణాంబరంబుతోడఁ
బూర్ణశీతాంశునిఁ బోలువక్త్రముతోడ
రాజీవసదృశ నేత్రములతోడ
మకరకుండల మణిమయ విభూషలతోడ
వినుత శ్రీవత్స లాంఛనముతోడఁ
గౌస్తుభరత్న సంకలిత వక్షముతోడఁ
గరముల శంఖ చక్రముల తోడ॥
సరస శ్రీ భూమి నీళాది సతుల తోడ
నతిజవంబైన గరుడవాహనముతోడ

సకల వైకుంఠపురవాస జనముతోడ
నాదినారాయణుండు ప్రత్యక్షమయ్యె. 108

గీ॥ అట్లు ప్రత్యక్షమైన నారాయణునకుఁ
బర్వతాధినాథుండు సద్భక్తిపూర్వ
కముగ సాష్టాంగయుత నమస్కారములొన
రించి వేడ్కతో నతని నుతించెనిట్లు. 109

కవిరాజవిరాజితము.

జయ సురపోషణ శాత్రవభీషణ సద్గుణభూషణ శైలధరా
జయ జలజేక్షణ సర్వవిలక్షణ శౌర్యవిచక్షణ సాధువరా
జయ నతపాలన సజ్జనఖేలన షడ్గుణమేళన శంఖకరా
జయ రిపుసూదన శక్రవినోదన సద్గుణవాదన చక్రధరా. 110

గీ॥ నీదుపాదోదకంబును నెమ్మితోడ
మచ్చిరంబునదాల్చిన మహిమవలన
దురితముక్తుఁడనై బవిత్రుండనైతి
నంబుజేక్షణ శౌరి దయాసముద్ర. 111

గీ॥ అవధరింపుము దేవ మహానుభావ
శివుఁడు బెండ్లికై తర్లివచ్చినను నీవె
యతనికిని జేయఁదగిన సత్కృతులొనర్పఁ
జాలుదని నిన్ను వేడితి సదయ హృదయ. 112

వ॥ అనిన నారాయణుం డతిమోదితుండై హిమవంతునింజూచి పార్వతి, మత్సహోదరీసమానగాన నీవింత వేఁడవలయునేయనినంత, హిమవంతుం డతికుతూహలంబున శ్రీమన్నారాయణునకుఁ బునః పునఃప్రణామంబు లాచరించి నిజగృహంబునకుఁ దోడుకొనిపోయి యాతని నెక్కహర్మ్యంబున నివసింపఁజేసి సంతసంబున నుండెనని యెఱింగించిన సంతుష్టాంతరంగుండై ధర్మనందనుం డఁటమీఁది వృత్తాంతం బెఱింగింపుమని మార్కండేయమహాముని నడుఁగుటయును.

క॥ క్షితిజాధీశ్వర శుభకర। నతజనమందార మేరునగవరధీరా
ప్రతిజనమనోజ్ఞసదనా। గతకల్మషచయ దశాస్యగజ పంచాస్యా. 114

శా॥ పంకేజాప్త కులాబ్ధిచంద్ర మునిహృత్త్వం కేజసారంగ స
త్వంకేజాసనవందితాంఘ్రివిలసత్వం కేజ సీతాధిపా
లంకేశాన్వయకాననజ్వలనకీలా భక్తజాలావనా
యోంకారాంచిత రత్నపంజరశుకా యోగీశలోలాత్మకా. 115

మత్తకోకిల.

గర్వితాహితభీషణా సురకంటకాన్వయశోషణా
శర్వసన్నుత కామసుందర శంఖసన్నిభకంధరా
సర్వనిర్జరనందితా జలజాతసంభవవందితా
పార్వణేందునిభాననా నతపాలనా మునిఖేలనా. 116

గద్యము॥ ఇది శ్రీపరమేశ్వర కరుణాకటాక్ష సమాసాదిత సహజపాండిత్య
సరసకవితాధురంధర ఘనయశోబంధు రాపస్తంభసూత్ర
భారద్వాజగోత్ర పేరూరుద్రావిడ శ్రోత్రియ
బ్రాహ్మణార్య సోమయాజి కులజలధిజైవాతృ
కారుణాచలేశ్వర తనయ నయగుణవిధేయ
లక్ష్మీనారాయణనామధేయ ప్రణీతంబైన
శివకథా సుధారసంబను మహా
ప్రబంధంబునందు
షష్ఠాశ్వాసము.



శ్రీ పరమేశ్వరార్పణమస్తు.

శ్రీరస్తు.

శ్రీరామాయనమః.

శ్రీమహాగణాధిపతయేనమః.

శ్రీ శా ర దాం బా యై న మః.

# శి వ క థా సు ధా ర స ము.

## స ప్త మా శ్వా స ము.



జానకీమనోహర। రాజీవదళాయతాక్షరవితేజ మహో
రాజా వదనపరాజిత। రాజా రూపజిత రాజరాజ తనూజా.

వ॥ దేవా యవధరింపుము మార్కండేయమహామునీంద్రుండు ధర్మనంద నున కిట్లనియెఁ దివృత్తాంతం బిట్లనియె నట్లు సుఖంబున నగేంద్రుండును బంధుపురోహి తామాత్య బృందంబులు బరివేష్టింపఁ గొలువుండి. 2

గీ॥ అంతదైవజ్ఞవరులను నతిముదమునఁ
జేరరావించి కాంచనచేలములును
గప్పురపు వీడెములనిచ్చి కలుషరహిత
మైన శుభముహూర్తముఁ జెప్పుఁడనఁగ వారు. 3

వ॥ ఇంచుక తడవుమదిఁ బరీక్షించి శుభలగ్నంబు సమీపించెంగావునఁ బెండ్లికుమారుని రప్పింపుఁడని యెఱిఁగింపనంత నగేంద్రుండును, సకలకళాపారంగతులగు భూసురుల రావించి సర్వేశ్వరునిఁ దోడుకొని రా నియమింప నట్లకాకయని వారునుఁ బనివిని రిఁట సురేంద్రుపం పున. 4

శా॥ అంతం గొండదలు పాపపూపజవరాం డ్రవ్వేల్పుపూఁబోండ్లున
త్యంతామోదము స్వాంతరంగములలో నాక్రమేడితంబై దగం
గంతుద్వేషికి మంగళోచిత మహాస్నానంబుఁ గావింపగాఁ
గంతూత్సృష్ట లతాంత మోహనశరౌఘంబో యనం డాయుచున్. 5

సీ॥ సరగుననేతెంచి సంపెంగనూనెచేఁ
దలయంటె వేడ్కతోఁ గలికియొకతె
నయముగా పన్నీట స్నానంబుగావించి
తడియొత్తెఁ గొంగుచేఁ దరుణియొకతె
కుటుల చిక్కెడలించి కర్పూరి నగరుధూప
వాసనబట్టించె భామయొకతె
యొకచెంపకొరుగంగ సికయోరగావేసి
పూవుటెత్తులుజుట్టెఁ బొలఁతియొకతె॥
చిఱుతవన్నియగల చేలముల్గట్టంగ
నిచ్చె నొకతె యొకతె యొలమితోడ
భూషణములుదొడిగెఁ బొరినొక్కతె కలపం
బులనుబూసె నాగభూషణునకు. 6

వ॥ అట్టియెడ. 7

గీ॥ ఔచితిం గనుఁగొన నిల్వుటద్దమందు
నవ చతుర్విధాలంకరణములఁగాంచి
డెందమందున నానందమొంది యిందు
శేఖరుం డుండెసౌధాగ్రసీమ యందు. 8

వ॥ అంత. 9

గీ॥ పర్వతేంద్రుని యానతివడసి విప్ర
వరులు జనిమహాదేవుని చరణములకు
నతులొనర్చుచు దేవ! మీ రతిరయమున
నచటికరుదేరుడని దెల్పి రంతలోన. 10

క॥ కరిఛాగమహిష మర్త్య మ। కర హరిణహయాదివాహకములెక్కివడిన్
హరిశిఖియమాశరవరుణ। మరుద ర్థేశ్వరులు సంభ్రమంబునఁగొల్వన్.

గీ॥ సురలు గ్రహములు బాసవాల్దొరలు భోగి
వరులునునదీశులును నరవరులు ప్రమథ
వర్గమును గొల్వ భారతీపతియు సప్త
ఋషులు ముందఱనడువంగ నెలమితోడ. 12

గీ॥ సరస బలువాద్యములు మ్రోయ సర్వసురలు
పుష్పవర్షంబుగురియింప భూసురాళి
కరముదీవింప నచ్చరల్గలసియాడ
వృషతురంగంబుపై నెక్కి వెడలెశివుఁడు. 13

సీ॥ ఓహోహాహో యచలధరోజ్జ్వలుం డీతఁడా?
యవునవు నీతఁడే యంబుజాక్షి;
యవురౌర పుణ్యజనవరాప్తుఁ డీతఁడా?
యవునవు నీతఁడే యలరుఁబోఁడి;
యహాహా యనంతగుణాఢ్యుఁ డీతండటే?
యవునవు నీతఁడే యబ్జవదన;
విషమాంబకోద్ధత విగ్రహుండితఁడటే?
యవునవు నీతఁడే హంసగమన;॥
యనుచు నన్యోన్యపరిభాష లాడుచుండి
యధికమోదమ్మున నివాళు లమితముగను
బట్టు తత్పౌరయువతుల వంకఁగనుచు
శంకరుఁడువచ్చుచుండె నుత్సాహముగను. 14

ఆ-వె॥ శివునిచెంతకేగి శీఘ్రంబుగాఁబిల్వఁ
డనుచుఁ దండ్రిపనుప నతిరయమునఁ
బాదచారులగుచు వచ్చిరి మైనాకుఁ
డతనిసోదరుండు నభవుఁ గనఁగ. 15

వ॥ అంత. 16

క॥ అన్యోన్య భాషణంబుల। నన్యోన్యాలింగనముల నతివేడుకతో
నన్యోన్యమైత్రినగమూర్ధన్యునితనయులునుశివుఁడుదనియుచునుండన్.

ఉ॥ వందిజనంబు లంతఁ గయివారముసల్పుచునుండ నప్సరో
బృందములాడ తాపసులు వేడుకతోడనుఁగొల్వఁగా శతా
నందుఁడుముందఱన్నడువ నాకులుసన్నుతిఁచేయుచుండ బా
లేందుధరుండు స్యాలకుల యిద్దఱిమధ్యను నొప్పె నెంతయున్. 18

మ॥ అకలంకప్రతిభాన్వితుండగు శివుండమ్మాడ్కిరా నంతలో
వికచాంభోరుహపత్త్రలోచనుఁడు సప్రేమంబునం బత్నినా
యకవాహుండయివచ్చి నెయ్యమున వియ్యంబంచు వావేర్పఱిం
చి కడు న్మేలములాడఁగా నతఁడొనర్చె న్మేలము ల్వేడ్కతోఁ. 19

గీ॥ అంత నుదయాద్రిడిగిన భాస్వంతుఁడనఁగ
వృషతురంగంబుపైనుండి పృథ్వికిడిగి
కృత్తివసనుండు విష్ణుని గేలుపట్టి
కుడిపదము మున్నుగానిడి గడపదాఁటె. 20

వ॥ ఇవ్విధంబున నభ్యంతర కక్ష్యాంతరంబులుదాఁటి పౌరపుణ్యాంగనాది విహిత నీరాజనమంగళోపచారుండై బంధుజన పురోహిత బ్రాహ్మణపురంధ్రీ నికురుంబ పరంపరావేష్టితంబైన వివాహమంటపంబు చేరంజనుదెంచి సకలవాద్యములుమ్రోయ దూరంబున నెదురుగావచ్చు పర్వతాధీశ్వరునకు నభివందనంబాచరించి బ్రాహ్మణమంత్రాక్షతలు శిరంబునఁదాల్చుచు సమున్నతకనకాసనంబున నాసీనుండై యుండెనంత, 21

గీ॥ పటహ ఢక్కాది వాద్యము ల్ప్రబలిమ్రోయు
చుండఁగఁ బురోహితుండగు కాండజాస
నుండు యజ్ఞోపవీతంబు నిండువేడు
కలర శివునకొసంగె న య్యవసరమున. 22

వ॥ అఁటమున్న కన్యాంతఃపురంబున విప్రపుణ్యాంగనలు సర్వమంగళను రావించి ముత్యాలచవికెం గూర్చుండఁబెట్టి నిజకులాచారసరణి జలకంబార్చి తడియొత్తి తదనంతరంబ పసిఁడిపీఠంబుననివసింపఁజేయఁ బ్రౌఢసైరంధ్రికాజనం బతిప్రయత్నంబున న ప్పురంధ్రీరత్నంబున కలంకరింపఁదొడంగి రట్టియెడ. 23

సీ॥ ఒకలతాతన్వి మేచకకచశ్రేణికి వాసనాయుక్త ధూపంబొసంగె
నొకకుటిలాలక ప్రకటంబుగా లలాటమునఁ గస్తురితిలకము నొనర్చె
నొకవరవర్ణిని వికచాబ్జసదృశ నేత్రములకు నీలాంజనము ఘటించె
నొకకలకంఠి నాసికకు స్మరగుళికాశరపుఁబోలు ముంగరనునిడియె॥

నొకవధూటి కర్ణంబులకొప్పగాను
రత్నతాటంకములుబెట్టె రాజితముగ
నొకవిలాసిని గళమున నొప్పమీఱ
గండళితకంఠసరినుంచె నందముగను॥ 24

సీ॥ వక్షస్థ్సలంబునఁ బద్మరాగపతాకమునుఁ గదియించెను ముగుదయొకతె
జఘనసీమంబున జాతరూపమయ మేఖలఁగట్టెఁ గలకంఠకంఠి యొకతె
కరసరోజములకుఁ గాంచనరత్నకంకణములనిడెఁ దమ్మికంటి యొకతె
యడుగుకెందామరలందునఁగ్రొత్తలత్తుకను హత్తించెనుసకియయొకతె॥
మఱియుఁ బ్రత్యంగములయందు మగువలెల్ల
పారిది చెందిరములు జేరుచుక్క చిన్ని
పువ్వుతేకులు మకరి కాభూషణములు
గంకణంబులు కేయూరకములమర్చ. 25

వ॥ ఇవ్విధంబున నవ చతుర్విధాలంకారభూషితయై యమ్మహాదేవి కరాం
బుజంబులు ఫాలతలంబునఁగీలించి విప్రపుణ్యాంగనల కనేకవందనంబు
లాచరించి వారలచే దీవనలంది యున్నసమయంబున. 26

క॥ లలనాలలామ లల మం
గళరవములు జెలఁగుచుండఁ గడువేడుకతోఁ
గులదైవతమును రయమున
నిలిపి నగజఁ బూజనలుప నియమించి రొగిన్. 27

గీ॥ అంతఁ బూజాంతమందు సమంచితముగ
విప్రపుణ్యాంగనలుగూడి వేడుకలర
పెండ్లిపాటలుబాడఁగ వివిధవాద్య
ములునుఁగాహళధ్వనులును జెలఁగుచుండ. 28

క॥ బాలికఁగిశోరశశిబిం। బాలికఁ గచహసితమధుకరాళికఁ దరుణీ
చూలిక నప్పుడు గట్టుల। మేలిక పిఱపింప మిగుల శృంగారముతోన్.

క॥ ముత్తైదువ లత్తఱిఁగడు। ముత్తములై దత్తఱమున ముత్తెఁపుగంపన్
బిత్తరినిడి దెచ్చిరిదమ। చిత్తములలరార మిగుల శీఘ్రముగాగన్. 30

గీ॥ ప్రాణవల్లభ భర్మపాత్రంబుతోన
నీరములువ్రాయ శివునిపన్నీరజములఁ
గడిగి హిమవంతుఁడత్యంతకౌతుకమునఁ
బరగవిధ్యుక్తముగమధుపర్కమొసఁగె. 31

క॥ అమరుల్మెచ్చఁగ నతిసంభ్రమమున శుభలగ్నమం"దిమాంకన్యాం తు
భ్యమహంసంప్రదదే"యని హిమవంతుఁడు ధారఁబోసె నీశున కార్యా.

సీ॥ పద్మరాగమణిప్రభా భాసమానమై
యలరారుచున్న హేమాంగదములు
మహనీయతర శుద్ధమౌక్తికరత్నశో
భితమైనయట్టి గ్రైవేయకాళి
మరకతేంద్రోపల మాణిక్య సురుచిర
మండితమకర సత్కుండలములు
పుష్యరాగాశ్మ సంపుటితోజ్జ్వలప్రభా
కలితమై దగు హస్తకటకములును॥
పవనభుగ్భుజగ్మణీ భుక్తిపాత్రములును
వజ్ర గోమేధికాది విభ్రాజమాన
చారు రత్నసంఘటితకోటీరమును నొ
సంగె జామాతృనకు గిరిచక్రవర్తి. 33

సీ॥ ఋభులోకరత్నంబు నీసడించెడురత్న
హస్తముద్రికలు శ్రీహరియొసంగె
గామితార్థంబులఁ గడువేగమొసగూర్చు
మందార దామము ల్మఘవుఁడొసఁగె
బహుతరామూల్య సంభావితంబైన ది
వ్యాంబరజాలంబు ననలుఁడొసఁగె
నఖిలాహితాస్త్రశస్త్రా భేద్యమైన క
త్తళమును వేడ్కతో ధర్ముఁడొసఁగె,
రాక్షసేశుఁ డుదిరిపల్లెరంబు జలధి
భర్త పీటికాపేటియుఁ బవనుఁ డఖిల

పరిమళద్రవ్యములు ధనపతి విమాన
మును నొసంగిరి శివునకు ముదముతోడ. 34

గీ॥ బ్రహ్మబ్రహ్మాసనంబును వనధివరులు
భోగికులులును దిగ్గేశభూపసుతులు
భూరి చతుర్విధాలంకారములును మాను
లపుడు దీవన లొసఁగి రయ్యభవునకును. 35

వ॥ మఱియుఁ దక్షిణవారును యథోచితంబుగాఁ గానుకలొసంగిరి. 36

గీ॥ ఎలమిఁ దనువేడువారల కెల్లకామి
తార్థములొసంగు చంద్రఖండావతంసుఁ
డట్టియెడఁ దనకెల్లను నమితముగ నొ
సంగువానిని గైకొనె సంతసమున. 37

శా॥ ఆరీతిన్ భువనత్రయీనిలయు లత్యంతప్రమోదాత్ములై
యా రాజార్ధవరావతంసునకు దివ్యానేకము ల్కానుకల్
వేరె ట్లొక్కరికన్న నొక్కరొసఁగన్ బ్రీతాత్ముఁడౌనంతలోఁ
బేరంటాలొకకాంత, గౌరిచెయి నిల్పెన్ శంభుహస్తంబుపై. 38

గీ॥ అమరధేనువుసంబంధ మైనదధియుఁ
గదళికాఫలంబులుఁ దేనెఁగలిపియపుడు
పసిడిహరివాణమునఁ బెట్టి భవునకెలమి
విధియుతంబుఁగనొసఁగెఁ బృథ్వీధరుండు. 39

క॥ అంతటబంధుజనములు। త్యంతము సంతసముతోడ నా సత్కన్యా
కాంతులనడుమను దెఱనిడి। రెంతయుఁగౌతుకమువారి కెదనుప్పొంగన్.

ఉ॥ అత్తఱి గౌరిచక్కఁదన మచ్చరలెల్లను జూచి చూచి హా
మెత్తుముమున్ను నూర్వసిని మిక్కిలిచక్కనిదంచు నిప్పుడీ
బిత్తరిచెల్వుచెంగటను బ్రేటువడె న్మనమేటిచెల్వటం
చెత్తిన మోముదామరల నేడ్తెఱలే కరవాంచి రందఱున్. 41

గీ॥ కావలయు నీరిచెలువంబుగనఁగ వేయి
కన్నులని చూపఱులనంగఁ గాదు రెండు

వేలుఁగావలెనన వ్రజి చాలవు పది
వేలుగావలెననెఁ గాద్రవేయ విభుఁడు. 42

క॥ అప్పుడు తూర్యారావము
లొప్పఁగమిథునమ్ము వేడ్కలుప్పతిలంగా
నెప్పుడుదీయుమరో తెలి
నెప్పుడుచూతుమొయటంచు నెంచుచునుండన్. 43

మ॥ తొలుదొల్తన్నెఱిగొప్ప వెన్కమొగముం దోడ్తోడఁబాలిండ్లు నా
వలమధ్యంబుఁ బదంబులాపయినిఁ గన్పట్టెం గ్రమంబొప్పఁగా
జలధిం బెందెలఁ బుట్టు లోకజననీసామ్యంబుఁగా నప్డు బం
ధులు జూడుం డితరేతరంబని తెలిం ద్రోయంగఁ గామారికిన్. 44

గీ॥ అప్పు డాతనిచెలువంబు తెప్పలిడకఁ
జూచి గిరిసుత మదిలోనఁజోద్యమంది
భళిర; కలవాణిచెప్పిన వాక్యమునకు
మించియుండెనటంచును మెచ్చికొనియె. 45

గీ॥ అంత నామిథున పరస్పరావలోక
నము లెదుఱుకోలుగావించె నయముగాను
వికచకమలాక్షియొక్కతె వేఁగవచ్చి
యిరుఁగడల ముత్తియంపుఁ బల్లెరము లిడియె. 46

గీ॥ కొందఱైదువ లత్తఱి గుంపుఁగూడి
కనకమంగళసూత్రంబు ఘనతరముగ
యుగ్మరంధ్రంబులకుఁగట్టి యొనర దత్స
లిలముఁ జెలిపైనిఁ బడునట్లు చిలికి రెలమి. 47

వ॥ అంత. 48

క॥ పొలయల్క వేళఁ బలెకో। మలవదన మొకింతయెత్తి మంగళసూత్రం
బల సర్వమంగళా మం।గళ గళమునఁగట్టె శివుఁడు కౌతుకమతియై.

గీ॥ సురలు బుష్పవర్షంబులు గురియుచుండ
మౌనులాశీర్వదింప సంభ్రమము దెలుపు

నట్టియెడల దంపతులను మెట్టుఁబ్రాల
పుటికలను గదియించిరి పువ్వుఁబోండ్లు. 50

గీ॥ అంతఁ దమతమవార లత్యంతముదము
నొంది నీచెయి మీఁదుఁగా నుండవలయుఁ
జుమ్మియని హెచ్చరింపఁగా సోమఖండ
భూషణుఁడు ముందుఁ దలఁబ్రాలు వ్రాయఁదొడఁగె. 51

చ॥ నడుమువడంకఁగా వళులునాట్యముసేయఁగఁగంకణధ్వను
ల్వడికొనిమ్రోయఁ దారకలుబైకనుఁజెప్పలనంట మీఁదికి
న్నొడనిగిడించి ముత్తెములు మెల్లన దోయిట నించినించి యు
ప్పడఁతి మహేశుమాళిఁ దలఁబ్రాలనుఁబోసెను లజ్జ తొట్రిలన్. 52

గీ॥ మఱియుఁబ్రౌఢాంగనయొకర్తు మంజుభాష
ణముల మేలంబులాడుచును మిథునమును
గేలుఁగేలునుఁబట్టించి లీల వారి
చేలములు ముళ్లువెట్టెను బాళిమెఱయ. 53

గీ॥ పసిఁడిపళ్లెరములలోనఁ బద్మముఖులు
వేడ్కచేతను దీపముల్వెట్టి శివుని
ముందునొకటియుఁ బార్వతిముందునొకటి
యునిచిరత్తఱి శాస్త్రోక్తి ననుసరించి. 54

సీ॥ వెలఁదులుగొందఱు వీతిహోత్రునిఁదెచ్చి
నిలుపఁ బ్రదక్షిణంబులు సలిపిరి
సద్విజహుత శమీశాఖానినాదయు
తాశుశుక్షణి వేల్చి రాహుతులను
నొనరంగవీక్షించి రుడువీథినలరారు
యౌత్తానపాదిని నట్టులెత్తి
పరిణయంబునుఁజూడ వచ్చినస్త్రీప్రేక్ష్య
యా నరుంధతికి సాష్టాంగమెరఁగి॥
రఖిలసుర ముని విప్రపుణ్యాంగనాళి
మంగళాశీర్వచోయుక్త మహిమనలరు

మహిత మంత్రితాక్షతలను మౌళిఁదాల్చి
రగకుమారియు శంభుఁడ త్యాదరమున. 55

క॥ అట్టియెడ భావి రజతఁపు। గట్టుక్కనె లేదొ యనుచు గట్టిపరువఁగాఁ
గట్టడిఁజేసినవడుఁవున। మట్టించెను సన్నికల్లు మంజు పదము చేత. 56

క॥ ఇక్కరణిని నక్కొమ్మకు। ముక్కంటికిఁ బెండ్లిసల్పి ముద మెదఁబొదలం
గ్రక్కున బంధుజనంబులు। జక్కఁగఁ ద్రొక్కించిరపుడు సప్తపదంబుల్.

గీ॥ మోము నెగఁ బ్రాకునప్పుడు ముంగురుల వి
ధమునఁ జెక్కులనలరి మృగమదముగతి
హోమధూమంబు బాలపై నొప్పదనరె
లాజలను దోయిలించుచు లలన వేల్వ. 58

క॥ అంగనమది నీతిరున। దొంగిలి మొదననెడు జాడ్యదోషఁగ శివుఁడం
తంగడుదొంగ తెఱంగున। బంగరుపల్లెరముఁగొను చుఁబరుగునఁజనిరొత్.

క॥ నాగవలిఁజేసిరత్తటి। నాగేంద్రవిభూషణుండు నగజగళమునన్
వేగమునం గుతికంటును। బాగొప్పఁగఁగట్టెఁ గూర్మిబయలుఁవడంగన్.

గీ॥ ఎలమి బంధులు జీరె నుయె లగఁగట్టి
చందనపుబొమ్మ నొకదాని నందుఁబెట్టి
దంపతులను మంచంబుపైఁదనరఁజేసి
వారిపై నివ సంతంబు వడఁ జిలికిరి. 61

వ॥ అనంతరంబ నగరాజకులాభరణంబులగు మైనాక కోలాహలు లిరువంకఁ బెండ్లిచుట్టంబులకు విందులువెట్ట గట్టడిఁజేసి రట్టియెడ నందఱు నత్యుత్సాహంబున భోజనాగారంబుఁ బ్రవేశించి కరచరణ ప్రక్షాళనానసగండూషమజ్జనంబు లాచరించి తత్తత్ నిర్దిష్టంబులగు నుచితాసనంబులఁ గూర్చుండి రట్టియెడ. 62

చ॥ సకియయొకర్తు వేఱొకదెస నుండియొక్కతెతో మహావినో
దకలన మేలమాడుతటిఁ దామరసాక్షియొకర్తు వేడ్కతో
నకలుగఁ బొంచి పొంచి చరణంబులు మెల్లననూది యేగి యా
చకితమృగాక్షి ద్రుల్లిపడఁ జక్కిలిగింతలువెట్టె నవ్వుచున్. 63

వ॥ అయ్యవసరంబున. 64

క॥ కుందనపుఁ బళ్లెరంబుల । నందముఁగాఁబట్టి బాంధవానీకములం
దందఁ జతుర్విధములఁ బెం। పొందెడు నాహారసమితి నొగివడ్డింపన్.

సీ॥ కూరలు బచ్చళ్లు బూరె లప్పడములు
బాయసాన్నంబులు బంచదార
పానకంబునుఁ దేనె యానవాల్ ద్రాక్షా ఫ
లంబులుసూపంబు లడ్డువములు
గోధూమసేవికాగుచ్ఛము ల్తిమ్మనం
బొబ్బట్లుబూరీలు నూఱుఁగాయ
లునుఁ బిండిమిరియంబు సెనగపప్పునుఁ జూత
ఫలములు బనసపండుల తొలలును॥
బిండివంటలు మీఁగడ ల్కండచక్క
రయు ఘృతంబును జంబీరరసవిలగ్న
దధియు వడ్డింప నాత్రేమేడితంబుగాను
వలచిభుజియించె నిరుదెస బంధుజనము. 66

వ॥ అంత, 67

ఆ-వె॥ బంధుసమితియిట్లు భక్షించుచుండంగఁ
బర్వతేశ్వరుండు వడిగవచ్చి
పరగ నెల్లవారిఁ బలుమారువీక్షించి
తనప్రయత్న మపుడు దలఁచి తలఁచి. 68

గీ॥ అంతఁ జిఱునవ్వునవ్వి యత్యంతముదము
నొందిమదిలోన నివ్విధినూహఁజేసె
నహహా మనప్రయత్నంబు లత్యధికమయ్యె
నింక నివియన్నియు మిగులునేమొ యనుచు. 69

వ॥ ఇవ్విధంబున నూహించుచున్న యాతని మనంబులోనిచందం బారసి.

ఉ॥ అప్పుడు దంతివక్త్రుఁడు రయంబున భోజ్యపదార్థజాలము
ల్గుప్పున నొక్కరుండెగయికొంచు భుజింపఁగఁ జూచి శైలరా

జిప్పుడు గుజ్జువాఁడొకరుఁ డిగ్గతిఁజేసెను నింకమీఁద నే
చొప్పుననౌనొ? యంచు నెదఁ జోద్యము భీతియు లజ్జఁ బొందుచున్.

వ॥ ఉన్నయెడ. 72

క॥ గజముఖుఁ డిట్లు సమస్తము।
భుజియించుచునుండఁగాఁ ద్రిభువననివాసుల్
గుజగుజలు వ్రావువారును
గజిబిజిఁబడువారు నగుచుఁ గనుచున్నయెడన్. 73

గీ॥ చేయునదిలేక జూపడి చెన్నుఁదఱిగి
విన్ననైయున్న నగరాజుసన్నిధికిని
వచ్చి బంధు "లత్యుచ్ఛ్రియఃపతనహేతు"
వనెడు సామ్యంబు నుండివి రయ్యవసరమున. 74

ఆ-వె॥ ధైర్యశాలిగాన దైన్యంబువిడనాడి
పర్వతేశ్వరుండు భక్తితోడ
శ్రీరమాధినాథుఁజేరి సాష్టాంగవం
దనములను నొనర్చి వినుతిఁజేసె. 75

చ॥ సరసిజనాభ చక్ర దర శార్ఙ్గ గ దాసి ముఖాయుధ,
వర వరదా ముకుంద హరి పాపవిభంజన భక్తరంజనా
సురపతివందితాంఘ్రియుగ శోషితదానవవంశ కేశవా
పరమదయాసముద్ర భవబంధవిమోచన పద్మలోచనా. 76

క॥ సర్వజ్ఞ సర్వవందిత। సర్వేశ్వర సర్వరూప సర్వాధారా
సర్వాసురకులభంజన। సర్వాత్మక సర్వశుభద సర్వశరణ్యా. 77

క॥ ఎవ్వనిచే నొదవునుజగ। మెవ్వనిచేఁ బెంపబడు నదెవ్వనిచేతన్
నెవ్వఁబడునెల్లకాలం।బవ్వేల్పునిమహిమఁదలఁతునహరహమెదలోన్.

వ॥ అని యివ్విధంబున జగన్నాథుంధ్యానించి మఱియు నిట్లనియె. 79

గీ॥ విశ్వరూపుఁడవగు నీదువిభవ మల్ప
బుద్ధినగునేను వర్ణింపఁబూనుకొనుట
నరయఁగఁగుచేలుఁ డుత్తరీయమున హేమ
గిరిశిలలఁదాల్ప యత్నించుసరణి గాదె. 80

క॥ అని నగరాజవివిధమున
వినుతింప దయార్ద్రదృష్టివీక్షించి జనా
ర్దనుఁడాతనిభయముడుపుచుఁ
దనమదిలో నివ్విధమునఁ దలపోసెఁ దగన్. 81

గీ॥ అగకులేశుండు మిక్కిలిబెగడుచుండె
విఘ్నపుఁడు భక్ష్యములఁదినివేయఁదొడఁగె
నతనిఁగాదని యేపనినైనఁజేయఁ
గాఁ దలంచితిమేని విఘ్నములె దోఁచు. 82

ఉ॥ దండిగ లక్ష్మికై తొలుత దాహశరుండునులేక నొక్కఁడీ
తండె నను రణస్థలినిఁ దక్షణమేకబళించె నట్టిబ
ల్చండతరప్రతాపుఁ డతిసాహసవంతుఁ డజేయుఁడ ద్దిరా
గండరగండఁ డిప్డు డిదికాదన నింక నదేమిసేయుదు. 83

క॥ అని యివ్విధమున విష్ణుఁడు। ఘనబుద్ధింజింతఁజేసిక్షణకాలము నే
ర్పున నాతనిమదిగరఁగఁగ। వినుతించె న్మధురవాక్యవితతి వెలయఁగాన్.

చ॥ కరటిముఖాయ విశ్వజనకాయ నతౌఘసురద్రుమాయ భీ
కరతరవిఘ్నసాంద్రహిమకంజహితాయ శశాంకఖండశే
ఖరతనయాయ భక్తజనకామితసత్ఫలదాయకాయ ని
ర్జరవినుతాయ కిల్బిషహరాయ చరాచరమూర్తయే నమః. 85

ఆ-వె॥ అనుచు విఘ్ననాయకునకు సద్భక్తితో
నతులుచెక్కొనర్చి నలిననాభుఁ
డతనిపజ్జకరిగి యల్లన నొసలకుఁ
దెలియకుండ నిట్లు పలుకఁదొడఁగె. 86

క॥ పర్వతనాథుం డెత్తఱి। గర్వించుటఁగాంచి లెస్సఁగావించితి రా
గర్వమడఁగెఁగావున నీఁక। నిర్విఘ్నమొనర్పుమయ్య నిఖలస్తుత్యా. 87

ఆ-వె॥ అనిన సుప్రసన్నుఁడై యాతఁడిట్లనెఁ
బరమపురుష శౌరి హరి ముకుంద
నీవువేడుకతన నెమ్మనంబునఁబ్రీతి
పుట్టె విఘ్నమింకఁ బొసఁగదనిన. 88

క॥ కరిముఖుఁ డిత్తెఱఁగునఁ దెలు
పరమాద్భుతుఁడెలమిఁగని సుపర్వగవినెదన్
స్మరియించి దానితోడను
వర భక్ష్యపదార్థసమితి వడిఁ గూర్పుమనన్. 89

గీ॥ విని మహాప్రసాదంబని వేడ్కతోడఁ
గామగవిగాన నెవ్వరేకరణి వస్తు
సమితి గోరిన వారికాక్షణమునందె
జాలుఁ జాలు నన్నట్లు వర్షంబుఁ గురిసె. 90

వ॥ అయ్యవసరంబున. 91

సీ॥ పాయసాన్నంబు జంబాలంబుఁగా వర
శాకముల్ శైవాలసమితిగాఁగ
మోదకంబులు మీనుమొత్తముల్గాఁగ న-
ప్పడములు ఘనకచ్ఛపములుగాఁగ
విమలమానానవా ల్వేలినుగువులుగాఁగ
ఖండశర్కరలు సైకతముగాఁగ
ముద్గసూపంబుసొంపులు తీరములుగాఁగ
నతిరసంబులదొంతు లలలుగాఁగ॥
బిండివంటలు బుద్బుద విలసనముగ
నాజ్యధారాప్రవాహంబు లమితమగుచు
విమలశాల్యోదనంబుపై వెల్లివిరిసె
కామధేను కటాక్షంబు గల్గుకతన. 92

సీ॥ అమృతరసోపమంబైన పాయసమును జట్టు జట్టుమనంగ జుఱ్ఱి జుఱ్ఱి
కండచక్కెరతోడఁ గలపినయానవా లత్యధికంబుఁగా నాని యాని
చెన్నొందుబచ్చళ్లు జిహ్వాగ్రముప్పుడుదీఱ నడిమివ్రేలునదీసి నాకి నాకి
మోదకంబులునుశాల్యోదనంబులుగడుమిక్కుటమగునట్లుమెక్కి మెక్కి॥
యతిమధురమైన లడ్వాలు నతిరసప్ర
ముఖ చతుర్విధాహారముల్ సుఖతరముగ

గడఁగిభుజియించి రత్తఱేఁ గడుపునిండ
ముజ్జగంబులవారలు ముదముతోడ. 93

క॥ అయ్యవసరమునఁ గొంఱు
జయ్యననిలువఁబడఁబోయి చదికిలఁబడుచుం
జెయ్యాది లేచువారును
నెయ్యరకే లూఁతఁగొనుచు నిలఁబడువారుఁ. 94

వ॥ అయి రేబవల్లునిట్లుభుజింయించుచుండి రంత నగేశ్వరుండును వారల కు గప్పురపువీడ్యంబులును జాంబూనదాంబరాద్యలంకారంబులు నొసంగెఁ జంద్రశేఖరుండునుఁ బార్వతీపరిణయోత్సవం బివ్విధంబున ననుభవించి నిజపురోహితప్రవరుఁడైన కమలజాసనుండు బ్రహ్మానసంగతికిఁ దగినమంగళోపచారమొనరింప నంగీకరించె నట్టియెడ హిమవంతుండు జామాతను మద్దుకూఁతు నంపకము వెట్టుటకై బడవాండ్లనియోగించి స్నేహ మోహ విషాదంబులఁ గన్నులబాష్పాంబుకణంబులు వెల్లివిరియ భార్యయుం దానును గౌరీనిలయంబునకరిఁగి తారకామధ్యంబునఁ దేజరిల్లు శశిరేఖయుంబోలె సఖజనపరివేష్టితయగు నద్దేవిం దొడలపైఁ గూర్చుండఁ బెట్టికొని మూర్ధాఘ్రాణంబొనరించి చుబుకంబుఁ బుణికి చెక్కిలిముద్దుఁగొని గద్గదకంఠంబున నిట్లనియె. 95

సీ॥ పతిదైవమనినమ్మి భక్తితోఁగొలువుము
కోపంబుమదిలోనఁ గుదరనీయ
కెన్నఁడు మేలును మన్నించు ముబ్బకు
మగఁడుగావించిన మన్ననలకు
క్షణమైనవిడనాడకనుఁ గుంకుమంబునుఁ
బసపునుఁ దాల్పంగవలయుఁజుమ్ము
పుట్టినింటికి నద్దుబెట్టినింటికిఁగూడ
వేడుకతో వన్నెఁబెట్టవలయు॥
నవనివిబుధ వరాభ్యాగ తార్థికోటి
నాప్తబంధు జనములట్లు లాదరింపు

మెలమి గురుభక్తిమరువకు మెప్పు విభుని
చిత్తమెఱిఁగి వర్తింపుమా చిన్నితల్లి. 9

వ॥ అని యివ్విధంబున బుద్ధులఁ జెప్పుచుండ మేనక యిట్లనియె. 9

సీ॥ పతిమేలుకోనువర కతని కాదర్శంబుఁ
జూపిపిమ్మట మోముఁజూపవలయు
భృత్యులయెడమాయ వెలయింపఁజేయక
నాప్తులకై వడి నరయవలయు
విట నట వ్యభిచారి భిక్షుకీ యోగినీ
మంత్రాంగనలపొత్తు మానవలయు
బురుషునాజ్ఞనులేకఁ బుట్టినింటికొకర్తు
యేగఁగూడదటంచు నెఱుఁగవలయు॥
విభుఁడుబరదేశమేగిన వెలఁదియతని
మేలుగోరుచు శుభదేవతాళిపూజఁ
జేయుచుండఁగ వలెమదిఁ బాయకుండ
భక్తితోనాతఁ డరుదెంచు వరకుఁదల్లి. 98

గీ॥ మగువపుట్టింటివారు సమ్మతిగలక్ష
వేలవరహాల నొసఁగిన వెలఁది బుద్ధిఁ
గలిగి మెలఁగకుండినఁ బ్రేమకలుగఁబోదు
గాన గర్వంబుఁబడరాదు కన్నతల్లి॥ 99

వ॥ అని పతివ్రతా లక్షణంబు లెఱిఁగించెనంత గౌరియు స్నేహ మోహ
విషాదంబులు పెనఁగొన వందనం బాచరించి వారల కిట్లనియె. 100

గీ॥ ఇంతకాలంబు నామది నెంతసంత
సంబు సాగరవీచుల చందముననుఁ
బొంగుచుండెను నేడంత బెంగదోఁచె
నకట మీకు నా కెడగల్గు ననుకతమున. 101

గీ॥ ఎలమినన్నెప్పు తోడ్తెత్తురిటకు మఱియు
నేనుహాయిగ మీకడ నెన్నఁడుందు

ననుచుమోము దామర వాంచియశ్రుపూరి
తాక్షియైయున్న తనయ కిట్లనియెగురుఁడు. 102

గీ॥ ఇపుడు నీవల్లభునితోడ నెలమినేగి
నీదుకడుపార బిడ్డల నెమ్మిఁగాంచి
వరలుచుండినయెడ నేనువచ్చి యిటకు
నిన్ను నీవిభుఁ డోడ్తెత్తుఁ గన్నతల్లి. 103

వ॥ అనిన మేనక యిట్లనియె. 104

గీ॥ అమ్మనీవు నాగర్భంబు నందునుండి
యవతరించినకతన ధన్యాత్మనైతి
మున్ను నేఁజేసినట్టి నోములు ఫలించె
నన్వయమువన్నెఁగనె నీశుఁడల్లుఁడయ్యె. 105

గీ॥ కాన మనకిప్పు డుత్సాహకాలమయ్యె
నిట్టితఱి నీవు కంటనీరిడఁగఁదగునె?
నీ విభుఁడు సర్వసురవందనీయుఁ డీవు
నంతదానవె నాతల్లి! చింత యేల? 106

వ॥ అని యివ్విధంబున బుజ్జగించిన ధైర్యంబూని గౌరి జననీజనకులకుఁ బునః పునః ప్రణామంబు లాచరించి వారలచే దీవనలంది మెల్లన నచ్చోటువాసి ఛాయాద్వితీయయై యుపవనంబునకుంజని కనికరము ప్పతిల్ల నిట్లనఁ దొడంగె. 107

ఉ॥ సాలములార చంపక రసాలములార తమాల మాలతీ
జాలములార పూగ పనస క్రము కామ్ల కదంబ నింబ హిం
తాలములార వీరతరు తాలములార నమేరు జాతి త
క్కోలములార నాపయినిఁ గూరిమియుంచరె పోయి వచ్చెదన్. 108

సీ॥ మందార జంబీర మాలూర తరులార
పోయివత్తు ననుజ్ఞనీయుఁ డెలమిఁ
నారంగ కేతకీ నారికేళములార
పోయివత్తు ననుజ్ఞనీయుఁ డెలమి

కుటజ కురంటక కోవిదారములార
పోయివత్తు ననుజ్ఞనీయుఁ డెలమి
ఖదిర జంబూ వట కర్ణికారములార
పోయివత్తు ననుజ్ఞనీయుఁ డెలమి॥
కురువ కాశోక కదళికా తరువులార
పోయివత్తు ననుజ్ఞనునీయుఁ డెలమి
తిలక పాటలీ ప్రేంఖణాదికములార
పోయివత్తు ననుజ్ఞనునీయుఁ డెలమి. 109

గీ॥ చంద నామ్లాతకీ పారిజాత సింధు
వార మాతులుంగ లవంగ వంశ వకుళ
గుగ్గులామ్రాత ఖర్జూర కుజములార
పోయివత్తు ననుజ్ఞనునీయుఁ డెలమి. 110

గీ॥ సహచరిగనాదు హృత్సరోజంబునందు
దలఁచి కంటికిఱెప్పచందమున నిన్నుఁ
బ్రోచుచుండెడిదాననుఁ బోయివత్తు
నింక లుంగమా! యానతి నీయవమ్మ. 111

ఉ॥ ఉల్లముపల్లవింపగను నెక్కనిమేషముమాత్రమైన మీ
కెల్లర కెట్టిలోపముల నించుకయైనఁ బొసంగకుండనా
పిల్లలభంగిఁ బ్రోచితిని వేడుక నిప్పుడు బోయివత్తునో
మల్లియలార! మీరలు సమాహితమొప్ప ననుజ్ఞనీయరే. 112

గీ॥ నీకుఁబున్నాగవరునకు నెమ్మితోడఁ
బెండ్లిగావించి ముదముచే వెలయునాకుఁ
బరగవిడనాడి పోయిరావలసెనిన్నుఁ
నేలకీవల్లి! యిఁక నాజ్ఞనీయవమ్మ. 113

క॥ అని యనివారిత శోకం
బునఁబొగులుచు మ్రానిమ్రానిఁ బొడఁగని భూభృ
త్తనయ దగవానినటవీ
డ్కొనుచుం జని ముందఱఁగనుఁగొనె నొక సరసిన్. 114

వ॥ కని డాయంజని యిట్లనియె. 115

ఉ॥ పయ్యెరకుట్టినంపి శ్రమవాపుచు హంసనినాదవాక్కుల
న్వియ్య మటంచుఁ బిల్చుచును వేడుకతోడిగి కేళిసల్పు న
న్నయ్యొలలీల వీచికలనూచెడి నిన్నెడఁబాసి యింక నే
నయ్యయొ పోయివచ్చెద మహాకృపనుంచు సరోవరేందిరా. 116

సీ॥ భృంగసంఘాతసంవృత సారసములార
పరగ నాతోఁగూడి వత్తురమ్మ
నిష్యందమకరంద నీలోత్పలములార
పరగ నాతోఁగూడి వత్తురమ్మ
భూరివాసనలీను పుండరీకములార
పరగ నాతోఁగూడి వత్తురమ్మ
గురువాయుకంపిత కోకనదములార
పరగ నాతోఁగూడి వత్తురమ్మ॥
క్రౌంచసంఘంబులార సారసములార
చక్రవాకంబులార హంసంబులార
బకములార కారండవ ప్రముఖలార
చిత్తమలరంగ ననుఁగూడి వత్తురమ్మ॥ 117

వ॥ అని యివ్విధంబున నడుగుచుఁ జనిచని విహార మందిరంబున కరు
దెంచి నెచ్చెలులుం దానును బెంపుడు కీరంబు లున్నయెడకుంజని. 118

చ॥ అనిశము రామనామ పరనామృతపానముచేత వీనులం
దనియఁగఁజేయుచుండఁగ ముదంబునఁ జక్కెరమేపి బ్రోచుదా
నను మిము రాజకీరకుల నాయకరత్నములార! బోయివ
త్తునిఁకను మీరు నాపయనిఁ దోరపువేడ్క ననుజ్ఞనీయరే. 119

గీ॥ మీకుఁ గరతాళగతులచే మేల్మితోడ
నృత్యవైఖరులెల్లను నేర్పుచుండు

దాన నూమయూరములార! దయ ననుజ్ఞ
నీయరే పోయివచ్చెద నింకనిపుడు. 120

గీ॥ శారికా పిక జాలంబులార భృంగ
సముదయములార హరిణసంచయములార
పరగఁ బోయివత్తును గూడ వత్తురమ్మ
యేలవత్తురు నాతోడ? నెలమినుండి. 121

వ॥ అని పలుకుచు నెట్టకేలకు సఖీప్రయత్నంబున ధైర్యంబూని నిజ నిల
యంబున కరుదెంచె నంత. 122

గీ॥ పచ్చికస్తురి పునుగు జవ్వాది కప్పు
రంబు చెందిరమును కనకాంబర ప్ర
ముఖ చతుర్విధా లంకారములు నొసంగి
రన్నదమ్ములు సైదోడు నంపువేళ. 123

సీ॥ విద్యాధరాప్సరో విహారణస్థలములై
పెంపారు కృతకాద్రి విలసనములు
మానసాభిఖ్య సన్మహితసరస్తుల్య
మైదనరారు పద్మాకరములు
నందనోద్యాన సౌందర్యంబును హసించి
యలరారుచుండు బాహ్యావన సమితి
సకలసస్యసమృద్ధి సంభరితంబులై
చెలువారుచుండు సుక్షేత్రములును॥
కలిగి విలసిల్లు జనపదంబులను నూటి
ననుఁగుసైదోడు పార్వతి నంపువేళఁ
బనుపునకిడిరి గురునాజ్ఞవడసి శీత
భూధరేంద్రునితనయులు ముదముగదుర. 124

వ॥ అట్టియెడ మంగళధ్వనులు భోరుకలుఁగ హిమవంతుండు భార్యయుం
దానును ముద్దుకూఁతు నంపకము వెట్టుటకు సమకట్టి నెమ్మనంబునఁ
దొట్టుకొను మోహాతిశయము వెల్లివిరియ సర్వేశ్వరునిపాలికిఁ దోడి
తెచ్చి సవినయంబున గద్గదికంబు మెఱయ నిట్లనిరి. 125

గీ॥ దేవదేవ మహాదేవ దీనపాల
నీవు సర్వజ్ఞుఁడవు మేము నీకుఁ జెప్పఁ
గల్గుపలుకులున్న వె? యైనఁ గన్నకడుపు
గానఁ బ్రేమచేఁ జిత్తంబు కలఁతఁ జెందె 126

సీ॥ పొలుపుగా సన్నజాజులుగోయ మాచిట్టి
తల్లి గోరులనిండ నల్లజిమ్ముఁ
దిలకంబు నుదిటిపై దిద్దిఁబో మాయమ్మ
చిన్నిచెక్కులఁ జెఱుచెమటగారు
మెల్లనవీఁచు తెమ్మెరనుండి పుష్పాడి
దాఁక మాబొట్టెకుఁ దనువుగందు
హంసతూలికలయందైనను నడువ మా
పిల్లయడుంగులు జిల్లులువడు॥
నెన్నినోములునోచియోఁ గన్నవార
మయ్య! మాకన్నతల్లిపై నెయ్య మించు
కేనియుం దీరలేదు నీ కిచ్చినార
మెట్టులేలెదో నిటమీఁద నెలమిఁ దండ్రి!. 127

చ॥ అనుచును వారు వల్క ముదమంది శశాంకకలాపుఁడాక్షణం
బుననె సమస్తలోకజనము ల్బళియంచు నుతింప నిర్జరు
ల్గని కుసుమావళుల్గురియఁగాఁ బరమేష్ఠియు మెచ్చ విష్ణుఁడౌ
ననఁగన్న వామభాగమున నర్ధశరీర మొసంగె గౌరికిన్. 128

చ॥ జలరుహసాయకుండు హరిసన్నిధిఁబూనినపూన్కి నేటికిం
పలర ఫలించెనంచును రయంబున జిల్కహుమాయినెక్కి ఘ
ల్ఘలుమని కింకిణీధ్వనులు కర్ణపుటంబులకింపొనర్పచుక్
వెలయఁగఁ బూలవి ల్లెగరవేయుచుఁ గోయనియార్చి వెన్నడేన్. 129

వ॥ అయ్యవసరంబున. 130



సీ॥ ఒకటినీలద్యుతియొకటి పాండుద్యుతి
కనులకు మిఱుమిట్లు గడలుకొలుప
నొకప్రక్కకుంకుమ మొకప్రక్కభసితంబు
నమరావళికి ముదంబావహింప
నొకవంక దరగళ మొకవంక గరగళం
బితరులచూడ్కుల కింపొనర్ప
నొకచాయ మణిహార మొకచాయఫణిహార
మురుతరకాంతుల నెప్పమీఱ॥
నొక్కమొడను దివ్యాంబర మొక్కమొడను
భవ్య కరిచర్మపటశోభ పరిఢవిల్ల
నర్ధనారీశ్వరాకృతినలరుటరసి
భూధరేంద్రుండు మిన్నందె ముదముఁబొంది. 131

గీ॥ ఎలమి మైనాక కోలాహలు లరుదేర
ముజ్జగంబులవారలు మొనసికొల్వ
భార్యయునుఁ దాను నేకరూపస్థులగుచు
వృషతురంగంబుపై నెక్కి వెడలె శివుఁడు. 132

క॥ వెడవిల్తుఁడు విరితూపులు
వడివడిగా వింటఁగూర్చి వర్షముఁగురిసెం
గుడిమెడమల నాహరునకు
నడుఁగామడయయ్యె నప్పు డగ్గలఁపుఁదమిన్. 133

వ॥ అనంతరంబున సంబంధ బంధుజన సందోహంబును సముచిత ప్రకారంబున వీడ్కొలిపి మందసమీరుని తీరంబునకనిచి మఱలిపోవు కమలాకర తరంగంబు చందంబున హిమవంతుండాప్తులునుఁ దానును నింజమందిరంబునకు మఱలె నంత సర్వేశ్వరుండునుఁ గతిపయప్రయాణంబులఁ గైలాసంబుఁ జేఱంజని మంగళతూర్యారావములు సెలఁగ నిలింపులు గుసుమవర్షంబుఁగురియ భూసురాశీర్వాదంబులుదనర వృషభేంద్రుడిగ్గి నిజనిలయంబుఁ బ్రవేశించి బహుకాలంబు శతానందానందకందళితహృదయారవిందుఁడగుచు నొక్కనా డరవిందాక్ష కమలాసన ప్రముఖ సమస్తలోకంబులవారలును బరివేష్టింప నిండుగొలువుండి బహువినోదంబులఁ దేలుచుఁ బ్రసంగవశంబున నెల్లరువినుచుండ గమలామనోహరునిదిక్కు మొగంబై యిట్లనియె. 134

గీ॥ అమరులొనరించు ప్రార్థన లాలకించి
సుతుఁడువొడముటకై గిరిసుతనుఁ బెండ్లి
నాడఁగాఁదలంచిన మీ సహాయ్యమునను
నదియునెఱవేఱె నిర్విఘ్నమై ముకుంద. 135

ఉ॥ నా విని మాధవుండనియె నాగవిభూషణ! నీవెఱుంగవే?
మావలనం జరుంగుకెటు మాన్యుఁడవౌదువుగాన నిన్ను నీ
వీవిధినెంచఁబోక మమునెల్లరనంటివి యింకమీఁద నీ
దేవచర్యార్తి తీరునని తేటగ నమ్ముదునయ్య నాత్మలోన్. 136

క॥ అనవిని శంకరుఁ డతిముద। మునఁదనరుచు నిట్టులనియె ముజ్జగములవా
రినిఁగాంచి శిరఃప్రవిలస। దనిమిషతటినీఘుమంఘుమార్భటిఁ బోలెన్.

గీ॥ విమలమతులార! మీర లిచ్చోట నెంత
కాలమున్నను సంతోషకరమె మాకు,

నైనను స్వకృత్యములుమాను టనుచితంబు
గాన నిఁకఁబోయిరండు మీస్థానములకు. 138

చ॥ అనవిని వారలందఱు ముదన్వితులై శివ పార్వతీశ పా
వనచరితాశ్రితావన విభాకరమండలమధ్యవర్తి య
బ్జనిలయసన్నుతా భవ శుభప్రద శంకర కుంభిదైత్యసూ
దన యనుచున్నుతించి తమ తావులకేగిరిస్వస్థచిత్తతన్. 139

వ॥ అనంతర మనంగశరాక్రాంత హృదయుండై సర్వేశ్వరుండు గణేశ్వర
ప్రముఖుల యథోచిత స్థానంబులకుఁ జనసెలవుసంగి తానును శయన
గృహంబున మనోజ్ఞ తల్పంబు పయింగూర్చునియుండ. 140

గీ॥ అపుడు నెచ్చెలులందఱు నగజచెంతఁ
జేరి యామెకు హారంబట్టుచీరెఁగట్టి
భూషణంబులుదొడిగి సమ్మదముతోడ
నలరుతఱిఁ గలవాణి యిట్లనియెఁజెలికి. 141

ఉ॥ కోరిన కోర్కెలెల్ల సమకూరెనె మహేశుఁడు డెందమందు నీ
గోరి మనోజ్ఞతల్పమునఁ గూర్చునియుండెను వేడ్కతోడ నా
సారససాయకోజ్వలిత సంగరరంగమునం బరస్పర
స్ఫార జయాభిలాషులయివర్తిలుఁ డిద్దఱు నంబుజాననా. 142

వ॥ అనిమఱియును. 143

సీ॥ సఖుఁడు రమ్మని కనుసైగఁ జేసెడువేళఁ
బెడమోముపెట్టి నిల్చెదవు సుమ్మి
కాంతుఁడు దరిఁజేరి కౌఁగలిమ్మనిబల్క
బెదరి మాఱ్పల్కకుండెదవు సుమ్మి
వరుఁడు చేలచెఱంగు బట్టి రాఁ దిగిచిన
సిగ్గుచేఁ జెయివిదిల్చెదవు సుమ్మి
విభుఁడు వేడుకతోడ విడెయంబొసఁగిన
నదెసన నందకుండెదవు సుమ్మి॥
తేనెలూరెడునును మోవియానఁదలఁచి
వల్లభుఁడు గదిసెడువేళ నుల్లమందు

నళికి యులికిపడెదు సుమ్ము లలిత వికచ
సరసిజాత దళాయత చారు నేత్ర. 144

ఉ॥ అంటిమిగాని నీకు విభునందునఁ గల్గెడు కూర్మియెల్ల వా
ల్గంటిరొ! మే మెఱుంగనిదె? కమ్మనివింటివజీరుఁ డల్ల పూ
వింటను బాణవృష్టిఁ గురిపించి ధృతిం గలఁగింపకుండ ము
క్కంటినిఁ గావుమం చిపుడు క్రమ్మఱ నీ కెఱుఁగింపనేటికిన్. 145

చ॥ అని కలవాణిబల్కఁ జెలులందఱుఁ గన్గొని గౌరి వారికి
ట్లనియె లతాంగులార! మిముసందఱనే నెడఁబాయఁజాల నొ
క్కనిముసమైనఁ గాన ననుఁ గాఱియఁ బెట్టకఁ బ్రోవుఁడంచుఁ బ
ల్కిన విని వార లామె కిలికించితభావ మెఱింగి బ్రీతితోన్. 146

మ॥ అనిరిట్లందఱు మేలు మేలు చెలి! నీ వన్నట్టి వాక్యంబు లె
ల్లనువిన్నం గడువింతలయ్యె మును నీలాగన్న వా రెవ్వరై
నను భూమింగలరే? మఱేమి యిటులైనం గాపురంబెట్లు సా
గు నగాధీశునిపుత్త్రి వయ్యు మది సంకోచింపఁగా నేటికిన్. 147

క॥ అని యిట్లు చెలులు వల్కఁగ। విని పర్వతరాజతనయ వ్రీడావనతా
ననతామరసయగుచు నుం। డినఁ గని యిట్లనియె నూర్తు నెనరుప్పతిలన్.

క॥ మును మమ్మెల్లఁ బ్రతిమా। లినదానవుగావె ముఖజలేజము నిమ్మా
డ్కిని వ్రాల్చి మిన్నకుండినఁ। గొనసాగునె కోరినట్టి కోరికలెల్లన్. 149

వ॥ అను సమయంబున. 150

క॥ అమ్మాటలెల్ల విని చెలి। యమ్మానినికిట్టులనియె నమ్మరొ! దగ మీ
రిమ్మాడ్కిం జేయుదురని। నెమ్మనమున నెఱుఁగనైతి నిజముగ ననుచున్.

చ॥ చెలువునిచెంత కేగుమను చెల్వనుఁ గ్రొవ్విరిదండఁ గొట్టి యీ
బులుపు లదెంతసేపనెడిబోటినిఁ బాఱఁగఁ జూచి యిప్డు నీ
వలపులదెందుబోయెనను భామను దూఱుచు నుండ నెచ్చెలుల్
బళిబళి మెచ్చవచ్చు నినుఁ బంకజపత్త్ర విశాలలోచనా. 152

గీ॥ తొల్లి నీవంటివారలె యుల్లమందు
లజ్జఁబడి ప్రాణనాథునిపజ్జ కరుఁగ

కీడిగిలఁబడి పిమ్మటఁ గ్రీడలందు
నారితీరిన ప్రౌఢలై రబ్జవదన. 153

చ॥ అని చెలికత్తెలందఱు భయంబు భయంబునుఁ దోఁపఁబల్కి నె
మ్మనమున నున్న సిగ్గుడుపుమాటలు జెప్పుచు బుజ్జగించి యా
వనజదళాయతాక్షి కరపద్మముఁ బట్టి మహేశు సమ్ముఖం
బునకునుఁ దోడితెచ్చి ప్రియము న్వినయంబు మెఱుంగలింపఁగాఁ. 154

వ॥ ఇట్లని విన్నవించిరి. 155

ఆ-వె॥ కలికి ముద్దరాలుగావున నీడురాఁ। జాల దీవు సరసచక్రవర్తి
వగుదు కాన నీమె నతిలాలనముఁ జేసి। యేలుకొనఁగ దయ్య నీలకంఠ.

ఉ॥ చెప్పితి మింతె కాని శశిశేఖర! వేడుకతోడ నీవు నీ
యొప్పులకుప్పయుంగలసి యుల్లము లం దమకంబులిబ్బ నే
ర్పొప్పఁగ నీరజాతశరయుద్ధమునందు వజీరుతోచు మీ
రొప్పకయుందురే యిరువు రొక్కరికన్నను నొక్కరెక్కువై. 157

క॥ అనిపలుకుచుఁ జెలులందఱుఁ। బనినెపమున నొకరికొకరు వడివడిఁ జనుచో
వనితాలలామయొక్కతె। సనసన్నఁగ వెనుకనడలఁ జనె వెలుపలికిన్. 158

క॥ అంతటఁ గ్రమక్రమంబున। సంతసమున శంభుఁ డద్రిజాతాధీన
స్వాంతుండై కంతుశరా। క్రాంతుండై దివ్యపుష్పకం బెక్కి వడిన్. 159

సీ॥ శాతమన్యవశిలోపేత కందరములఁ జెంపారు కృతకాద్రి విలసనముల
భాసమానోద్యాన వనవాటివీథుల నతిమనోహర నికుంజాంతరములఁ
బారిజాతలతాంత చారుతల్పంబుల మహనీయ ఘనసార మంటపముల
స్వచ్ఛవాఃపూర కాసారతీరంబులఁ దనరారు తత సైకతస్థలములఁ
పార్వతినిఁ గూడి సౌఖ్యాబ్ధి పటు విలస ద
భంగ రంగ దుత్తుంగ తరంగ మహిత
డోలికా పాళికలను నుయ్యాల లూఁగు
చోలిని దృతీయపురుషార్థ కేళిసలిపె. 160

వ॥ ఇట్లతులిత చమత్కార విహారంబు లాచరించుచుఁ జనిచని. 161

సీ॥ తాల హింతాల తక్కోల బాలరసాల
సాల తూల తమాల సాలయుతము
నారికేర కరీర పీర మందార మా
లూర పీరతరు ఖర్జూరకంబు
లంబ నింబ కదంబ తుంబ ధూళికదంబ
జంబు జంబీర కాడంబరంబు
మల్లికా వల్లికా వేల్లిత పల్లవి
తోల్లస త్ఫల్లీమ తల్లికంబు॥
లుంగ మాతులుంగ లవంగ సంగతంబు
వట కుటజ నట పట పటు విటప పటల
మై మనసిజాయుధాగార మనఁగఁ దనరు
లలితో వనిఁగ్గాంచెఁ బళ్యల్లలాటుఁ డెలమి. 162

మ॥ కని డాయంజని పుష్పకంబుఁడిగి యు క్కాంతార పాటంబులో
న నగేశాన్వయ వైజయంతి కరమున్ హస్తంబుచేఁ బట్టి వృ
క్షనికాయంబులఁ బల్లవ ప్రసవగుచ్ఛస్తోమ చంచత్ఫలా
ళి నికుంజౌఘములన్ మరందరసపాళిం జూపుచుం జూపుచున్. 163

వ॥ చనుచుండ. 164

ఉ॥ అంత వసంతమొప్పె మలయానిలకంపితపాంథకామినీ
స్వాంతము పుష్పసంఘవిలసన్మధుపాళివిరావపూరితా
శాంతము మంజుకుంజచరదాప్తవిటౌఘగతాబలారతా
నంతసుఖానుభూతిపరిహాసిత ఘోరలతాంతకుంతమై. 165

సీ॥ పాదుల మొదటనుఁ బండుటాకులురాల
మొండుఁగామోడులై యుండునవియుఁ
గెంజాయరంజిల్లఁ గెరలి క్రొమ్మొలతుద
వితతంబుఁగాఁ బల్లవించు నవియు
బసరుటాకులలోనఁ బరువంబుగాకయుం
చుకతోఁచు మొగ్గలఁ జూపునవియుఁ॥

దేఁటి పుప్పొడిరాల్చి తేనెలు గ్రోలంగ
విరియు పూగములచే వెలయు నవియుఁ
నలుసులం తేసి పిందెలు గలుఁగునవియుఁ
బసరుకాయల బరువుచే వంగునవియు
నగుచుఁ దనరె వృక్షములు వనాంతరముల
నతిమనోహరమగు వసంతాగమమున. 166

క॥ తరుణతరు పల్లవద్యుతి
సరసి మదిన్ సాంధ్యరాగ మనిదలఁచి వనాం
తరములఁ గోకయుగంబులు
విరహవ్యథఁ గుందఁదొడఁగె భీతిదలిర్పన్. 167

ఉ॥ కుందలతాంతగుచ్ఛరుచిఁ గోరిక లీరిక లెత్తుచుండ రా
కేందుమనోజ్ఞబింబమని యెంతయు నెమ్మదిలో భ్రమించి యా
నందముచేఁ జకోరమిథునంబులు డాయఁగఁబోయి చూచికా
నందున నిస్సిరో యనుచు నచ్చోటువాయును వెన్కఁజూచుచున్.

క॥ తనరారె వసంతం బతి। మనోహర మరందగళిత మహీజాతస్తో
మ నిరంతర దంభఘనా। ఘ నవాకర్షిత సు చాతకవ్రజ మగుచున్.

సీ॥ అరవిరిసిన మొల్లవిరిదేనె లందకుం
డినానచే తేఁటులను విడిచిఁ
సంపంగిదరిఁ బొన్న చక్కఁగాఁబూయవీ
క్షించి నోరూర నిసంచు మఱలి
పొగడపూఁదేనియ ల్నగమాని కలిగొట్టు
విరిదేనెఁ గడుపుబ్బఁ బీల్చిపీల్చి
వెనువెంటఁదిరుగాడు పిల్లలదగదీఱఁ
గొజ్జంగివిరిదేనెఁ గ్రోలనిచ్చి॥
పుష్పితాశోకములమీఁద ముసరిముసరి
మఱియుఁ గోరంటవిరిదేనె మాటిమాటి
కెలమిచేతను జవిఁజూచి మలయుచుండెఁ
దేఁటికదుపులు బలు విరిదోఁటలందు. 170

గీ॥ తనరఁగ మనోహర సురలతా కుసుమవి
చిత్ర మంజరీ స్తోమంబు జెన్నుఁగాంచె
షట్పదవిరాజితంబై వసంతముననుఁ
శ్రోత్రతలంబునఁ గన్నడ కవితఁ బోలె. 171

వ॥ అట్టియెడ మహాదేవుండు పార్వతి కిట్లనియె. 172

క॥ అల్లదె కనుఁగొను మళి తన
వల్లభ కెలమావి తేనె వడివడి హృదిరం
జిల్లఁగ నందిచ్చెడు సం
ఫుల్లాబ్జస మానవదన ముక్తారదనా. 173

క॥ కోకకుచ! గనుము నీనెతఁ
బ్రాకటముగఁగాంచి మొయిలుబారని వేడ్కం
గేకులు బురులన్విప్పచుఁ
గేకారవమొప్ప నృత్యకృత్యము సలిపెన్. 174

మ॥ వికచాంభోరుహపత్త్రలోచన! భవ ద్వీక్షాతిరేకంబుఁ గాం
చి కడున్ లజ్జవహించుచున్ మృగశిశుశ్రేణు ల్వనక్షోణిఁబా
యక సంచారమునల్పుచుం జపలతాత్యాగంబుఁ గావింపఁగా
నికటంబైన తపస్విపృత్తిఁదనరె న్వీక్షించితే వేడ్కతోన్. 175

ఉ॥ ఓధణీధరిజాత! కను ముల్లమునంతసిలంగ నీదు వా
క్మాధురివిన్నదై చిలుక మానస ముత్తలపాటుఁజెంద స
న్మోధకలంగఁగా స్వకులమిత్రతమాని కుజాతసంగతిం
గ్రోధమిగుర్పఁ బండ్లుగొఱుకు న్మొగమంతయు జేపురించఁగాన్. 176

మ॥ హరినీలాద్వయవాదికైశ్య! భవదీ యానూన కంఠస్వనో
ద్ధురరక్షా మాధురి కీడుగాకఁ బికసందోహం బరణ్యంబులో
న రహి న్మౌనముఁ బెద్దకాల మెదలోనందాల్చి వాక్సిద్ధి భా
సురత న్మాధవువల్లఁబొంది కుహూయంచు న్గాయు నాలించితే. 177

ఆ-వె॥ నీదు రోమరాజితోఁ దులఁదూగకఁ
బుట్టలందుఁజొక్కి పొలుపుఁదక్కి .

పవనభక్షులగుచు వరలుచునున్నట్టి
నాగరాజిఁ గంటె నాగరాజి. 178

మ॥ నవ చామీకర చారుగాత్రి! వినుమా నాగారిడింభంబునీ
యవలగ్నంబున కీడుగాక మది నత్యంతత్రపాయుక్తయా
చు వడిం గందరమందుదూఱి వెత నచ్చో శ్వోళఁగావించెనా
బవిధారాపతనంబువేళ గిరి బొజ్జ్వల్వెట్టు చందంబునన్. 179

ఉ॥ కేతకిధూళి యొక్క యళికృష్ణతనుద్యుతిపైఁబడ న్మహా
శ్వేతరుగాప్తిఁగా నతని్రప్రేయసి వల్లభుఁబోల్చ లేనిదై
భీతిలి యెల్లచో వెదకి వేసరి గంధఫలీలతాంతసం
ఘాతముచెంతఁ బ్రాణమిడఁగానమకట్టెనుఁ గంటె నెచ్చెలీ. 180

సీ॥ ఎలమావిచెంగట నేపారు గొజ్జంగిపూఁదేనెవాఁకల నీఁది యీఁది
మల్లికాసుమనోమతల్లి మంజరులపై నల్లిబిల్లిగ నాట లాడి యాడి
యేలాలతాజాల డోలికాపాళుల నోలిని నుయ్యాల లూఁగియూఁగి
కమనీయతర వల్లికాయుక్త కుంజసందోహాంతరంబులఁ దూఱి దూఱి॥
రమ్య తాపింఛపుష్పముల్ రాల్చి రాల్చి
కప్పురంపుటనంటులఁ గలసి మెలసి
మలయ మందసమీరుండు మలయుచుండెఁ
గంటె పూర్ణిమాచంద్ర సంకాశ వదన. 181

వ॥ అని యిట్లతికుతూహలంబున నెఱింగించుచుఁజనిచని యొక్కమనోహ
రప్రదేశంబున నిలింపదంపతు లింపెసఁగ నతులిత రతిబంధ చమత్కా
రంబులు మెఱయఁ గ్రీడించిన జాడ లీక్షించి. 182

క॥ అట్టియెడ శంకరుఁడు జలి! గట్టులయెకిమీనిపట్టి కైఁ దనకేలం
బట్టి సుర సురతచిహ్నాల! నిట్టులమగు వేడ్క నిట్టు లెఱిఁగించె నటన్.

క॥ పరికింపుము చెలి! ద్వి చతుః! కర చరణంబులను ధేనుకాబంధమునన్
సురతక్రీడ యొనర్చెను! సురమిథునం బిచట నింపు సొంపారంగన్. 184

గీ॥ చరణయుగళంబుఁ గటియును సైకతంబు
మీఁద ముద్రించినట్లుండె మోదమలర

శూలచిత బంధమున మరుకేళి సలిపె
నొక్కపురుషుఁడు సతిఁగూడి యువిద! గనుము. 185

గీ॥ పదయుగళి పిఱుఁదుల క్రింద వరలి వీపు
మాత్రమే నేలపై నంటె మఱియు నొక్కఁ
డింద్రకాఖ్యబంధంబుచే నింతిఁ గూడె
నిచట శోధించిచూడుమా యిగురుబోఁడి. 186

క॥ ఇరువుగలసంఖ్యఁ దనరెడు। చరణము లభిముఖత నొప్పి జడలో నివిరు
ల్ధరణిఁబడెఁగనుము చెలి!విటుఁ।డరయ ధనుర్బంధనమున నతివనుఁగూడెన్.

శా॥ జీవంజీవసమానచారునయనా! సీమంతినీయోర్తు చే
తోవీథి న్ముదమావహిల్ల నిజనాథుంగూడి పెంపారఁ బుం
భావక్రీడల నారితేరి స్మరసామ్రాజ్యంబుఁ జేపట్టె ని
చ్చో వీక్షింపుము కైశికచ్యుత సుమస్తోమంబు మోదంబునన్. 188

వ॥ అని యివ్విధంబున నెఱింగించుచు నమ్మహాదేవుండు జనిచని పార్వతి
కిట్లనియె. 189

సీ॥ ఈచాయఁ జనఁగరా దిచ్చోట లతకూన
లెలమిచే విటపాళిఁ గలసియుండె
నావంక కరుఁగరా దచట మలీమసుల్
మధుపానమత్తత మలయుచుండె
నీత్రోవ నేగరా దిచ్చటి కొమ్మలు
పల్లవాన్వితములై వరలుచుండె
నాచక్కిఁ బోఁగూడ దచ్చట సోకు ద
య్యంబు స్వేచ్ఛావృత్తినలరుచుండె॥
నిచట నిల్వఁగూడ దిచ్చోటఁ బరచుటా
ఘమని మహాన్నతమునఁ దనరుచుండె
ననుచు నెనరుదవ్వుల నా సర్వలోకేశుఁ
డగజతోడ మేల మాచరించి. 190

క॥ చనుచున్న యవసరంబున
ననిమిషకార్యంబు డెందమందున స్ఫురియిం

26

చిన శంభుఁడుగిరిజనుఁ గనుఁ
గొని యామెకుఁజూపె నొక్క కుంజసదనమున్. 191

వ॥ ఇవ్విధంబునఁ జూపి తదుపకంఠంబున కరిగి యచ్చటి వికసదిందీవర కల్హా
ర కైరవ రాజీవరాజి విరాజమాన కేళిలోల కలహంస సారస కారండవ
జీవంజీవ చక్రవాక చక్రవాళకలరవ వ్యాకుల సరోవరతరళతరంగ మా
లికా డోలికా పాళికాగతాగతోద్ధూత విమల శీతలసలిలకణగణ
మిళిత లలిత మలయవలదుపవన వలయనిలయానిలాందోళిత రసాల
శాఖా నిరంతర సముద్భిన్నకిసలయ కుసుమ ఫలాహారసముల్లసిత కో
కిల చంచరీకకీరకిశోరవిసరాలాప మధురసధారా పూరంబు తోరంబు
గామల్లడిగొని యుల్లంబును బెల్లుగ దల్లడింపఁజేయఁ దమకంబుఁ
బట్టఁజాలక చంద్రశేఖరుండు శైలరాజనందనాధీన హృదయారవిందుం
డై తన్నికుంజాంతరంబున కరిగి పుత్త్రాభిలాషంబునఁ గంచుకితపుల
కాంచిత శరీరుండై పంచశరకదనంబునకుఁ దార్కొనఁ బెద్దకాలంబ
గుటయు భయంకర దుర్వార దర్వీకర భీకరకరుండగు తారకుని కో
త్తలకుఁ జలించి నిలింపులు గుంపులుగూడి యప్పరాణదంపతుల కిం
పగుదానిని విఘ్నంబుఁజేయసమకట్టి వివిధవాద్యవిశేషంబుల భోరుకొ
లిపియు ధణంధాణభేరీనినాదంబులు బరఁగించియు విఫలమనోరథు
లై నివ్వెఱఁజెంది నిలిచినంగని యగ్నిభట్టారకుండు కీరాకారంబున
నయ్యారంబులోనికిఁ దూఱినం గని సారసారిధారణుండు దటుక్కు
నలేఁచిన నందునకుఁ గోపించి గౌరి పవమానసఖున కీరసంబున సర్వభ
క్షకుండవు ధూమగర్భుండవుఁగమ్మని శాపంబొసంగి శత్రుభయకంపి
తస్వాంతులై యపకారంబొనర్చిన సుపర్వనికరంబులంగని యిట్టి దౌ
ష్ట్యంబొనర్చిన మీకెల్లరకు నేఁడాదిగా సంతానవిరహితం బగుఁగాక
యని పలికిన నద్దేవి న వ్విబుధు లనేకవిధంబుల నుతించి శాంతగుణ
స్వాంతగా నొనర్చి రయ్యవసరంబున మహాదేవుండు గోత్రధర క్త్తేక్షణుం
డై నీ రాకఁగని పార్వతి సిగ్గునఁదొలఁగెఁగావున విఘ్నకరుండవగు నీ
వు గౌరిగర్భంబునఁ బడినయర్థంబుగాక మిగిలిన యర్థరేతస్సును బాన
ముఁజేయుమన న వ్వీతిహోత్రుం డట్లొనర్చియు భరింపఁజాలక

భాగక్రమంబున విబుధుల కొనంగ నది వారిగర్భంబుల వెడలి శరవణంబునంబడి బహుయోజనవిస్తీర్ణంబైన యొక్కసరోవరంబుఁ జేరనాకొలను కనకమయ కమలాదులచేతను సుధారసోపమాన సలిలంబుచేతనుఁ బ్రకాశించుచున్నదనువార్త నాలించి మేనకాత్మజ దాని సొబగు వీక్షింప సమకట్టి చెలికత్తియలుం దానునుఁ గుతూహలంబున నచ్చటికరిగి యందు జలక్రీడాదులొనర్చి యా తీరంబున విశ్రమించి యుండునంతఁ గృత్తిక లార్వురాకొలని కమలపత్త్రపుటంబుల జలంబుఁ గొనిపోవంగని గౌరి వారి నవ్వారినిమ్మని గోరినవార లట్లాచరింప నామెయుఁ గ్రమంబుగ నాపానీయంబులంగ్రోలియుండె నంత దక్షిణకుక్షినుండి లోకశోకనాశనకరుండును తప్తకాంచన ప్రభాకరుండును శక్త్యాద్యాయుధోపేతకరుండును నైన బాలుండును నీశ్వరరేతస్సమన్విత సరోవరపానీయ పానంబున వామకుక్షినుండి బాలార్కకోటిప్రభాభాసమానుండగు మఱియొక బాలకుండు నుద్భవించినం గని శాంకరి నిర్భరానందపారవశ్యంబున నయ్యిరువుర నొక్కటఁ గౌఁగలింప వారిరువు రేకమైన నా యవ్వ నివ్వెఱఁజెంది యుండునంత. 192

క॥ సురదుందుభి నాదంబులు। హరిదంతరములనునిండె నమరు ల్సుమము
ల్గురిసిరి మిక్కుటముగన। చ్చరలాడిరి గౌరి సుతుని జన్మదినమునన్. 193

వ॥ అప్పు డబ్బాలుండు బిఱబిఱఁ బరుంగులిడుచుఁ జనిచని శరవణంబునఁ జిక్కిన నప్పార్వతి తన నందనుం గనుట కీవలావల నారయుచు నెచ్చటం గానక యద్భుతపడుచుఁ జెలులంగూడి నిజనివాసంబునకుం జనిరె.

గీ॥ అంత శివునాజ్ఞఁ గృత్తిక లార్వురా కు
మారునకు స్తన్యమొసఁగ సంభ్రమముతోడ
నేగుదెంచిన నబ్బాలుఁ డెలమి వారి
స్తన్యములఁగ్రోలె నొక్కట షణ్ముఖముల. 195

వ॥ ఇట్లు శుక్లపక్ష సుధాకరుండునుంబోలె నక్కుమారుండు విరాజిల్లు చుండఁ బార్వతీ పరమేశ్వరు లచ్చోటి కరుదెంచి రంత. 196

ఉ॥ ఆయతబాహు రూపవిజితాయుతమన్మథు సూర్యతేజు గాం
గేయసమానవర్ణు శివకేశవసన్నిభుఁ బీనవక్షుఁ బ

ద్మాయతచారులోచను షడాననుఁ ధైర్యరమానిధాను గాం
గేయునిఁ గోమలాంగుఁ దిలకించి ముదంబున గౌరియిట్లనెఁ. 197

వ గీ॥ నాదు వెలలేని భాగ్యరత్నమ్మ రమ్ము। పాలుబోసెద నాచిన్నిపాపరమ్ము
బువ్వఁబెట్టెద నాకన్నబుజ్జి రమ్ము। తడవుసేయక నాగన్నతండ్రి రమ్ము.

వ॥ అని యివ్విధంబునం బిలుచుచున్న సమయంబున. 199

సీ॥ పదియాఱువన్నె మేల్బంగరుచాయలఁ
ఉ గోమరునెమ్మెయి రజోగుణముఁ దెలుపఁ
జిన్నారి నగుమొగంబు వెన్నెలనిగ్గులు
దనరారు సాత్వికోదయముఁ దెలుప
రంగుమీఱిన యుంగరంపువెంట్రుకలచాల్
సీ పొరిఁబొరి నురుతమోగరిమఁ దెలుపఁ
గరమున మునికోలకై వడినలరారు
పరశక్తినిర్గుణత్వంబుఁ దెలుప॥
బ్రహ్మరీతిని విష్ణునిపగిది శీత
కరధరుని చందమునఁ బరాత్పరునిభాతి
వచ్చెఁదొకతొకమాటలు బుచ్చినడలుఁ
బాలబుగ్గలుఁ దనర నబ్బాలుఁడపుడు. 200

సీ॥ అయ్యారె నాముద్దులయ్యలావణ్యంబు సుప్పాణితళ్కుల జోడుకోడె
సౌకుమార్యంబునఁ జక్కనయ్యకు మేటి చాగురే నాచిన్ని చక్కనయ్య
వెస దుర్నిరీక్ష్యుఁడౌ వృత్రభేదికినాము పట్టితేజస్స్ఫూర్తి పట్టుఁగొమ్మ
రిపుభీతిదాహవర్తిత నిర్జరచకోర సమితికి నాతండ్రిశక్తి చందు॥
ఎలమి నేఁ జేయునోముల కలిమిపంట
లీల నెల్లజగంబుల నేలుదంట
యనుచు నక్కునఁజేరిచి యక్కుమారు
చెక్కుదోయిని ముద్దిడి చెలఁగుగౌరి. 201

వ॥ అంత బాలేందుమౌళియు నబ్బాలుని లీలంగైకొని యల్లనఁ గేలుదో
యినిడి పరిపరివిధంబుల ముద్దిడుచు నగపాలునిబాలతో నిట్లనియె.

ఉ॥ చక్కని ముద్దు లేఁగొమరుఁ జయ్యన నక్కునఁజేర్చి ప్రేమతోఁ
బొక్కిలి బొజ్జ బొమ్మ నునుమోవియు ముద్దిడి నవ్వఁజేయుచుఁ
జెక్కులగిఁటుచుఁ జెదరుచిన్నికురుల్ కొనగోళ్ల దువ్వి పెం
పెక్క శిరంబుమూర్కొనిన యింపున కెన్నఁగ మూల్యమున్న దే ?

వ॥ అని యివ్విధంబున నప్పురాణ దంపతులమితా నందంబున నాతనికి
విశ్వకర్మనిర్మితంబును మహేమయంబును నగు పుష్పదామంబొసంగి
నిజనివాసంబునకుం దోడుకొని పోయిరంత. 204

సీ॥ కులపర్వతంబులఁ బలిమినూటాడించి
తిరుఁగఁద్రోయుచునుండు దృఢమువీఱ
కృతకాద్రులనుఁ బెల్లగించి వేడుకతోడఁ
బటుసత్త్వమేపారఁ బంతులాడు
నొండొంటితోఁ బోరుచుండెడు మదకరీం
ద్రంబుల దిగిచి యుద్ధంబు మాన్పుఁ
పరిసరస్థితధరాధరదరుల్ మాఱ్మోఁగ
సింహనాదంబును జేయుచుండుఁ॥
దల్లిచన్నుఁబాలుద్రావు సింహకిశోర
కేసరములఁ దనకేలఁబట్టి
దివిచివానితోడఁ దృప్తిమైక్రీడించు
శూరవర్యుఁడాఁ గుమారుఁడెలమి. 205

వ॥ ఇవ్విధంబున నక్కుమారుండు బరశురాముండు దనకుఁదోడుగా సర్వే
శ్వరునిచెంగట ధనుర్వేదపారగుండై క్రౌంచపర్వతభేదనంబుఁగావించి
క్రౌంచారియను నామంబువడసి యలరుచుండెనని యెఱింగించిన సంతు
ష్టాంతరంగుండై ధర్మనందనుండఁటమీఁదివృత్తాంతం బెఱింగింపుమని
మార్కండేయ మహాముని నడుఁగుటయును. 206

క॥ శ్రీకమలమిత్రకులర। త్నాకరశశి నీలనీరదాకార మహా
లోకైకవీర విలస। త్సాకేతపురీవిహార జగదాధారా. 207

ఉ॥ ఆజితనూజ వైభవబిడౌజ పయోరుహమిత్రతేజ వి
భ్రాజితసత్కళాహసితరాజ ఫులస్త్యసుతాన్వవాయ సం

జ్ఞాజ విలోచనత్రుటితచారుసరోజ నతౌఘదేవతా
భూజ సుధీజితాజ పరిపోషితభక్తసమాజ రాఘవా. 208

పంచచామరము॥ ధరాకుమారికామనోజ ధైర్యనిర్జరాలయా
సురేంద్రపూజితాంఘ్రిపద్మ సూరిలోకపాలనా
చరాచరాదిభూతవర్తి సన్మునీంద్రసన్నుతా
శరత్సుధాకరాననా మసారనీలవిగ్రహా. 209

గద్యము॥ ఇది శ్రీపరమేశ్వర కరుణాకటాక్ష సమాసాదిత సహజపాండిత్య
సరసకవితాధురంధర ఘనయశోబంధు రాపస్తంబసూత్ర
భారద్వాజగోత్ర పేరూరుద్రావిడ శ్రోత్రియ
బ్రాహ్మణార్య సోమయాజి కులజలధిజైవాతృ
కారుణాచలేశ్వర తనయ నయగుణనిధేయ
లక్ష్మీనారాయణనామధేయ ప్రణీతంబైన
శివకథా సుధారసంబను మహా
ప్రబంధంబునందు
సప్తమాశ్వాసము.



శ్రీ పరమేశ్వరార్పణమస్తు.

శ్రీరస్తు.

శ్రీరామాయనమః.

శ్రీమహాగణాధిపతయేనమః.

శ్రీ శా ర దాం బా యై న మః.

# శి వ క థా సు ధా ర స ము.

## అ ష్ట మా శ్వా స ము.



శ్రీవైభవయుత బుధలో । కావన జనకాత్మజా ముఖాబ్జచలత్త్వే
త్తావరభృంగ జగద్వి । ద్రావణరావణ ముఖాబ్జరాకాచంద్రా.

వ॥ దేవా యవధరింపుము మార్కండేయ మహామునీంద్రుండు ధర్మ నందనున కిట్లనియె నట్లు గుమారుం డవక్ర విక్రమంబున జననీజనకుల కానందంబు రెట్టింప బాల్యవినోదంబులు జరపుచు నొక్కనా డవ్వేండికొండదండ నొప్పారు శశికాంత శిలామయ వేదిపయిం గూర్చుండియున్న సమయంబున. 2

సీ॥ వంకకత్తులు బెడవంకవిండ్లును జిల్ల
కోలలుఁ గైజార్లు గొరక లీఁటె
లును గండ్రగొడ్డండ్లు దోనలును సురియలుఁ
బచ్చిద్రు డ్లునుఁగొంగ వాలులు నురు
లునుఁ గావిదట్టీలు గొనబారుసీలికా
సెలుఁ జింపిగుడ్డ పాగలును గీరు
నామము ల్జిబ్బిటి నడునెత్తిసికలునుఁ
దులసిపూసల పేర్లు దొప్పచెవులు॥
గోరమీసంబులును మిడిగ్రుడ్లులుఁ గను
బొమల జేవురుపూతలుఁ జెమటగారు
మేనులునుఁ గల్గి కొందఱు మృగయులక్కు
మారుఁజేరంగవచ్చి జోహారులిడుచు. 3

గీ॥ పికిలికుంచెలు జవ్వాదిపిల్లులు మధు
వులును నెమలిపింఛంబులు బునుగు మధుర
ఫలములునుఁ జాజపవ్వును నెలమిచే ను
సంగి యిట్లనిపలికిరి సంతసమున. 4

క॥ వినుమయ్యామావిన్నప। మునువలిమలకవలనలరుపొలమున నెవ్వరున్
మనువారమచట సీరా। మునిసేన మెకంబుకొలముఁబులుగులసంతుల్.

గీ॥ దుగతిగ మెుగంబులనుఁగలదొరయచటి పొ
లమున నెచ్చోటఁజూచిన లావుఁగలిగి
చీమచిటుకన్న సటలెత్తి యామునవడి
నేగి బుడ్డగించునునేల నేకలములు. 6

క॥ రేవటిబురుదలదిగఁబడి। పోవంగాళ్లాడ కచటిపొలములలోనం
జీవంజెడు మనుబోతుల। జావిలములజోలిలేక సమయింపనగున్. 7

గీ॥ అచటికాఱుబోతుల నిన్ని యన్ని యనుచుఁ
జెప్ప నలువకైననుఁ గడుదెప్పరంబు
వానికనులారఁ గోపమువచ్చెనేని
చెలఁగి పులినైనఁ గొమ్ములఁ జీరివైచు. 8

గీ॥ నాలుగైదాఱు జంట లందముగఁ గొమ్ము
లందుఁదనర గుట్టలలోవలందుఁ జలువ
లేగుజాడలనెమకుచు నెన్నఁగొలఁది
గాకఁ దిరుగాడు దుప్పులు గానలోన. 9

సీ॥ నేలఁగాలూనక గాలితెరంగునఁ బర్విడుజింకలవంగడంబు
దుమ్ముపెల్లుగ రేగఁ దోరంబుఁగాఁ బాఱు కడుచియ్యబట్టిన కణుచుసంతు
గొరులమెదడెల్లఁగడుమెక్కి దిరుగాడు గోవయేనుంగులగొంగకొలముఁ
బెల్లుగా కానల మల్లాడె డిరునాల్గుకాళ్లచేనెప్పు మెకమూలపడుగుఁ॥
గండక్రొవ్విన చాఱమెకములపిండుఁ
గోనలోమెలఁగెడి పుట్టఁగొట్టులగుమిఁ
గొలఁదులెత్తిఁగింప నోసామి! యలవిగాదు
నలువకైనను, వేనోళ్లచిలువకైన. 10

కం॥ గోరెంకలు లావుకములు। బూరేళ్లు నెమళ్లు మతికపోతంబులు సిం
గారంపుపావురంబులు। దోరంబుగనచటగలవు దొరగమికాఁడా. 11

కం॥ అనవినిమృగయాకౌతుక। మునసమున్ముఖుఁడొక్కయశ్వమునుసాహిణిదె
చ్చినఁదానినెక్కికదలెను। వినయంబునమృగయులెల్ల వెనుకొనిరాఁగన్.

మత్తకోకిల॥ నీలికాసెలు జెంపపాగలు నెమ్మితోడధరించి బ
ల్లోక్కల లీఁజెలు విండ్లు నూసలు గొంగవాలులు బల్లెముల్
గ్రాలఁ గేలనుద్రుడ్లు నంఘ్రులగండపెండెరముల్దగన్
లీల నాతనివెంటనేగిరి లెక్కకెక్కువయైభటుల్. 13

సీ॥ మెడనున్న తోలుపట్టెడలకుఁగట్టిన
కనకంపుఁగొలుసులు ఘల్లుమనఁగ
నెడలుజాడించుచుఁ దొడరిసోగఁగసాగి
మోరలన్నియు సారెసారెకెత్తి
ఘనఘనాఘన భీషణ నినాదసదృశ ధ్వ
నులుదగ వ్రోగి నింగులుదుముకుచు
వాలంబులల్లార్చి నాలుకల్జాచుచు
నింగలములుమియుదృష్టులలరఁ॥
జెవులునిక్కించి పసిఁబట్టి చెలఁగి మూల్గి
వెండిగుండ్లునాఁ గన్నులపండువగుచుఁ
దనరె మృగయులు వేటకై తమ్ముఁదెచ్చు
సమయమున భీషణంబగు జాగిలములు. 14

చ॥ పులులజముండు దుందుడుకు బొబ్బమెకంబులవేఱువిత్తు యే
కలములసూఁడు మిండఁడు మెకంబులమిత్తియు బూచిగాఁడు మె
ల్గులకెదగాల మేదుగుమిగొంగయు దొంగలగుండెముల్లు నా
వెలసెడుబేర్లచేఁదనరు వేపులఁ దెచ్చిరి వేటకయ్యెడన్. 15

సీ॥ గుమిఁగూడి మృగయులు గొందఱావలకేగి
వెదురుకొయ్యలకునుఁ బెనచిచుట్టు
తోరెంబులనువిప్పి తోపారములనొప్పు
బైరుల మెలఁకువఁబట్టి తిగిచి

యు త్తెంబులందిడి యూవు రేభాయియ
టంచుఁ బెనేశ్వల నాకంచుమించు
వుల బోరదువ్వ తెక్కలుదార్చి యాశట
నకనకంబడు కారణమున మువ్వ॥
గదల దుముకుచుఁ బోలేకఁ గడగి యువియు
నుడి తెలుంగునఁదిరుగాడి కడకు నలసి
కేలిపై వ్రాలుచుండంగ లీల వారు
బులుఁగుసంతుల వేటాడఁబోయిరపుడు. 16

గీ॥ వలలు బోను లురులుఁ జిక్కములునుఁ గండె
లాదియగా సాధనంబు లత్యధికముగను
మూపుననుమోయుచును బోయముసలివాండ్రు
గుములుగా వచ్చి రేమేమొ గొణుగుకొనుచు. 17

వ॥ అట్టియెడ వారలలో నొక్కం డక్కమారున కిట్లనియె. 18

ఉ॥ ఆదివరాహమైన నెదురైచనఁగానమకట్టినేని స
మోద్దమతోడ మీఁదఁబడి మూరెడులోననె నిల్పఁజాలు మా
గాదిలిజాగిలం బిది మెకంబులరాయుల నెల్లుసంతులౕ
తే దురుసైనబెబ్బులుల లేళ్లను గీళ్లనుఁ జెప్ప నేటికిౕ. 19

వ॥ అనిన మఱియొకండిట్లనియె. 20

సీ॥ పులివాతఁజిక్కి బెగ్గిలు నింపుచూలాలి జింకనుద్రోచెనీచిఱుతవాఁడు
గున్న యేనుఁగుఁ ద్రుంపనున్న సింగంబునుజడఁబట్టి తెచ్చెనీ సాహసుండు
పుట్టఁగొట్టుచునున్న బొల్లి మోరమెకంబు నలుగునజంపెనీ యుదగాఁడు
నడయాడు కొండకైవడినున్న యొంటరి వెన్నడి పొడిచెనీ పిన్నవాఁడు॥
సింగముల గొంగపైఁబడి చేతిసురియ
చేఁబొడిచి యాయువుఁగొనె నీచెంచువాఁడు
గొప్పఁజెప్పుటకాదు మా యప్ప నీవె
మెచ్చెదవుగాక వేటలోఁజొచ్చి నపుడు. 21

వ॥ అని యివ్విధంబున బహువిధ మృగవ్య క్రీడానుగుణభాషణంబుల
నాలించుచు నమ్మహారణ్యంబు డాయంజనునంత, 22

గీ॥ భటులకోలాహలార్భటు ల్పటహ ముఖ్య
నాదములు గుణధ్వానము ల్నభము నిండ
నిదురమేల్కాని యులుకుచు బెదరి చెదరి
వన్యమృగములు నల్దెస ల్బాఱఁదొడఁగె. 23

ఉ॥ అప్పుడు కాఱుమబ్బులు వనాంతరసీమల బ్రాలెనో యనన్
గుప్పున ముస్తమేపరులు గొమ్ములఁజిమ్ముచు భీషణాగ్రహం
బుప్పతిలంగఁ దత్పరినరోన్నత భూరుహపంక్తిఁ ద్రుంచుచుం
దెప్పరమై చెలంగఁ గని నిండుముదంబున లుబ్ధకావళుల్. 24

ఉ॥ పట్టెడలూడ్చినన్ భషకపంక్తులు మృత్యుశిలీముఖాళి తోఁ
బుట్టువులట్లు సూకరసమూహము వెన్నడి జుట్టుముట్టి బ
ల్దిట్టఁదనంబునం దఱుమఁ దెంపరులై యవి వేగ ముట్టలం
గొట్టఁదొడంగ భీతిల్లకఁ గొబ్బునఁ బైఁబడి ఘాకరింపుచున్. 25

వ॥ ఉన్నసమయంబున. 26

సీ॥ నడయాడు కొండకై వడినున్న యొక యేక
లంబుపై నొకజాగిలంబు ఘాక
రించిదుమికి దాని వంచించిపట్టంగ
సమకట్టుచుండిన సమయమునను
గుమ్మరిసారెలాగునఁ దిరుగాడుచు
నది ఘుర్ఘురింపు చహంకరించి
కొమ్ముఁజిమ్మఁగఁ దటుక్కునఁ ద్రేటుఁదప్పించి
తానట్లదిరుఁగుచుఁ దగినవెరవు॥

నరసి వెనుకటిచట్టపై నతిరయమునఁ
గోరలనునాటి యది కీరుకీరనంగఁ
బట్టువిడువక ముక్కంటిపట్టి పరికి
నీడ్చుకొనివచ్చెఁ జూపఱులెల్లఁ బొగడ. 27

ఉ॥ ఒక్కవరాహడింభకము నోలిని గుర్కురమొండుబట్టి పే
ఱుక్కునఁ బాఱఁ గాంచి యొకయొంటరి యడ్డమువచ్చి దాని బల్

డొక్కనుఁజీల్చి క్రేవులఁ దటుక్కనఁ గొమ్మునఁజిమ్మఁ జెంచువాఁ
డొక్కఁడు బారుటేఁటెఁగొని హుమ్మని చిమ్మెను దాని కంఠమున్.

ఉ॥ కన్నుల నిప్పుకల్చెదరఁగానొకయొంటరి భిల్లశూరుల
న్వెన్నడి పాఱఁదోలుచును వేపులఁజిమ్ముచు మోరఁద్రోపునన్
మన్నన ముస్తలెత్తుచు ఘనధ్వనిఁజేయుచుఁ గార్తికేయుపై
కిన్నిగుడంగ నాతఁ డది ఖీ యను చావ్వఁగఁ దున్మె నమ్ముచేన్.

చ॥ వరుసలుగట్టివచ్చు బలుపందులకిన్నిఁటి కేముడాసి యొ
క్క రొకటిగాఁ దెరల్తు మిదె గాంచుము ముద్దుగ మోములయ్య యం
చురుతరభీకరార్భటుల నొక్కటఁబైఁబడి చెంచుపోటరుల్
నురియలఁగ్రుచ్చి యవ్వన మసూకరసంతతిఁ జేసిరుద్ధతిన్. 30

గీ॥ చెంచుజోదులఁ గొమ్ములఁజిమ్ముచు ఘన
బృంహితంబొనర్చుచు మీఁదికేగుదెంచు
దాని శిర మొక్కఁ డసిఁ దున్మ ధరఁ దొరఁగె న
ది ఖుర పవిహతిఁదెగు గిరిశిఖర మనఁగ. 31

మ॥ పొదలో బెబ్బులిడాఁగ వేపులు పసి న్మోత్తంబులై తీవ్రనం
గదియన్వచ్చి ఘనాఘనార్భటులభౌంకారంబుఁ జేయంగ న
య్యది రోషంబున నీరమున్వెడలి డాయన్ బాహులేయుండు స
మ్మద మొప్పారఁగఁ దీవ్రసాయకమున న్ఖాయించె నవ్వ్యాఘ్రమున్. 32

ఉ॥ రూక్షదృగావళింగనుచు రోషముచే గవిఁబాసి యొక్క హ
ర్యక్షము గార్తికేయునితురంగముపై దుముకంగ నా విరూ
పాక్షునినందనుం డొకశరాసనమెక్కిడి బాణవృష్టిఁ ద
ద్వక్షముగాడనేసె వితతంబుగ భిల్లులు సంతసింపఁగన్. 33

ఉ॥ ప్రాణభయంబుచే నొకకురంగము గుక్కలమీఱి నేలఁగా
లూనక నింగిఁబాఱఁగ గుహుండును నవ్వమునట్లచేయుచుం
దానిఖురంబులొక్కటిగఁ దాఁక్చెను వేసెనుఁ బట్టి తంత్రిడియా
సూనశరారిచందమున శోభిలెఁ జెంచులు బాపురేయనన్. 34

సీ॥ కొమ్ములువిదిర్చిపరిసరకుంజములను। నేలఁగలుపుచుఁగన్నులనిప్పులొలుక
నడవిమొల్లనుఁగల్లోలమాచరించి।పాఱఁదోలెనుబ్రజనొక్కకాఱుపోతు,

గీ॥ జంతుసంతతిమాయింప శక్తిలేమిఁ
బౌరుషంబున నీరసభావుఁ డగుచు
నొకశశము నఱకటనుఁ బెట్టి కొనివచ్చె
మూడుకాళ్లముసలి గూనిబోయఁ డొకఁడు. 36

క॥ హరి కరి కిరి భల్లుక కా
సర గవయ తరక్షు శలల చమరీ ద్వీపి ఖ
డ్గరురు శరభ ముఖ మృగముల
శరవృష్టిఁ దెరల్చె నెలమి షణ్ముఖుఁడపుడున్. 37

చ॥ చెలఁగి యొకండు బైరు నొకచేత నెలంకువఁ బట్టి పొంచి పు
ల్గులఁ గుఱిఁ జూపి వే విడువ గొబ్బున నయ్యది నింగిఁ బాఱి తె
క్కలరవమాలకించి కని కాయములం దడియాసమాని భీ
తిలి తలఁఋక్షమూలముల దెబ్బనఁ గ్రుక్కొనెంబులుంగులున్. 38

క॥ వనమునమనుపులుఁగులజీ। వనములపహరింప నొకఁడువడిఁజని కణుజుం
గని కరమునఁబడమోదెను। గనికరము నయమ్ములేక కష్టాత్ముండై.

గీ॥ వెల్లపావురమొక్కటి వింటికెగసి
యటగుభాళింప నొకవేడ్డమరిగి దాని
మెడనుఁదున్మఁగ నదినేలఁబడు తెఱంగు
చుక్కతెగిపడ్డగతిదోఁచెఁ జూపఱులకు. 40

ఆ-వె॥ మ్రానిదొల్క డొక్కమ్రానితొఱ్ఱనుదూఱఁ
గాంచి తున్మె నొక్కకణసరమ్ము
నింగికెగసియెగసి నేలకులంఘించి
కాఱుకోడినడఁచెఁ గంచుమించు. 41

గీ॥ నెమ్మనంబున నెమ్మిచే నెమ్మి యొంటి
కాలిచేనిల్చి త్ర్యవనతకంఠియగుచుఁ
గేకవేయంగ విని దానిఁదాకి మెడను
జంచువునఁజీల్చె వెస నొక్కసాళువంబు. 42

సీ॥ ఉడువీథినంటి పాఱెడు కొక్కెరలమెడ
ల్దునుమాడె నపుడొక్క తోఁచిగాఁడు

డొక్కఁజీల్చెనుసన్ని డొంకదూఱఁగఁ బోవు
 షమరుఁగాకిని నొక్కజాలిడేగ
చిదిపిరాళ్లనుముక్కచే నేరుకొని మెక్కు
 చున్నగువ్వను నొక్క నొక్కయణుజు
పాదఁదూఱ కాళ్లఁ జేఁబూరేడునిఱికించి
 యుప్పరంబున కేగె నొక్కలగుడు॥
నేలపల్లటి చెట్టుపైఁ బ్రాలఁబోవు
చున్నతఱిఁ గంఠమునుఁ ద్రుంచె నొక్కగిద్దు
శీఘ్రమునఁజని యుయ్యెలచేరుపిట్ట
శిరముఁ దెగవ్రేసె నొక్క బల్చెంచెడంబు. 43

మ॥ క్షత శార్దూల తరక్షు కోల చమరీ ఖడ్గాది నానామృగా
న్వితమత్యుగ్రగదాభిఘాత పతదాభీలద్విపస్తోమ ము
ద్ధతభల్లూక హయద్విష ద్గవయపంచాస్యంబు బాణానలా
హుతి సారంగకుటుంబమై దగె నరణ్యోర్వీతలం బయ్యెడన్. 44

వ॥ ఇవ్విధంబున నాఖేటఖేలనోద్యోగంబుఁ జాలించి వివిధమృగ ఖగ పిశిత ఖండంబు లొండొండ మిక్కుటంబుఁగా ననేకసాధనంబులఁ జిక్కం బట్టి శోణితబిందువులు మేనులపైఁ దూలుచుండ నాపుళిందానీకంబానందంబున వెనకయ్య వెనక వానికిం బ్రణమిల్లి బహుభంగులఁ బ్రస్తుతింపుచుఁ బనివిని దంతి సతండును మృగయాయాసనివృత్త్యర్థం బొకవటవిటపంబునీడను విశ్రమించి కొండొకవడికచ్చోటు వెడలి పరిసరతరులతాగుల్మనికాయంబులఁ గనుచు జనిచనిముందట మహార్ణవంబు గంభీరధ్వనిఁ జేయుచుండ. 45

మ॥ కని డాయంజని షణ్ముఖంబుల మహోగ్రత్వేశఁ గావింప నా
ధ్వని తత్ప్రాంతధరాధరోత్కట గుహాద్వారంబులెల్లం బ్రతి
ధ్వనులీనం గలఁగెన్మహాంబుధులు భూభాగంబు గంపించె సూ
ర్యనిశానాథులు త్రోవఁ దప్పిరి యుడుప్రాతంబు రాలె న్వడిన్. 46

క॥ అట్టి మహోత్పాతంబులు
బుట్టుటఁ గని మానులెల్లఁ బుటహూతున కా

గట్టులయేలికకూఁతురి
పట్టి చెయువులెల్ల నెఱుకఁబరుపఁ దలఁచుచుఁన్. 47

వ॥ రయంబున నాకంబునకేగి పాకశాసనుంగాంచి యిట్లనిరి. 48

గీ॥ ఏమిచెప్పుదుమయ్య దేవేంద్ర! నీకుఁ
బార్వతీసంభవుఁడు మహాబాహుబలుఁడు
దనకెదురులేక సింహనాదంబుఁజేయ
సంచలింపఁదొడంగెను జగములెల్ల. 49

క॥ ఇదినీకువిన్నవింపఁగఁ। బదములువొ్రట్టువడ నిటకువచ్చితి మిఁక నీ
మదినుత్సహించియాతని।మదమడఁచిజగద్భయంబుమానుపుమయ్యా.

చ॥ అనవిని యంత్యకాల దహనాకృతిఁబోలె సురేంద్రుఁ డుగ్రుఁడై
కనులను నిప్పుకల్పొదరఁగాఁ బవి మండితహస్తుఁడై తటు
క్కున రథమెక్కి వెంటసురకోటులుగొల్వ ఢణంఢణాయటం
చునురణభేరిమ్రోయ శివసూనునిపైఁ గదలెన్ రయంబునన్. 51

గీ॥ అవ్విధంబునఁగదలి యింద్రాదివిబుధు
లబ్ధితీరంబుఁజేరి తత్ప్రాంతమందు
మారశతకోటిసుందరాకారు హర కు
మారు జగదేకవీరుఁ గుమారుఁ గనిరి. 52

వ॥ అట్టిసమయంబున. 53

క॥ ఆతనిఁగనుఁగొని విబుధ। వ్రాతముభీతిల్లి లోకరక్షక మాకుం
ద్రాతవగుమనుచువేడిన। నాతఁడుముదమందిసురలకభయంబొసఁగెన్.

క॥ అంతయుఁగనుఁగొని కుపిత। స్వాంతుండై విబుధపతి శతారముఁగొనియ
త్యంతరయంబున దక్షమ। ఖాంతకసుతుపై నివైవ నదిభీషణమై. 55

మ॥ ప్రళయాగ్నిజ్వలిత స్ఫులింగగణసంరంభం బుదగ్రంబుఁగా
వెలయన్ సర్వజగద్భయానకకరాభీలప్రభాజాల సం
కలితంబై విలయాంతకస్ఫురితరేఖంబేర్చి హాలాహలా
నలముల్ గ్రక్కుచుఁబైనిరా నతఁడమందత్వంబునం బట్టుచున్. 56

చ॥ సురపతివంకఁగన్గొనఁగ జోద్యము భీతియు లజ్జఁ బొందుచున్
హరిహయుఁ డంతరంగమున నాతని విక్రమశక్తి నెంచి బా
పురె దగ మెచ్చవచ్చునని పొల్పుగనాతనిఁజేరవచ్చి శం
కరసుత ! పాహి పాహి యనఁగా నతఁ డాతనిఁబ్రోచెఁ బ్రీతితోన్. 57

క॥ అనిమిషులందఱు నివ్విధి। మునఁ బరివేష్టించికొల్వ ముదమున శివనం
దనుఁడుండినసమయంబున। నెనరొప్పఁగ నింద్రుఁడిట్లనియెనాతనితోన్.

గీ॥ పార్వతీపుత్ర మహితదోర్బలవిచిత్ర
సుమనసులు "త్వమేనశరణంమమ" యటంచు
వేడిన కతంబుచేత నీ విష్టప త్ర
యాధిపత్యంబు ప్రాపించెనయ్య నిన్ను. 59

వ॥ కావున నేఁడాదిగా నాకంబునకధీశుండవై సముచితప్రకారంబుల మా
వలని కార్యంబులు నివేదించుకొనుచుండుమనినఁ గ్రౌంచారిజంభసూద
నున కిట్లనియె. 60

ఉ॥ పాకవిరోధి! నీవిపుడుపల్కినపల్కులు లెస్సయైనఁ ద
న్నాకవిభుత్వమొందుటకు నాకుమనంబునవాంఛలేదు శో
భాకలితుండవై పరమపావనమైతగుగద్దెనెక్కి ము
ల్లోకములేలు మేను మదిలోఁదలపోయుదు నీనఖిత్వమున్. 61

చ॥ అనవినియింద్రుఁడిట్లను మహాత్మ భవద్హృదయస్థితింగనుం
గొన ఫణిభర్తజాలఁడనఁ గొండొకవారలఁ జెప్పనేల ? స
త్యనియమశీలివైన భవదాజ్ఞను మచ్చిరసావహించి యీ
యనిమిషరాజ్యసంపద నయంబునఁ గైకొనెదన్ ముదంబునన్. 62

గీ॥ అయిననేఁజేయు విన్నపం బాదరించి
మ చ్ఛచీపతిఁవగుచు సమస్తశత్రు
సైన్యబాధానివృత్తిని సల్పుమయ్య
కాద్రవేయాధిపతిగేయ కార్తికేయ. 63

మ॥ అనినన్ శౌద్రిముదంబునొంది సురలోకాధీశ నీవన్నమా
డ్కి నిలింపప్రచయాధిపత్యమున కంగీకారభావుండ నై

తిని నిక్కంబుగనన్న నాతఁ డెదఁ బ్రీతింబొంది సేనానిఁ జే
సెను గౌరీసుతు నంత దుందుభులు మ్రోసెం భూరిఘోషంబునన్. 64

వ॥ అట్లు శుభముహూర్తంబున సురతరుకుసుమవర్షంబులుగురియ బా
హులేయుం దేవసేనాధిపత్యంబునకభిషిక్తుం జేసి మయూరరథ్యవిరాజ
మానంబును గుక్కుటధ్వజశోభితంబును రత్నకింకిణికాలంకృతంబును
నగు కాంచనరథంబొసంగి యజ్జయంతగురుం డిట్లనియె. 65

క॥ తారకుఁడన నొకదానవ। వీరునికోర్తలకునోడి విబుధులు నేనున్
బీరముఁజెడినిన్న భయముఁ।గోరెదమోబాహులేయగూల్పుము వానిన్.

వ॥ అననాతండమందానంద కందళితహృదయారవిందుండై ప్రాక్శిఖరిశిఖ
రారోహణ విజృంభమాణ బాలభానుండునుంబోలె సమున్నతస్యందనా
రూఢుండై యెల్లవారలువినఁ బరిసరధరాధరదరీద్వారంబులు మారు
మ్రోయ నదంభవచోనిగుంభనంబున నిట్లనియె. 67

మ॥ వినుఁడీనాదు ప్రతిజ్ఞనెల్ల విబుధుల్ బృందారకారాతిసై
న్యనికాయంబు లసంఖ్యసంఖ్యలుగ నుద్యద్విక్రమంబొప్ప వ
చ్చిన నస్మద్భుజశక్తి శక్తిఁగొని నిశ్శేషంబుఁగాఁ బేర్చి యొ
క్కనిమేషంబునఁద్రుంచెదన్ సకలలోకంబుల్ ప్రశంసింపఁగన్. 68

క॥ అనవిని సురనికరంబులు। వనటలువిడనాడిగుహునిబహుభంగులుగా
వినుతించిరెంతయునద। భ్రినవాభ్రినదభ్రిమోద్భవమహోర్భటితోన్.

వ॥ తదనంతరమాబృందారకసందోహం బమితానందంబున నాతనిఁ ద్రి
దశాలయంబునకుందోడ్కొనిపోయి నిర్భయంబుననుండునంతనానమా
చారంబంతయుఁ దారకునిచారులెఱింగి మహావేగంబుననరిఁగి నిశాచర
మధ్యంబునఁజెన్నలరారు వజ్రాంగనందనునకు నిటలతటఘటితకరపు
టులగుచుఁ జోహారుఁగావించి. 70

చ॥ శరనిధితీరమందు గిరిజాతనయుం డతిభీషణంబుఁగాఁ
బరిసరభూధరంబులదు్రవంగను క్ష్వేళనొనర్చుట లుమానీ
శ్వరు లదియించు్రతోఁదెలుప జంభవిరోధి దురాగ్రహాగు్రఁడై
సురనికరంబులెల్లఁ దనచుట్టునుగొల్వఁగ నెత్తివచ్చుటల్. 71

సీ॥ ఆదిభిక్షుఁడు విరూపాక్షుఁ డెద్దానినిమ్మహీతలంబున రాజమౌళియగుట
బలియాచనావృత్తిఁ బరగు యుపేంద్రుఁ డెద్దానిచే శ్రీపతిత్వంబుఁ గనుట
మునిశాపనిహతి నిర్ధనుఁ డింద్రుఁ డెద్దాననరయఁ బునర్విభవాఢ్యుఁ డగుట
కూటిపేదలు సురకోటు లెద్దానిచేఁ బాలుపార నమృతాన్నభోజులగుట॥
మఱియు నెద్దాన జీమూతమండలంబు
దనర జగమున జీవనదాయియగుట
కల్గివిలసిల్లె నట్టి పెన్గడలి మహిత
తీరమును వారలందఱుఁ జేరుటయును. 72

గీ॥ అంత విబుధు లగ్నుహుఁ గని యడలి శరణుఁ
జొచ్చితిమనంగ నాతఁడు మెచ్చి వారిఁ
గాచుటయు వజ్రి వజ్రంబు వైచుటయునుఁ
జెచ్చెరనుఁ గుమారుఁడు దానిఁ జేతఁ బట్టి. 73

క॥ అనిమిషపతిఁ గనుటయు నది। గని హరి బెగడొంది బాహ్నికై దొర శరణా
ర్థిని బ్రోచి కావవే యన్నను టయు గుహుఁ డాతనికభయంబొసఁగుటయున్.

గీ॥ దాని కెదసంతసించి సుత్రాముఁ డపుడు
విబుధసేనాధిపత్యంబు వేడ్క నొసఁగు
టయును దానికాతఁడు శత్రుచయమునడఁతు
ననుచు నభయంబొసంగుటయునుఁ దెలుపఁగ. 75

వ॥ అంత. 76

క॥ సౌరకదంబంబునకుఁ గు। మారుఁ డభయ మొసఁగెనన్న మాటరయమునం
జారులపుడు దెల్పఁగ విని। తారకుఁ డతికోపదీప్తతామ్రాక్షుండై.

క॥ ఎట్టెట్టా! గట్టులదొర। పట్టిసుతుఁడు నాదు బాహుబల మెఱుఁగక బ
ల్దిట్టఁదనము మెఱయఁగఁ జే। పట్టి సురలఁ బ్రోవఁగడఁగు వాఁడే! తలపన్.

గీ॥ మంచిదమరేంద్రుఁడై ననుమామకోగ్ర। దోర్బలంబేరికైననుదుర్ఘటంబ
టంచుఁ దెలుపక తానయే తెంచువాఁడు। గాననింకొకపరిచవిఁగాంచునే మొ.

క॥ అనిపలికి కొలువుఁ గలయుం। గనుఁగొని తారకుఁడఖర్వగర్వంబున ని
ట్లనియెను వింటిరె చిత్రం। బనిమిషపతి నన్నుఁ దాఁకునఁట సేనలతోన్,

చ॥ దితిజసుతేంద్రు నిం జెనకి త్రెళ్లక నాయువుతోడఁ బోవు టా
శతధృతికైనఁ బోలదని స్వాంతములోఁ దలపోయ కిప్పుడా
శతముఖుఁడెత్తివచ్చిన భృశంబుగ మామక బాణపావకా
హుతినొనరించివైచెద దివౌకసులెల్లనుఁ బిచ్చలింపఁగన్. 81

గీ॥ అనుచు రోషారుణితనేత్రుఁడగుచు సురల
వీడుఁ గూకటివేళ్లతోఁ బెల్లగించి
నేలమట్టంబుఁగావింతు నేడె గాన
గ్రసన! సేనలఁగూర్పుము రయమమీఱ. 82

చ॥ అనిన మహాప్రసాదమను చాగ్రసనాసురుఁ డాక్షణంబ సై
న్యనివహముల్ రయంబు మెఱయన్నమకూర్చి వరాంగిసందనుం
గనుఁగొని రాక్షసేంద్ర! యిదె గ్రన్నన సేనలఁగూర్చినాఁడనం
చనుఁదెలుపంగ నాధనుజసోముఁడు డెందమునందుఁ బొంగుచున్. 83

వ॥ ఉన్నంత. 84

భుజంగప్రయాతము॥

స్ఫురద్దైత్యసేనాసమూహంబులోన । న్వీరాజద్ఘణంధాణభేరీధ్వనుల్ స్వ
ర్పురీనిర్జరుల్భీతిఁబొందం ధరాభృ। ద్వరుల్మారుమ్రోయంగ దైవారెనంతన్.

మ॥ కలఁగెన్వార్ధిచతుష్టయం బగలెదిగ్దంతీంద్రకర్ణంబు లా
కులతం జెందెనువిష్టపత్రయము సంక్షోభించె శేషాహి భీ
తిలెవాగీశుఁడు దిర్దిరం దిరిగెఁబృథ్వీచక్ర మల్లాడె నా
కులశైలవ్రజ మొప్పెసూర్యుఁడునుఁ దాఁ గుంఠీభవత్తేజుఁడై. 86

వ॥ అంత. 87

సీ॥ ప్రస్ఫురద్రథనేమి విస్ఫారితధ్వాన హసదదభ్ర నవాభ్రవిసర నినద
మమితదానాస్వాద నాగ తేందిందిర పృథుగానమిళితేభ బృంహితంబు
కంఖాణరింఖా విశృంఖలోద్ధూత ధరాపరాగపటలాక్రాంతనభము
సుభటకోలాహల క్షుభిత దిగ్వేదండకాండ విభ్రాజితకర్ణరంధ్ర॥
మురుతరధ్వజబద్ధపటోద్భవ ప్ర। భంజ నోద్ధూత పరిసరాభ్రవజంబు
నగుచుదైత్యేంద్రుసైన్యమత్యధికముగను। వెడలెనత్తఱిఁ జేజేలవీటిమీఁద.

మ॥ అమితాభ్రంకష కేతనస్థిత మహాహ్యద్ధూమకేతుప్రభా
సముదాయం బలరారఁగా ద్విపిశతాంచద్రథ్యరాజచ్ఛతాం
గముపై దానవసైన్యభర్త జయకాంక్షల్మీఱ నారూఢుఁడై
యమరద్వేషులుగొల్చిరాఁ గదలె దైత్యాధీశుఁడు న్మెచ్చఁగన్. 89

ఉ॥ ఫేరవకేతనవ్యూతులు భీషణమై మిఱుమిట్లుగొల్పఁగా
వారణరాడ్ద్విషద్ద్విశతవాహము లుద్ధతిఁబూన్చు తేరిపై
ధీరత జంభదానవుఁ డధిష్ఠితుఁడై త్రిదశాధివాసముం
జూఱఁగొనంగ వేఁ గదలె శుంభ దవక్ర పరాక్రమంబునన్. 90

సీ॥ భూతవక్త్రస్ఫురత్కేతుయుతోష్ట్రరథ్య లసద్రథారూఢుఁడై మహిషుఁడు
ఖరపుచ్ఛకేతుయుక్తఖరవాహాన్నతస్యందనారోహణుఁడై నిశుంభుఁ
డాయసధ్వాంక్షధ్వజాంచిత మేషవాహారూఢుఁడగుచు శుంభాసురుండు
భీషణ కూష్మాండవితతి సంవేష్టిత ఘనగజారూఢుఁడై కాలనేమి॥
హస్తమునగదఁదాల్చి గజాసురుండు
ద్విరదవాహనుఁడై నిమి విబుధవైరి
చిత్రతరరథ్యములనుబూన్చినరథంబు
పై మథనుఁ డొప్పి కదలిరి స్వర్పురిపయి, 91

శా॥ వింధ్యాద్రిప్రతిమానుఁ డబ్ధివరగంభీరుం డుదగ్రస్ఫుర
త్సంధ్యాదభ్రనవాభ్రవిభ్రమకృతాంచత్కేశుఁ డుద్యత్తరా
వంధ్యాస్త్రవ్రజయుక్తుఁడౌచును సురవ్రాతద్విషద్భర్తగ
ర్వాంధ్యంబొప్పఁగ నుగ్రవృత్తిఁగదలెన్ క్రౌంచద్రథారూఢుఁడై. 92

మత్తకోకిల॥ సైరిభోరగ భల్లుక ద్విపశాస నేభ తరక్షు సిం
హారి శల్య వరాహ భల్ల విహంగ కూర్మ ఖరోష్ట్ర వి
స్ఫారపుంగవ నక్ర వృశ్చిక జంబుక ద్విపి వాహులై
క్రూరతంజని యుద్ధతిం బదికోట్ల దానవసైన్యముల్. 93

వ॥ అంత. 94

మ॥ సురవిద్వేషణసైన్యమంతఁగురిసెం జోద్యంబుఁగా రక్తము
ల్వరడు ల్హోరలుసాచి భీషణముగా వాపోవఁజొచ్చె న్నద

ద్విరదవాజితము ద్రొగ్గతిల్లఁబడియెఁ భీమంబుగాఁబల్కె శం
కరసూనుం డని మిమ్ముఁదున్మనను చాకాశప్రభూతంబొగిన్. 95

క॥ ఆతీరున వివిధభయో। త్పాతంబులుబుట్టుటరసి దైవోపహతుం
డై తారకుండు దితిజ। వ్రాతముగొలువంగ నడిచె వడినిర్భీతిన్. 96

గీ॥ అంత దనుజేంద్రు ధైర్య శౌర్య ప్రతాప
సాహసములెల్లఁ గని నిశాచరులు మృత్యు
వశహృదయులై కదలి జని భాసమాన
మై వెలింగెడు స్వర్గంబుపై విడియఁగ. 97

మ॥ దనుజవ్రాత మసంఖ్యసంఖ్యముగ నుద్యద్విక్రమోపేతమై
ఘనవర్మాసిగదాశతఘ్నిపరిఘోగ్రప్రాసశూలాస్త్రశ
స్త్రనిశాతాయసచక్రకుంతధరమై స్వర్గంబునల్దిక్కులం
దు నుదగ్రంబుగఁ జుట్టుముట్టిదనరం దోడ్తోడ దౌవారికుల్. 98

వ॥ రయంబునఁజని సుధర్మాస్థానమధ్యంబున భద్రాసనాధిష్ఠితుండగు పాక
శాసనుంగాంచి జోహారుఁగావించి యిట్లనిరి. 99

లయగ్రాహి॥

సౌరకులపోషణ శతారధర భీషణసురారిమదశోషణ బలారి ! వినుమా దే
వారులుమదద్విరదవైరిఖరకూర్మకిరిభూరిరథవాహములపైరయముమీఱం
ధీరులయియెక్కినగవైరినగరంబిఁకఁ బురారిమొదలైనఁగొనువారమనుచుగ్రా
కారులయిలెక్కలకుమీరివివిధాస్త్రచయధారులయిపట్టణముఁజేరిరిదెలివిన్.

గీ॥ అధిప! దూత్యపురస్సరుండైనదైత్యుఁ
డరుగుదెంచి మోసలనుండెననుచు మ్రొక్కి
విన్నవింప నాకస్మికవిస్మయమునఁ
ద న్నిరీక్షణాపేక్ష నాస్థానమున్న. 101

వ॥ సురేంద్రుండును దౌవారికులంగని. 102

గీ॥ శీఘ్రమునఁబిల్వఁడన వారు జెచ్చెరఁజని
యిట్లనిరి ముజ్జగంబులనేలురాజు
నిన్నుఁదోడ్కొనిరమ్మనెనన్న వాఁడు
విని హసాదని వచ్చి యింద్రునకుమ్రొక్కి. 103

క॥ సురపతిపంపున నపుడొక। పరిచారకుఁడిడినపీఠిపైఁ గూర్చుని వాఁ
డురుతరగంభీరభాషల। హరిహయుఁగని యిట్టులనియె నందఱువినఁగన్

సీ॥ ఎవ్వాఁడు సింధుజాధీశ్వరాఖర్వసర్వంకషదోర్గర్వ నివారకుండు
ఎవ్వాఁడు విమతదిగీశ్వరావార్యధైర్యాహార్యవర్య శతారకుండు
ఎవ్వాఁడు విగతదైత్యేంద్రరాజ్యేందిరా క్రమసంస్థాపన కారకుండు
ఎవ్వాఁడు నిజభుజాహీనకృతాస్ఫాలనారావపాతిత తారకుండు॥
చండభుజదండమండిత ఖండపరశు
కుండలోప మోగ్రాసివిఖండితాహి
తేద్భుజాదండమండలుం డెవ్వఁడతఁడు
దారకుఁడువెల్చు విశ్వవిదారకుండు. 105

వ॥ అస్మత్స్వామియగు నతనిప్రభావం బిప్పటివారలందఱకు హృదయ
గోచరంబుగావున విశేషించి తెలుప నవసరంబంతకానరాదు. 106

ఉ॥ దేవ! పరాకుమాని భవదీయమనంబునఁజిత్తగింపు లో
కావనదీక్షితుండు రిపుహంత పరాంగిసుతుండు నన్నుసం
భావనఁజేసిపంపె నయవాక్యలు దానుగఁ గొన్ని మీసభ
న్వావిరినాడుమంచు నవి వాకొన నీకొనెదే ముదంబునన్. 107

సీ॥ అన నియ్యకొనెనింద్రుఁ డసుర యాతనిఁబల్కెఁ
దృప్తిఁ గశ్యపునకు దితి యదితి య
నంగ నిర్వురుఁగులాంగన లందులో
దితికి దైత్యులు నదితికిసురలును
నందనులై యుండ నలినజుండరుదెంచి
దైత్యావళికిరసాతల మమరుల
కమరావతియుఁ బంచియరిఁగిన మాపూర్వ
లోకకొంద ఱత్యంతయుద్ధకాంక్ష॥
లోకములనన్నిటినిగెల్చి నాకపురిని
ముట్టడించిన విష్ణుండు జుట్టువాలుఁ
బట్టి వారలందఱ మట్టుఁబెట్టఁ గొంద
ఱరిఁగి బలిసద్మమునుఁజేరి యణఁగియుండ. 108

చ॥ ముదమునసింతకాలమును మూఁడుజగంబులనేలుచుంటి వి
వెదిరిభయంబులేక నిఁక నేలెదవేమొకకొంతకాల మి
త్రిదశపురిం బితామహుఁడు దెల్పినపద్ధతినెల్ల మాతఁడు
న్మదిమదిదప్పిచెప్ప నదిపూర్వులెఱుంగమి నీకు దక్కెఁగా. 109

గీ॥ విడువుమిఁక నైననీయవివేక మఖిల
విభవములతోడ సురపురివిడిచిపెట్టి
చనుము నీవారితో బలిసద్మమునకు
లేనియెడ నీకు మేలించుకైనలేదు. 110

గీ॥ మఱియు నదిగాక దాయపంపకమునందు
మార్పులేకున్నఁ గొందఱునేర్పుమీఱి
మేలుజేపట్టుకొనెద రామిషముఁగాంచి
పొంచిహరియించు గోమాయువులవిధమున. 111

ఆ-వె॥ కొంతకాల మేము సంతసంబుననాక
పురమునేలఁదలఁచి యరుఁగుదెంచి
నార మీవు కొన్నినాళ్లు రసాతల
మేలఁజనుము శుభగశీలివైన. 112

గీ॥ కమలనేత్రుండు మాపాలఁగలఁడటంచు
గర్వపడకు మాయన మొన్నకాదె కదన
మందు నిల్వలేకను బెగడొంది పాఱ
వెంటఁదఱిమిరి మాసేన వీరభటులు. 113

గీ॥ నీకుఁ దలమావివీడని నిసు వృకంబు
దోడుపడి దైత్యవీకులఁద్రుంతుననియె
నఁట బలే గుడభ్రమింగినయట్టు వాని
కరడ మప్పడమని వేర యనఁగనేల ?. 114

గీ॥ కేశవుండెవ్వఁడలకార్తికేయుఁడెవఁడు
జాలు వారిమాటలనొకమూలఁబెట్టి
తనర మామకబుద్ధిపద్ధతిని నడువు
మేల మనలోనమన కిట్టియూరసంబు. 115

క॥ నాదుబల మీావెఱుంగుదు। కాదేమును నెన్న నిన్నఁగాదే నీవు
న్నీదుబలంబులువాఱుట। మోదముడిఁగి నేటికేచటి మొగతనమబ్బెఁ.

గీ॥ పృథులతపమున శివునిమెప్పించి యతని
చే ననన్యసాధారణమైన విద్య
వడసి దనుజసంతతికి గురుఁడును మంత్రి
యవుచు జయమునిప్పింప భార్గవుఁడు గలుఁగ. 117

క॥ పరిసేవ్యుఁడై నశంభుని। యురమునయిత మస్మదీయ యుగ్రాసి యలం
కరణమొనరింపఁగల దిఁక। సరికే యొరు లీవు సంధిసల్పకయున్నఁ.

క॥ అనవినిమనమునసంక్రం। దనుఁజులుకుచుఁగొలువుఁజూచి తారకుఁడేమీా
తనబలము నెదిరిబలమును। మనమునఁదలపోయ కిట్లుమానిసినను చుఁ.

క॥ చనుదెంచి దండువిడిసెనె। మనపుర్పై నళుకులేక ? మాామకతీవ్రా
శనిపాతాగ్నిం జవిఁజూ। పునేమొ నింకొక్కసారి పొలదిండులకుఁ.

క॥ అనిపలికి గురునిఁగనుఁగొని। వినయంబుననిట్టులనియె వింటిరె మీారుఁ
మనపీటిపైనిఁ దారకుఁ। డనిసేయఁగదండువిడిసి యనుమనుమాటల్.

క॥అనగురుఁడువల్కుదూతం।గనియింద్రుని మహిమవినఁడొకొ వ్యాదవిభుం
డు నముచి వృత్ర బలప్రముఖ నిశాటులకన్న వీనిఘన మేముండెఁ.

చ॥ చలముపలిర్ప వజ్రమునఁ జట్టుపలం దెగఁగొట్ట ము న్నిలా
స్థలమునఁబొమకొన్న గిరిసానువులంమఁ జరించు వారిదం
బులు గనుపట్టునేటికిని భూరితరంబుగనున్న తద్వ్రణం
బులపయిఁజుట్టు తైలపరిపూర్ణ పటచ్చరపాళి పోలికఁ. 123

వ॥ అదియింద్రునిప్రభావం బట్లుండనిమ్ము. 124

గీ॥ నీవు లేనిపోని నీతులుగూర్చి యా
కాశహర్మ్యమొకటి కట్టఁదలఁచి
యున్నవాఁడ వదియు యుక్తిమారుతము దాఁ
కునకు నిలువబోదు కూలుఁగాని. 125

క॥ వనరుహగర్భుఁడు మునుఁజే। సినపద్ధతి నుల్లనుచు సిగ్గఱి సభఁ బ
ల్కనినునియమించిపుత్తెం। చినచెడుగునకన్యములురుచింపమియరు దే.

వ॥ అని చిఱునవ్వు నవ్వుచు. 127

క॥ లోఁగడఁదపము నొనర్చుచుఁ। దాఁగినధూమోద్గమావృతమునమలినమా
మీఁగురుఁడువల్కె నయవా। గ్వాగురులంజిక్కి కాదె వడి రసురవరుల్.

గీ॥ పువ్వుఁదావియు నేకమై పొసరినట్లు
గలసి త్ర్యంబకస్ఫూర్తి రాగిలు నిశాట
పతియు శుక్రుండు స్వర్గంబు పైని దాడి
రాఁగఁ ద్రిదశుల కెట్లాజిఁ బ్రతుకవచ్చు? . 129

క॥ చాలునిఁకదూతకృత్యము। ప్రేలకుమన్యంబులిచట వేగమజని మీ
యేలికకెఱిఁగింపుము నే। డాలములో వెఱక నిల్వుమని దైతేయా. 130

గీ॥ వారిజాక్షునిచక్రంబుఁ వజ్రివజ్ర
ముగురిశూలంబు నొకట నుదగ్రవృత్తిఁ
బేర్చి మీసైన్యముల నాజి నేర్చునప్పు
డైన మముఁ జీరికింగొను నసురవిభుఁడు. 131

గీ॥ పరగఁ ద్రొక్కుడువడ్డసర్పంబు క్రోధ
ఘూర్ణితాత్ముఁడై నాల్కలు గ్రోలి రోజు
పగిదిఁ బేర్చు గుహునిశక్తి పైనిఁబడిన
యప్పుగద తారకుఁడు మా మహత్త్వ మెఱుఁగు. 132

ఆ-వె॥ దూతవగుటఁ బ్రతుకుఁద్రోవఁ గాంచితివీవు
తొలఁగుమిచటినుండి కొలిచినట్టి
వారినేరములకుఁ బతి దండ్యుఁడగుట నే
డాజిఁ దత్ఫలంబు నతఁడుగాంచు. 133

గీ॥ అనుచు వానిని వెడలఁద్రోయంగఁబనిచి
పాకశాసను దత్తఱపాటుఁజూచి
వానిభావంబుఁ గొండొకవడికి నిశ్చ
యించి గురుఁడిట్టులనియె నయ్యింద్రుతోడ. 134

సీ॥ అరయ సామాద్యుపాయ చతుష్టయంబులో
సామంబులెన్న యాసామ మసుర

లగుట వీరియెడఁబోనఁగనేర దదిగాక
ప్రాప్తరాజ్యమదాంధు లగుకతమున
దానంబునకువారు దలచూప రందఱు
నేకఫలాపేక్ష నెనఁగుచున్న
కారణంబున రంధ్రమారసి భేదంబుఁ
బుట్టించు టేరికిఁ బోలకుండు॥
నెనర ముఖ్యకర్తవ్యాంశ మొండుదలఁపఁ
దుదియుపాయంబె లెస్సగాఁదోఁచుచుండెఁ
గాన సేనలఁగూర్చి సంగ్రామముఖము
నందు రిపుల గెల్వుమనంగ నాతఁడలరి. 135

చ॥ అనలయమాశరేంద్రవరుణానలమిత్రధనేశ్వరాదులం
గనుఁగొని యాలకించితిరిగాదె బృహస్పతి వ్వాక్యవైఖరుల్
మనకు గుహుండుగల్గ ననుమానములేఁటికి గెల్తు మిప్పుడే
నని మొనలోన దానవుల నంచు వచింపఁ గుమారుఁ డిట్లనున్. 136

చ॥ వినుమసురేంద్ర! దేవతలపీటికిఁ దారకుఁ డెప్పుడేగుదెం
చెను దగ నప్పుడే నతఁడు క్షీణదశంగనెనంచు డెందమం
దునఁదలపోయు మస్మదురుదోర్బలవహ్నికి దానవాళి నిం
ధనమొనరింతునీవును ముదంబున సేనలఁగూర్పు నావుడున్. 137

వ॥ పురందరుండును రయంబునఁ బురంబెల్లఁ జాటంబంచినఁ దత్క్షణంబ.

సీ॥ శతకోటిఘంటికా ఘణఘణాత్కార విరావంబుచే నుప్పరంబువగులఁ
గమనీయతర నేమికానిస్వనంబున రోదసీకుహరంబు భేదిలంగ
మణిమయదీప్తులు మధ్యందినద్యోతమాన ఖద్యోతబింబమునుఁగెడవ
నక్షీణలక్షణలక్షి తాజానేయరింఖాస్వనంబు గర్జితమును నగ॥
ధ్వజపటోద్భవ భూరిపరిభంజనంబు
పరిసరాభ్రవ్రజంబును బాఱఁదోలఁ
దనరు దివ్యరథము నాయితంబుఁజేసి
మొలమిఁదెచ్చె మాతలి విబుధేంద్రుకడకు. 139

క॥ చండచతుర్దంతద్యుతి । నిండి దిశలఁబర్వఁ గనులనిప్పులొలుక నా
ఖండలునిదరికిఁ బ్రాగ్ది। క్కుండాలంబేగుదెంచె శుంభల్లీలన్. 140

చ॥ తత తనుదీప్తిపుంజము సుధామయవీచులఁ గేళిసేయఁగాఁ
బ్రతిబలవీరులుల్కఁగను వల్గన ధావన రేచితాది స
ద్గతుల నెనర్చు దేవతురగంబును సాహిణిదెచ్చె దేవతా
పతియరుదంద నిర్జరులు బాపురెయంచు నుతించునట్లుగాన్. 141

వ॥ అయ్యవసరంబున. 142

గీ॥ ప్రళయ సమయవిజృంభితోగ్రగతిఁ బేర్చి
జగములన్నియు సమయింపఁ జాలునట్టి
రూపమున నెప్పి మేషాధిరూఢుఁడగుచు
నని నెనర్పరిగఁగడఁగి సప్తార్చివచ్చె. 143

ఉ॥ మీసముదువ్వుచున్ భటులు మృత్యువు వెంటను గొల్చిరా మహో
ల్లాసముమీఱఁగా నిరుగెలంకులఁ బాశము గాలదండమున్
భాసిల దంష్ట్రికాకలితవక్త్రముద్రగకరాళమై తగం
గాసరవాహనంబలరఁ గాలుఁడువచ్చె దురాగ్రహాగ్రుఁడై. 144

శా॥ రక్షస్సైన్యము వెంటఁగొల్వఁగ మహోగ్రప్రస్ఫురత్ఖడ్గధా
రామాత్రుండై పటుబభ్రుకేశరుచి సంధ్యాకాలరాజజ్జగ
చ్చక్షుఃకాంతులఁ గేళిసేయ మనుజస్కంధాంతరారూఢుఁడై
క్రొక్షేయప్రభలుల్లసిల్లఁగను రక్షస్స్వామి వచ్చెన్వడిన్. 145

మ॥ అమితక్రోధముతోడ వారినిధిగర్భాగారసంవాసులౌ
నమరద్వేషులుగొల్వఁ బాశకరుఁడై యంభోధినాథుండు హం
సములంబూన్చినతేరినెక్కి వడిగాశత్రుక్షయోద్యోగియై
నముచిధ్వంసినిడాయవచ్చెను మహానందంబు రెట్టింపఁగన్. 146

చ॥ సరభసవృత్తితోఁ బవనసౌరభముల్ హరియించి దేవతా
వరులకువిందుచేయుచునుఁ బ్రాంతవలాహకపంక్తిఁదూల్చుచున్
హరిణవరాధిరూఢుఁడయి యగ్నిసఖుం డతిశీఘ్రమొప్పఁగా
హరిహయుఁజేరవచ్చెను మహత్తరకౌతుకపూరితాత్ముఁడై. 147

క॥ నలకూబరుండు నిజసేI నలనడుపఁగఁ దురగవాహనం బెక్కి గదా
కలితభుజుఁడగుచు ధనదుఁడు। బులోమజేశుని సమీపమునకున్ వచ్చెన్.

సీ॥ ద్వాదశాదిత్య భాస్వర వసు విశ్వ సాధ్యానిల తుషిత రుద్రాశ్వినీ ఖ
చర సిద్ధ గంధర్వ చారణ గరుడాహి యక్ష కిన్నర గుహ్యకాది తేయ
వరమహోరాజ కింపురుషాది దేవతాగణములశ్వ రథేభ ఘటలమీఁద
నారూఢులగుచు చాపాస్త్ర శస్త్ర ప్రాసపరిఘ త్రిశూల ముద్గర గదాసి॥
పట్టిసాంకుశ తోమర పరశు కుంత
శక్తి భిండివాల శతఘ్ని చక్ర పాశ
ముసలధారులై ముప్పదిమూఁడుకోట్ల
దేవతల్గదలిరిమహో తేజమలర. 149

క॥ అంతటఁ బురందరుఁడు దన। స్వాంతములో విశ్వరూపుఁజక్రధరుఁ రమా
కాంతునిఁదలంచి మ్రొక్కుము। రాంతకుఁడత్యుద్ధతిం బ్రయాణోన్ముఖుఁడై.

మ॥ దరచక్రాసిగదాశరాసనముఖోద్యత్సాధనోపేతుఁడై
వరహేమాంబరసుగ్రజస్ఫురణ మొప్పన్ జాతరూపక్షమా
ధరశృంగంబున నీలనీరదముచందంబై యదభ్రిస్ఫుర
ద్గరుడస్కంధముమీఁదఁబొల్చి కదలెన్ దైత్యాళి కంపింపగన్. 151

గీ॥ అంత విబుధాధినాయకుఁ డమితభక్తి
స్వాంతమందు నామ్రేడితమై దలిర్పఁ
బార్వతీరమణుని పాదపద్మములను
వేడ్కధ్యానించి యిట్లని వినుతిఁజేసె. 152

మ॥ మును దేవాసురు లంబుధిందరుచుచో భోగీంద్రవక్త్రంబునం
దున హాలాహలముద్భవింపఁగని నిన్నున్వారుప్రార్థింప దా
నినిలీలంగబళింపవే? యగుబలే; నీకంతసుర ధర్షమా
ననురక్షించుట బాసవాల్దొరలమిన్నా పార్వతీవల్లభా. 153

వ॥ అని యివ్విధంబునఁ బ్రార్థించిన నత్తఱిఁబ. 154

సీ॥ పటుజటాపటలశోభాసంచయ మదభ్రసంధ్యా భదీప్తు లసవతుఁజేయఁ
బ్రస్ఫురితోదగ్ర ఫాలనేత్రంబునఁ బ్రళయకాలానలజ్వాల లెగయఁ

క్రోధఘూర్ణితవక్త్రకుహరికిఁ గ్రైవేయకఫణిఫణా మణిఘృణులన్నె పెట్ట
సూరెలఁ శిత త్రిశూలోజ్జ్వలితహస్తులగుచుఁ బారిషదసైన్యములునడువ॥
ప్రళయసమయనటన్మహారౌద్రరూప
ధారియై జగత్సంత్రాసకారి యగుచు
వృషతురంగంబుపై నెక్కి వెడలి నముచి
శాసనునిముందుబోడకట్టె శంకరుండు. 155

గీ॥ అట్లుపోడగానవచ్చిన గట్లఁజేసి
యల్లునకు భక్తివందనం బాచరించి
దేవ! నీకింకరుని వేడ్కఁ బ్రోవవలయు
సమయమని వేఁడినాఁడ నో సదయహృదయ. 156

వ॥ అన నట్లకాకయని పరమనయాళుండగుమహాకాలుండు దానవకాల
రాత్రియగు శూలంబు లీలందనకేలఁ దాలిచి సంగరోన్ముఖుండగుట
యు నచ్చట. 157

గీ॥ త్రోపువడి దూత తారకుతోడ నచటి
వార్తఁ దెలుపఁ దదాస్థానవర్తియైన
దానవానీక మరుణాయమానవిపుల
దృష్టినలరింప దిశల నీరెండఁగాచె. 158

వ॥ అంత. 159

గీ॥ ఘన ఘనాఘన గంభీర గర్జనంబు
విన్నమృగరాజుగతినిక్కి విలయదండ
ధరునిపోలికె బేర్చి యుద్దండలీల
దనుజపతి చమూవరకోటిఁ గనఁగ వాఁడు. 160

సీ॥ చండరుక్శీతాంశుమండలంబులఁ గర్ణ
•కుండలంబులు జేసికొనెడువాఁడ
మహితోగ్రచల దూర్మిమాలిసప్తకమును
జెలఁగి గండూషంబుఁ జేయువాఁడఁ
బుండరీకభవాండ భాండ పంక్తుల వేడ్క
మీఁజ గుటుక్కున మ్రింగువాఁడ

హరిహరాబ్జజుల పెంపఱి నితం డితఁ డీతఁ
డనికట్టి తెచ్చి పేర్కొనెడువాఁడ॥
నేను నేనని బల్లోకధమూని నిమియుఁ
గాలనేమియు జంభుండు గ్రసనుఁ డధిపు
ప్రమోల నమితాహవోత్సాహలీల నోల
లాడుచు వచించి రిచ్ఛావిహారు లగుచు. 161

వ॥ అచ్చట సుధర్మాస్థాన సమీపంబున. 162

ఉ॥ ఆతఱి వాయువేగతుర గావలిఁబూన్చిన తేరు వేడ్కతో
మాతలి ముందునిల్పఁ బవిమండితదక్షిణహస్తుఁడై బలా
రాతి తనుత్రముం దొడిఁగి క్రన్ననఁ దద్రథమెక్కి దైత్యసం
ఘాతవిఘాతమున్ సలుపఁగాఁ గదలె న్నిజశంఖమొత్తుచున్. 163

వ॥ అయ్యవసరంబున. 164

సీ॥ పత్పత్త్రిరాడ్ధ్వజప్రభ నిర్జరద్విష
ద్దృగ్దుర్నిరీక్ష్యమై తేజరిల్లఁ
ప్రస్ఫురద్రత్నరుగ్వ్రజ ముదగ్రప్రాజ్మ
హీభృదగ్రోజ్జ్వల దినుని నవ్వ
గంభీరతరనేమికాధ్వను ల్ఘనఘనా
ఘనసముద్భవ మహాధ్వానులఁ గెడపఁ
బవనభుగ్భ్రగథ్య భాస్వద్విచిత్రవ
ర్ణప్రభ ల్మిఱుమిట్లు రహిఁ గలిర్పఁ॥
గ్రమ కింకిణీ ఝుణఝుణత్కారనిస్వ
నంబు దిగ్ద్విపస్తోమ కర్ణక్షుభిత మొ
నర్పఁ దనరారునట్టి స్యందనమున వృషు
సరభసంబునఁ దెచ్చెను క్షుత్తయెలమి. 165

శా॥ అంభోరాశిగభీరుఁ డుగ్రసుతుఁ డుద్యచ్ఛక్తివిభ్రాజిదో
స్తంభుండై విలసత్తనుత్రరుచి రక్షస్తోమదృక్త్రాసమున్
శుంభల్లీల నొనర్ప విస్ఫురితప్రాక్క్షోణీభృదారూఢడిం
భాంభోజాప్తుఁడు వోలెఁ దద్వరశతాంగారోహకుండై వడిన్. 166

ఉ॥ సారసనాభ శంకరులు చక్రి మహోజ్జ్వల శూల పాణులై
సూరెలఁ గ్రోల్చిరాఁగఁ ద్రిదశుల్ నిజసాధనయుక్తులై వడిన్
భూరితరార్భటిన్నడువఁ బొల్పగ శంఖము నెత్తుచున్ సుప
ర్వారిసమూహముం గదిసె నంబుధిఁ దాఁకు నగస్త్యునట్లుగాన్. 167

వ॥ ఇవ్విధంబున నుభయసైన్యంబును భయశూన్యంబై రథికులు రథి
కులును గజారోహకులు గజారోహకులును నాశ్వికు లాశ్వికులునుఁ
బదాతులు బదాతులును నుప్పొంగిన సముద్రంబుల తెఱంగున నడి
వ్రాని కులశైలంబుల మాడ్కి నుఱుమని చిచ్చుఱపిడుగులతీఱున
నుడుగని కాఱుచిచ్చుల విధంబునఁ బొలివ్రాని ధారాధరంబులచాడ్పున
నాభీలగర్జితంబులగు మద వృషభంబులపోలికె నురలెడు కాలవ్యాళం
బులకరణి నుబ్బుగల బెబ్బులులపగిది నురువడింపని భద్రదంతావళం
బుల చందంబున నుదుటుగల మృగేంద్రంబులకైవడి సింహనాదం
బులు చేయుచు నహంకరించుచు హుంకరించుచు ధనుర్గుణంబుల టం
కరించుచు శరంబులు వరగించుచు భుజాస్ఫాలనంబుల విజృంభించుచు
నట్టహాసంబు లొనర్చుచు నితరేతరాహ్వానంబులు సేయుచు నన్యోన్య
తిరస్కారంబు లాచరించుచు నొక్కగజంబునకుఁ బెక్కురథికులు నొ
క్కరథికునకుఁ బెక్కువారణంబులు నొక్కహయంబునకుఁ బెక్కుప
దాతులు నొక్కపదాతికిఁ బెక్కుసైంధవంబులు నొక్కపదాతి కొక
పదాతియు నొక్కరథికున కొక్కరథికుండు నొక్కతురంగంబున కొక
తురంగంబు నొక్క ద్విరదంబున కొక్కద్విరదంబు నొక్క ద్విపంబు
నకుఁ బెక్కుగుఱ్ఱంబులు నొక్కగుఱ్ఱంబునకుఁ బెక్కుసామజంబులు
నొక్కపదాతికిఁ బెక్కురథికులు నొక్కరథికునకుఁ బెక్కుపదాతులు
నన్యోన్యజిగీషా పరతంత్రాఁకునంత గొప్పచప్పుడు లుప్పతిల్ల బాహా
వులప్పళించుచుఁ గోపంబునఁ జూపుల నిప్పులుప్పతిల్లంజేయుచు నరా
తుల నిలునిలుండని యెలుంగెత్తి పిలిచి నిలిచియెదిరించి నిస్త్రింశధా
రాపాతంబుల భుజశాఖలు నఱకుచు యెదురుగనుండి చూచు తమ
యేలికల కుబ్బు పుట్టించి కయ్యంపుటురవడిఁ గనంబడఁజేయు నిలిం
పులును; భీషణంబగు రోషంబున ఖడ్గాఖడ్గిం దలపడి బెడిదంపుటడిదం

బులు బొడిపొడియై పుడమిఁబడిన నడరువడినిగుడ వెడవెడవ్రేఁక బాహాబాహిఁగచాకచిం బెనంగి పగితులఁ జిడిముడిఁ బడఁజేయుదానవులును; దుర్వారగర్వాకరదర్వీకర భీకరంబులగు కరంబులఁ బరిపంథిసందోహాశిరోజంబులఁబట్టి గరకరిస్సెఱియుసురియలురంబునఁగ్రుచ్చి డాక్కలుజిల్చిన బుసబుసవెడలుప్రేవులప్రోవులదిమి దిట్టతనంబు మెఱయ నడుమఁజుట్టినట్టిగట్టిచెఱంగులనడంచికట్టికొని యాడుఁగఱచుచు శూలంబులఁబొడువసంకింపఁ దెంపుఁజెడకఁ బంతంబు మెఱయఁ గుంతంబులెత్తిగిరగిరంద్రిప్పుచు నెమరనిలచి బల్లెంబ వేని ప్రేటుఁదప్పించుకొనుమని మాటలసందడిన్నఱిపించి మొగంబునకుగురిఁజూపి కక్షంబున వ్రేసి వేడినెత్తురు బుడబుడఁబైకుబుక నేలంబడఁద్రోచి చిత్రవధంబొనర్చు గీర్వాణులును; బెడబొబ్బలిడుచుఁ జలికాండ్రకుఁదోడువడి వడివడి కరవాలభిండివాలముసలముద్గర తోమరపరిఘాదిసాధనంపు మొఱవళ్లెఱింగించుచు మునుదమువారల నొప్పించిన ప్రతిపక్షహస్తవిన్యస్తకుంతంబుల నట్టనడిమికిందెగఁగొట్టి కట్టలుక బిట్టెగసి జగజెట్టితనంబుదనరఁ జిచ్చఱ పిడుగులవలెఁ జుట్టుముట్టి నిజకులస్థాన పౌరుషంబులఁదలంచికొని మించికొనునభిమానంబుతో నచ్చటచ్చటమచ్చరంబునఁ బెచ్చుపెరిగి వియచ్చరబలంబున విచ్చలవిడిఁజొచ్చి వచ్చి నొచ్చువారిం జచ్చువారింగని వీరగర్వంబునబీరంబులాడు నిశాచరులును; బాలివ్రానిబంటుతనంబునఁ గంటకులపైనురువడించి యహంకరించి హుంకరించుచు మొగంబులుజేగురింప వేగురించు సాహసోత్సాహసంపదలతో నింటిజోదులఁదలంచికొని నిజభుజాంగదంబు లొండొంటితోనొరయ మహాట్టహాసంబునఁబరిసరధరాధరదరీ ద్వారంబులు మాఱుమొఱయ భుజాస్ఫాలనంబున దిగ్గజంబులు జెవుడువడయ దోఃప్రతాపంబు మెఱయ నిష్ఠురగదాఘాతంబులఁ బరులశిరంబులు భిన్నంబులుగావించి వలకేలఁజక్రంబులుద్రిప్పుచుఁ బఱతెంచుపెఱజోదుల కడ్డంబుఁజొచ్చి తొల్లిటివైరంబులుదలంచికొని ముసలంబుల ముంగాళ్లు విఱుగఁగొట్టి ఖడ్గంబుల శిరోధులందునిమి తమతమప్రతిజ్ఞలనెఱవేర్చికొను సుపర్వులునుఁ; గలిగి ఘోరంబుగాఁబోరునప్పుడు నుగిలినవర్మంబులునుబగిలిన చర్మంబులునుఁ దునిసినశిరంబులును దునుకలైననరంబులును ద్రవ్విన

డొక్కలును గ్రొచ్చిన పక్కలును ఛేదింపబడినఛత్రంబులును భేదిం పఁబడిన గాత్రంబులును ద్రెంచిన తొడలును నొంచినమెడలును వ్రేయఁబడు గండంబులును గోయఁబడు తొండంబులును నలిగినజానువులును విచ్ఛిన్నంబులైనకర్ణంబులును వితథంబులైనపదంబులును విశీర్ణంబులైననాసికలును విదళితంబులైనజంఘలును భగ్నంబులైనదంతంబులును భగ్నంబులైనముఖంబులునుఁ బిండీకృతంబులైనకోదండంబులును ఖండితంబులైనదోర్దండంబులును వికృతంబులైనకబంధంబులును సభంగంబులైన సకలాంగంబులును నుగ్గినరథంబులును మ్రొగ్గినగజంబులును వ్రాలినధ్వజంబులునుఁ గూలినహయంబులును జిందఱవందఱలైన భటసమూహంబును బ్రోవులగుప్రేవులును బొరలెడుమేనులును నుబ్బియాడెడు భూతభేతాళగణంబును నై; ఖండితశరంబులుగుముదంబులుగా విదళితశంఖంబులు ఫేనంబుగా వికలీకృతాతపత్త్రంబులు బుండరీకంబులుగాఁ గీకససంచయంబు సైకతోత్కరంబుగాఁ గేశకలాపంబులు శైవాలంబుగా దీర్ఘభుజావ్రజంబు భుజంగమస్తోమంబుగా కరవాలంబులుజలచరంబులుగాఁ జామరంబులు రాజహంసంబులుగాఁ గంకగృధ్రానీకంబులు జలవిహంగమంబులుగా నరంబులుజలూకంబులుగాఁ బలలఖండంబులుబంకంబుగా శోణితంబుతోయంబుగా మోహినీభూతజాతంబు స్నానాగతసుందరీసందోహంబుగా రణాంగణంబు శోణనదంబుచందంబున నభిరామంబయ్యె నయ్యవసరంబున.

క॥ యముఁడును గ్రసనాసురుఁడునుఁ దమకంబున నొకరి నొకరుదర్పితులై దాఁ
కి మహోగ్రశాతశరవర్షములను గురియించి రుభయసైనికులదరలన్.

ఉ॥ అప్పుడు ధర్ముఁ డుగ్రుఁడగు చాగ్రసనాసురుమీఁదఁ బ్రాసముల్
గుప్పినవైవ నయ్యది యకుంఠితతేజముతోడఁ దాఁకి వాఁ
డెప్పటిచందమున్విడిచి యేత్తెఱఁ దక్కుచు మూర్ఛకన్నులం
గప్ప రథంబుపైఁ బడినఁ గన్గొని జంభుఁడుదగ్రమూర్తియై. 170

చ॥ ఎదురుగవచ్చి దండధర! యెచ్చటికేగెఁగబోలునీకు నీ
మదమడఁగించెద న్నిముసమం దిఁక నిల్వుమటంచుఁబల్కి బె

ట్టిదముగ భిండివాలము గడిందిమగంటిమితోడనైవ న
య్యదివడిఁద్రాకెఁ గాలుఁడు రయంబున మూర్ఛిలి లేచి లిప్తలోన్. 171

గీ॥ అంతఁ దెలివొంది గ్రసనుఁ డత్యధికరోషుఁ
డగుచు యమునిపై నరిమర్దనగద నైవ
నతఁడుగని యుదగ్రస్ఫూర్తినలరి కాల
దండమును బ్రయోగించెను దానిపైని. 172

క॥ అప్పుడుగదయును దండము। నుప్పరమున కెగసి పోరుచుండఁగఁ బ్రళయం
బుప్పతిలునే మొ జగముల। కిప్పుడె యనికొనుచునుండి రెల్లఱుభీతిన్. 173

ఉ॥ అంతటఁ గాలదండము రయంబున నగ్గదయేపడంచి దు
ర్దాంతపరాక్రముండయిన దానవసైన్యపతి న్నితాంత వి
క్రాంతివిలాసమొప్పఁగ నఖండితమై వడిఁదాఁకి నొంప న
త్యంతవిభీతచిత్తుఁడయి యాతఁడుమూర్ఛిలె వేల్పులుబ్బఁగన్. 174

గీ॥ అంత నొకముహూర్తంబున కసురమూర్ఛఁ
దేలి యత్యంతరౌద్రుఁడై కాలభటుల
ముద్గరంబున నొంప యముండు క్రోధ
ఘూర్ణమానమానసుఁడై యుదీర్ణవృత్తి. 175

వ॥ దైత్యసైన్యంబుపయింగవిసి. 176

క॥ కొందఱు శూలంబులచేఁ। గొందఱు అస్త్రముల చేతఁ గొందఱు గదచేఁ
గొందఱు ముద్గరముల చేఁ। గొందఱు ముసలముల చేతఁ గూల్చెన్ ధరణిన్.

వ॥ అంత గ్రసనుండదిగాంచి కృతాంతునిపై నితాంతశరవర్షంబుఁ గురిసిన
నాతండును దోడన దచ్ఛరజాలంబులఁ ద్రుంచుచుఁ బరిపంథిసూతకే
తురథరథ్యంబులఁ బడఁగొట్టిన. 178

మ॥ విరథుండై గ్రసనాసురుండు జలముల్ బీరంబు వాటిల్లఁ దాఁ
కి రహిం గాలునిఱొమ్ముపైఁ బిడుగుమాడ్కి న్ముష్టిచేఁ గుద్దీ భీ
కరలీలన్నడికట్టుదట్టిఁగొని వేడ్కన్ బల్మియుం ద్రిప్పుచుం
ధరణింగొట్టె జయంబుఁ జేకొనియె దైత్యశ్రేణు లుప్పొంగఁగన్. 179

గీ॥ అంతటఁ గుబేరజంభు లత్యధికరోషు
లగుచు శరవృష్టి నన్యోన్య హయ శతాంగ
సూత కేతు వ ర్మాస్త్రసంఘాత భేద
నంబొనర్చెడువేళ ధనదుఁడుగినిసి. 180

క॥ ఒండొక తేరెక్కి సముద్దండత గద వైవ నది నితాంతరయమునఁ
జండతరంబుగఁ దాఁకిన గండడఁగఁగ జంభుఁ డవనిగదలఁగ నెఱిగెఁ.

సీ॥ అదిగని జంభుండు హతుఁడయ్యెనని కుజం
భుండెంచి మనుజధర్మునిశరాళి
చేఁగప్పి ధనువును సిడమునుఁ ద్రుంపంగ
ధనదుఁడుగినిసి శక్తినిరయమున
వైవ నయ్యదిదైత్యువక్షంబుఁజీల్చి పా
తాళంబుఁజొరఁగ నద్దానవుండు
క్షణకాల మవని మూర్ఛఁబడి క్రమ్మఱలేఁచి
ఖండపరశుమిత్రుఁ గాంచి తనదు॥
పట్టసాయుధంబుఁ బఱపిన నయ్యది
ఱొమ్ముఁదాఁక నతఁడుసొమ్మసిల్లి
కేతుదండ మప్డు డూతగాఁగైకొని
తేరిపైనిఁబడియెఁ దెలివిదప్పి. 182

క॥ అదిగని నైరృతి నిశితప్రదరములు కుజంభుసేనపైఁబఱపి నవాం
బుదముగతింగర్జించుచుఁ గదిసి రిపునినొంచె ముష్టిఘాతంబులచేఁ.

మ॥ నరధర్మొండును మూర్ఛఁదేలి దనుజేంద్రస్తోమముండాసి దో
స్స్ఫురణంబొప్పఁగ గారుడాస్త్రమును బొల్పొందం బ్రయోగింప న
ప్పరమాస్త్రం బురుభీకరాకృతుల శుంభల్లీలమాయించె ని
ర్జరవిద్వేషణులం గుజంభుఁ డెదలోసంత్రాసముంజెందఁగఁ. 184

గీ॥ అట్టు లమ్మహనీయాస్త్రి మసురవరులఁ
బొరిఁగొనుచునుండ గని కుజంభుండు గినిసి
కఱకుటమ్ముల నిధినాయకమకుటం బ
వనిఁబడఁగవైవ నాతఁడు వగ్జిఁజేరె. 185

ఆ-వె॥ అంత దానవేంద్రుఁడైన కుజంభుండు
దనముసుండిఁవైచి తత్క్షణంబ
యక్షులనుజయించి యతిశీఘ్రమున ధన
దుని కిరీటమపుడుగొనుచునరిగె. 186

క॥ ఆతఁడె నైరృతిగని మా। యాతిమిరముఁగప్పి దానవావళినెల్లన్
భీతిలఁగఁజేయమహిషుఁడు। ఖ్యాతిగమాయించెఁదానినస్త్రాస్త్రముచేన్.

సీ॥ అదిగని దానవులతిమత్తచిత్తులై నైరృతిపైనిబాణములుగురియ
నాతఁడు ప్రళయకాలాంతకుఁబోలి కుజంభుసారథి నొకసాయకమున
నశ్వంబులనునాలుగమ్ములసమయింప నతఁడుగోపమున నైరృతినిడాసి
ఖడ్గంబుచేఁదలఖండింపఁబూనెడుతఱిఁ బాశి తనవల్లెత్రాటిచేత॥
నా కుజంభుని హస్తద్వయంబుఁగట్టి
పటుగదాదండమునఁ దలఁబగులఁగొట్ట
రక్తమునుగ్రక్కుకొనుచు నారక్కసుండు
పృథ్విఁబడె రాత్రిచరకోటిపిచ్చలింప. 188

గీ॥ అతనిదురవస్థఁగని మహిషాసురుండు
గోణపతి పాశకరుల ద్రింగుటకుఁదలఁచి
కదియునేతేర వారలుమదమువిడిచి
వజ్రపాణిపిఱుందకుఁ బాఱిరంత. 189

గీ॥ అంబురుహవైరి చంద్రానిలాస్త్రములను
వైవ దైత్యులు తచ్ఛైత్యబాధచేతఁ
బీడ్యమానసర్వాంగులై బెగడిపాఱఁ
గాంచి వారలకిట్లనెఁ గాలనేమి. 190

ఉ॥ దానవులార! మీరిటులధైర్యముఁదూలుచుఁ బెంపుఁదక్కినం
బూనికచెల్లకున్నె శివపుత్త్రునకింక బలాఢ్యులైన మీ
లోనొకరుండెచాలుదురు లోకములన్నియుమట్టుబెట్ట; హా
దీనునిమార్గమిట్టిదని తెల్పిన మీ గురుఁడెవ్వఁడోగదా. 191

ఉ॥ ఇవ్విధిఁబాఱినం దితిసుతేంద్రుఁడుమిమ్ములఁబోవనిచ్చునే?
నవ్వరెవైరివీరులు; మనంబునధైర్యముఁబూని నిల్వుఁడే

జివ్వకుఁజొచ్చి యిత్తఱినిఁజెచ్చెరమాయలుగొన్నిపన్ని మీ
కొవ్వనివారినెల్లఁ బ్రగమయుక్తినడంచెద నంచుఁబల్కుచున్. 192

గీ॥ మాయలకుఁజొచ్చి పదివేల తోయరుహహి
తులను నందఱనగ్నిహోత్రుల సృజింపఁ
జంద్రుఁడవ్వేడిమికిఁ దాళఁజాల కపుడు
సంగరస్థలివిడిచె నిర్జరులు బెగడ. 193

గీ॥ అంత సూర్యుఁడాతనిమాయనరసి శంబ
రాస్త్రమునుఁబ్రయోగించిన నందుచేత
దైత్యులొండొరులకును నాదిత్యులట్లు
దోప నన్యోన్యహతులచే ద్రుంగిరిలను. 194

గీ॥ అపుడు నిమి కాలనేమికిట్లనియె నకట
నీ కతనఁ బదిలక్షల నిర్జరారు
లడఁగి రిఁకనైన వేగ బ్రహ్మాస్త్రమిపుడు
బఱపుమన విని యాతఁడాపగిదిఁ జేయ. 195

వ॥ దానిచేశంబరాస్త్రంబు పెంపడంగిన సూర్యుండుగ్రుండై మహేంద్ర
జాలంబునఁబ్రవేశించి యనేకసూర్యులఁగల్పించి యగ్నివర్షంబుగురి
సినఁ బవమానుండును దోడుపడి దేవారులఁ గారాకులనేర్పుపగిదిగా
వింప దాన దానవాళి గాఱ్చిచ్చుబొదివినకాననంబు తెఱంగున ను
ఱుమగుటంగని కాలనేమి మేఘరూపంబుధరించి సూర్యబహుత్వంబు
వారించి మిక్కుటంబుగవర్షించి దానవులఁబ్రతికించి త్రిదశులబాణవ
ర్షంబుననోడింప నవ్విబుధులుగతిఁజెడి శీతబాధాపీడితులై యుండిరంత.

గీ॥ అశ్వినీదేవతలు సమరాంగణమున
కరిగి బాణవర్షముఁగురియఁగ నుదగ్రుఁ
డగుచు నాకాలనేమి సాయకనికాయ
మునుబఱపి వారినొప్పింప గినిసి వారు. 197

ఆ-వె॥ పైనివచ్చు బాణపంక్తులనుఱుమాడి
యఱువదేనువాఢియమ్ములేసి

దానవులఁగలంపఁ దలఁగకవారును
గదిసివారిపైని గదలువైవ. 198

క॥ అంతట నశ్వినులెగసి ర। నంతపథంబునకవారణంబుగ గదల
త్యంతాభీలంబునఁ ద।త్ర్వాంతరథవ్రాతములనునడచెకా జెలుచక.199

ఆ-వె॥ ఆకసమువనుండి యశ్వినులస్త్ర శ
ములనుగురియ భయముముప్పిరిఁగొన
దైత్యులెల్ల దీనదశకురా భీషణా
కారుఁడగుచు నంతఁ గాలనేమి. 200

క॥ వరుణాస్త్రమేసి తద్ఘన। తరవర్షమునాపి యార్చితాకినవడి సం
గరభూమివిడిచి వారలు। హరిహాయుఁజేరంగనరుగ నదిగనివిబుధుల్.

క॥ పెదవులుదడుపుచు బెగడుచుఁ
గదనంబునుఁజేయుటుడిగి కడువడిఁజనుచోఁ
బదములు దొట్రువడంగా
గదాగ్రజునిజేరి మిగులగద్గదికముతోఁ. 202

సీ॥ సరసిజదళనేత్ర భరితమంథరగోత్ర కంధరనిభగాత్ర కావుకావు
తాపసస్తుతిపాత్ర దానవనీచైత్ర పావనచారిత్ర కావుకావు
శైలజాధిపమిత్ర శయనీయపటపత్రికంధిజాసుకళత్ర కావుకావు
కుజనద్రుకరపత్రి విజితశాత్రవగోత్ర కనకనేత్రా మిత్ర కావుకావు॥
కైటభసురద్విషజ్జైత్రి కావుకావు
కలితభవలతోగ్రలవిత్రి కావుకావు
ఖండితాసురీగళసూత్రి కావుకావు
కలుషతూలికానిలమిత్రి కావుకావు. 203

క॥ అని యనివారితదైన్యం। బున బెగడుచు "విష్ణవేనమోనమః" యనినె
మ్మనములవినుతించుచుఁగర।వనజములునిటలతటములపై నిడునంతక.

మ॥ సురసంఘాత మహాభ్రభీషణరిపుస్తోమంబుచే నిట్లు సం
గరరంగంబుననిల్వలేక వరదా కానంగదేయన్న శ్రీ
హరి వారింగని పిన్ననవ్వొలయధైర్యంబంపుఁడంచుక స్ఫుర
ద్గరుడస్కంధముమీఁదఁబొల్చి చనె దైత్యధ్వంసనోద్యోగియై. 205

గీ॥ అట్లు చనుదెంచుచుండిన హరిని జూచి
యతని వెనువెంటవచ్చు సురాళిఁజూచి
యసురసేనాధిపతులు గర్వాంధు లగుచుఁ
బరుగు రొక్కట నాతనిపైనిఁ గదిసి. 206

గీ॥ అంబురుహనాభ సురలుని! న్నాశ్రయించి
యజ్ఞముల హవిర్భాగంబు లందుచుందు
రింక నిన్నుజయించితిమేని వీరి
నందఱినిఁ జూఱఁగొందు మానందముననుు. 207

క॥ సురరిపు లిట్లుఘనార్భటి! నరవిందదళాక్షుఁదూలనాడుచుఁ గడిమిన్
శరవర్షంబులు గురియఁగ! హరియునుఁగడునలరెనంజనాద్రివిధమునన్.

వ॥ అప్పుడు. 209

సీ॥ మథనుండుడెబ్బదిమార్గణంబులు గుజంభుండెనిమిదిటిని ముప్పదేను
సాయకంబులునిమి జంభుండునలువది కఱకుటమ్ములునూటిఁగాలనేమి
యును శుంభుఁడఱువదిటినిమహిషాసురుండిరువదిశరముల నెనుబదేను
శస్త్రింబులనునిశాచరసైన్యభర్తయు వీఁకననేకులనేకబాణ॥
వృష్టిఁగురియించి కలఁప గోవిందుఁడలరి
నడుమఁదబ్బాణములను జూర్ణంబుజేసి
మఱియు నాటేసి యాటేసి కఱకుటమ్ము
లేసి చిందఱవందఱఁజేసె వారి. 210

గీ॥ మఱియు హరి కాలనేమిపై నురవణించి
గదనువైవంగ నదియుబెట్టిదముగఁబడి
వానిమణిమకుటము నుగ్గుగానొనర్చి
శిరమువ్రక్కలుసేయ మూర్ఛిల్లెనతఁడు. 211

వ॥ అయ్యవసరంబున. 212

గీ॥ వారిరుహనేత్రుఁడిట్లనె నోరిదనుజ!
బెగడకుండుము నిన్నుఁబోరిగొననిప్పు
డనఁగ వానిసారథి తేరినాక్షణంబ
వెలికిఁదోలఁగించె రక్కసు ల్వాలఁగుఁబడఁగ. 213

వ॥ అప్పుడు. 214

గీ॥ కినుక రెట్టింపఁ బట్టుఁగొట్ట నలిజేగు
తేనెటీగలగుమిఁబోలె దిక్చయముల
నసితకేతుపటద్యుతులలర సప్త
వింశతిసహస్రసైన్యపు ల్విష్ణుఁబొడివి. 215

సీ॥ అంపసోనలుగురియింప నాతండు గో
పోద్దీపితుండయిహుంకరించి
నడుమఁదచ్ఛరములఁబొడిపొడిగాఁజేసి
నిమినిరువదిసాయకముల నొంచి
మథనునిముప్పదిమార్గణంబులఁదూల్చి
మహిషునినొకకోలమదమడంచి
షోడశశరములశుంభునినొప్పించి
జంభునైదమ్ములఁజకితుఁజేసి॥
మఱియు మూడేసి మూడేసి మార్గణములు
బఱపి తక్కినయూథపావళులనెల్ల
మూర్ఛఁబడఁజేసి చిఱునవ్వు మొలకలెత్తఁ
బాంచజన్యంబుఁబూరించెఁ బగతులదర. 216

గీ॥ అంతనిమి విష్ణునెదిరింప హరియు విపుల
రోషమునవింటఁగూర్చి నరోపమును మ
హిషుఁడుదునిమె జంభుండు ఖగేశునొంచె
నిగ్గతిఁ బరస్పరజయేచ్ఛ లెదలఁబొడల. 217

క॥ శరవర్షముఁగురియు నిశాచరులంగని మందహాసచంచన్ముఖుఁడై
హరి లీలన్ నానావిధ శరములుబరగించె దైత్యసైన్యంబులపై. 218

గీ॥ కోలుమసఁగి శ్రీహరి దైత్యకోటినెల్ల
నేలకునుఁ గోలకునుఁదేఁగ నిమి మొదలుగ
రాత్రిచరు లేమిఁదోఁచక భ్రమానువడుటఁ
గాంచి రణమునకేతెంచె గ్రసనుఁడపుడు. 219

కం॥ చిచ్చులకుఁబోవుశలభం। బచ్చుగహరిఁదాఁకిదైత్యుఁడమ్ములుగురియన్
లచ్చిమగఁడుదునిమెను వై। యచ్చుగులుఁబొంగ నాశరావళినెల్లన్. 220

కం॥ గరుడునినిటలంబున నొక। శరమేయఁగ నడుమ దానిఁ జక్రిదునిమెశ్రీ
హరియొకబలునారసమే। యరాక్షసుఁడుదానిఁదునిమె నక్రమలీలన్.

వ॥ అయ్యవసరంబున. 222

మ॥ ధరణీచక్రముదిర్దిరందిరిగె దిగ్దంతీంద్రముల్ క్రుంగె భా
స్కరతేజస్స్ఫురణంబుమాసె జలధుల్కల్లోలమైపొల్చెన
య్యురగేంద్రుండుజలించె భూధరచయంబుల్లూఁతలూఁగె న్వెసన్
హరిపై దానవసైన్యపాలకుఁడు బ్రహ్మాస్త్రంబుసంధించినన్. 223

వ॥ ఇట్లు సువిహితసంధానుండై యతం డమ్మహనీయాస్త్రంబుఁ బ్రయో
గించిన. 224

గీ॥ స్వాంతమందు సందియము రవంతయేనిఁ
బొంద కిందిరారమణుండు మందహాస
కందళితసుందరముఖారవిందుఁడగుచుఁ
దునిమెనమ్మహనీయాస్త్రమును శరముల. 225

గీ॥ అత్తెఱంగునఁదునిమి శ్రీహరి సమంత్ర
కముగ దండాస్త్రమునుబ్రయోగంబొనర్ప
నసురసేనాధిపతియు నారాయణాస్త్ర
మునుబ్రయోగించి తునిమె దాని నవలీల. 226

మ॥ వెరవారంగ్రసనాసురుండు జలముల్ బీరంబు వాటిల్ల భూ
ధరముల్డీకొనఁబోవుబల్తగరుచందంబొప్పఁగా నిందిరా
వరునిందాఁకి శరంబులంగురియ భాస్వత్తేజుఁడై పంకజో
దరుఁడవ్వేళనువైచెఁ దోషితసుధాంధశ్చక్రమున్ జక్రమున్. 227

గీ॥ అపుడు చక్రంబు సూత రథ్య రథ కేత
నములఁ బరిమార్చిదైత్యసేనానిఁద్రుంప
నతనిశిరముఁ గబంధంబు క్షితిఁబడె ఫణి
పతి యవనతభోగుఁడయి ఫూత్కృతులొనర్ప. 228

ఆ-వె॥ వానిపాటుజూచి దానవుల్ప్రాణంబు
లేనిబొందివ్రాలె బ్రమనుపడఁగ
శుంభుఁడు నిమియు మహిషుఁడు హరిఁదాఁకిరి
దంతినడ్డఁబోవు తగరులట్లు. 229

క॥ ఆశీవిషోపమంబగు। నాశుగవర్షంబుఁగురియు చయ్యెడల హృషీ
కేశుంబొదివిన నాతం। డాశరజాలంబుఁద్రూల్చె నశ్రమలీలన్. 230

వ॥ అంత. 231

ఉ॥ అంతకుఁగైవడి న్మథనుఁ డభ్రముబ్రక్కలుగాఁగ నార్చుచుం
గుంతముఁ గేలఁదాలిచి ముకుందునిపై నడరంగ నారమా
కాంతుఁడు బిన్ననవ్వులయఁగాలునివీటికివానినంపి దు
ర్దాంతత నొత్తె సంక్షుభితదానవసైన్యముఁ బాంచజన్యమున్. 232

క॥ అదిగని నిమిగదఁగొని సో। న్మదుఁడై పుచ్ఛంబుఁద్రొక్కినఫణి తెఱఁగునన్
బెదవులుగఱచుచు రోజుచు। గదాగ్రజునిఁదాఁకియుగ్రభగ పతిని నొంపన్.

సీ॥ ఉర్వీధరములనుజ్ఝూతలూఁగఁగఁజేయు పక్షానిలంబుచేఁ బగరఁదూల్చి
యులవజ్రసన్నిభంబైన తుండంబున దోషాచరులమెడ ల్దునిమివైచి
చిఱువాఁడినఖములచేఁ బొలదిండిమేనులనుండి నల్లజిప్పిలఁగఁ జీల్చి
క్రూరరాక్షసకోటిగొఱకజుట్టులఁబట్టి యంబుధిలోఁ బడునట్లువివ్వి॥
మారిమసఁగి జగంబులమట్టుబెట్టు
చందమున బూర్వదేవతాబృందములను
వైనతేయుండు జిందఱవందఱగను
నర్చి గగనంబువగులంగఁ బేర్చియార్చె. 234

వ॥ అయ్యవసరంబున. 235

గీ॥ శుంభుఁడును మహిషుఁడును విజృంభితులయి
విహగగమనునిపై శరవృష్టిఁగురియ
నాతఁ డనిలాస్త్రమును మార్వియందుఁగూర్చి
విడువ నది వారలనుదూల్చెఁ గడలతుదకు. 236

వ॥ అప్పుడు. 237

క॥ నిమిగ దయనుజంభుఁడుకుం।తముఁగొనిగరుడునిరమాధినాథుని నొంపన్
గమలాక్షుఁడుఖగపతిసహి।తముగఁ బ్రధనభూమివిడిచితడబడఁబడుచున్.

క॥ సురగణములుజింతిల్ల న
మరశాత్రవులుబ్బియార్వ మధుమథనుఁడు స
త్వరముగఁ బరుఁగిడఁజొచ్చెను
శరములఁగురియుచును నిమియుజంభుఁడు దఱుమన్. 239

క॥ అంతట విబుధులు లక్ష్మీ। కాంతుని జేరంగనరిగి కలితశుభగుణ
స్వాంతా! యిటునీసత్త్వముఁ। జింతింపక లాఘవంబు సేయందగునే?

క॥ సదయుఁడ! నీవీదైత్యులఁ। గదనంబునఁ దునుమవేని కలుషాత్మకులై
యెదిరించి ముజ్జగములకు। నెదశల్యంబగుచు నుండరే? తలపోయన్.

గీ॥ ముజ్జగంబుల కిబ్బంది మొనసిచేయు। నట్టిమధుకైటభులఁబట్టిమట్టుఁబెట్టి
నట్టి జగజెట్టి వీ వళయంగ నిప్పు। డిట్టి తెఱఁగైన నింక మా కేదిదిక్కు.

క॥ అనవిని శ్రీదయితుఁడుమో।మునఁజిఱునగవంకురింపఁబురుహూతున కి
ట్లనియె నుపాయంబునఁగా। నినిశాటులఁగెల్చుటరిది నిక్కముగాఁగన్.

గీ॥ సప్తదినముల శిశువుచేఁ జచ్చుఁ దార
కుండు గావున వానినిగుహుఁడు హస్తి
దనుజునిఁ గపాలి దునుముదు రనిమిషేంద్ర!
జంభుఁ బరిమార్పుమీవును సరభసమున. 244

గీ॥ మఱియుఁ దక్కినదైత్యుల మట్టుబెట్టు
దురు దిగీశులు గావున దురముసేయఁ
జనుము నీ వేను సైన్యపృష్టంబుగాచు
చుందుననిపల్కినవిని సంక్రందనుండు. 245

వ॥ అమరగణంబులు బరివేష్టింప నైరావతారూఢుండై రయంబున దురం
బున కరుదెంచినం గని గజాసురుండు రోషభీషణాకారుండై. 246

సీ॥ దంభోళిసన్నిభ దంతఘట్టనలచే సిద్ధుల మేనులు జీల్చిచీల్చి
కాలదండసమాన కరతాడనంబులఁ గిన్నరవరులను గెడపిగెడపి

బ్రహ్మాండభాండంబు వగులంగనార్చుచు సాధ్యులఁగాలిచేఁజమరిచమరి
శూలతుల్యంబగువాలంబుఁద్రిప్పుచు గుహ్యకులనుఁబట్టి కొట్టికొట్టి॥
కలశవార్ధిని మందర క్ష్మాధరంబు
గలఁచు తెఱఁగునఁ దుషితులఁ గలపికలపి
తొడరి భాస్వరులనుఁబాఱఁ దోలితోలి
యసమ రణకేళిసలిపె న య్యసురవిభుఁడు. 247

క॥ అంతట రుద్రులు దమతమ । స్వాంతంబులఁగినిసి సంగరావనిలోనం
గుంతంబుల శూలంబుల। నింతింతలుగాఁగఁ బొడిచిరిభద్రై త్యేంద్రున్

గీ॥ ఆయెడఁ గపాలి క్రోధఘూర్ణాయమాన
మానసుండయి వానిచర్మంబును దన
కుఁ బరిధానంబుఁగాఁ జేసికొనఁగఁ గాంచి
నిమి గజారూఢుఁడై దాఁకె నమరవిభుని. 249

ఆ-వె॥ వానిగజమునరసి వజ్రిగజమువాఱఁ
ద్రిదశవిభుఁడు మోముఁద్రిప్పిగదను
వైచె నదియుఁ బిడుగువడువునఁదాఁకిన
మ్రొగ్గతిల్లఁబడియె నగ్గజంబు. 250

క॥ కరి బీరముచెడ నిమి ము। ద్గరముంగొని వెల్ల యేనికను నొంపఁగ సం
గరతలము విడిచిపాఱెను।సురవిభునిగజంబు రక్కసులుముదమందన్.

ఉ॥ అంతట యక్షభర్త విలయాంతకుఁగై వడి రోషయుక్తుఁడై
కుంతముఁగేలఁబూని నిమికుంజరముం జదియంగఁగొట్ట దు
ర్దాంతపరాక్రముండగుచు దానవుఁడంతటబీరువ్రాక న
త్యంతరయంబునం గదిసి యార్చుచు నాతనిగ్రుద్దె ముష్టిచేన్. 252

గీ॥ ధనదుఁ డంతట రోషదందహ్యమాన
మానసుండయి గదచేత దానవేశ్వ
రుని శిరంబును బగులఁగొట్టిన ముదమున
సింహనాదంబు లప్డుజేసిరి విబుధులు. 253

క॥ జంభుఁడు గదాకలితదో। స్స్తంభుండై సురలగడచి శక్రునిపై సం
రంభంబునఁదాఁకెను మద। కుంభీంద్రునిఁదాఁకఁబోవు కుంభీంద్రుగతిన్.

ఆ–వె॥ గుగ్గిలంబువ్రాయ భగ్గుభగ్గనమండు
నగ్నివ్రాలె నింద్రుఁ డడరి వాని
చేతనున్నగదను జిదురుపలుగఁగొట్ట
విబుధవైరి బాణవృష్టిఁ గురిసె. 255

ఉ॥ సాయక పాకశాసనుఁడు భల్లముల న్నిగిడించుచుండి దై
తేయుని విల్లుద్రుంపఁగ మదింబెగడొందక యుబ్బి వాఁడు బ
ల్గాయలఁజొచ్చి యంబరతలం బద్రువంగనునార్చి తీవ్రతన్
సాయకవర్షముంగురియ స్వర్పతిముఖ్యులు భీతచిత్తులై. 256

ఆ–వె॥ బ్రమానువడుటఁగాంచి మాధవుండనె నింద్ర!
వీఁ డలంతిఁబోవువాఁడు గాఁడు
బరగ వీనిమీఁద బ్రహ్మాస్త్రము సమంత్ర
కముగ వైచి మనుపు మమరవరుల. 257

వ॥ అనిన సముత్సుకుండగుచు. 258

గీ॥ అనిమిషేంద్రుండు బ్రహ్మాస్త్రమును సమంత్ర
కముగసంధించి విడువ భీమముగ నదియు
నసురవీరులఁ బదికోట్లను సమయించి
జంభుఁ బరిమార్చె నొక నిముసంబులోన, 259

వ॥ అయ్యవసరంబున. 260

క॥ పేరుగల జోదులెల్లను। బీరముసెడిపాఱుటయునుఁ బిఱుదివియ కనిం
బోరాడి నీల్గుటయుఁ గని। తారకుఁ డతిరోషదీప్త తామ్రాక్షుండై.

సీ॥ వెలయుఁ జతురశీతిభేద కంబుకులోద్భ
వులు నైదుకోట్ల మౌర్వ్యులును రెండు
కోట్లకాలకు లాఱుకోట్ల దౌహృదులును
గోట్యర్బుదాసుర కులజనితులు

వీరుతా షడశీతిభేద దైత్యకులసం
జాతులు శతకోటి ధేతధూమ్ర
కులసంభవులు మూఁడుకోట్లసంఖ్యకుఁదగు
కాలకేయాది రాక్షసగణంబు॥
లెల్ల నాయాజ్ఞఁదప్పక యీక్షణంబ
సమరమునకు సన్నద్ధులై తమతమ నిజ
సేనలనుగూడి వేగవిచ్చేయవలయు
ననఁగ విని వారు సకలసైన్యముల తోడ. 26

గీ॥ రణకుతూహలు లమిత దుర్వారవిక్ర
మాన్వితులు బహుమాయావు లాయుఘోప
జీవితులు గామరూపులై చెలఁగునట్టి
రక్కసులు వచ్చిరపుడు పే రుక్కు-మిగిలి. 26

వ॥ అట్టియెడ. 26

ఉ॥ రాక్షసకోటిగొల్వఁగ మరంబొనదించెదు పెడ్క-ఁ దారకుం
డక్షయతూణధారియు మృగాధిపవిక్రమశాలియౌ విరూ
పాక్షకుమారుఁడేలెడు సుధాశనసైన్యముమీఁదికేగె హ
ర్యక్షకిశోరపాలిత వనావనిపైఁజను దంతిచాడ్పునన్. 26

సీ॥ కాలకేయాదులు గంధర్వులును గంబు
కులసముద్భవులును గుహ్యకులును
నక్తంచరులు సుధాంధస్సంచయంబును
ధేతధూమ్రకులులు విశ్వగణము
దాహ్రదావళియు విద్యాధరులును మార్యవ
లు నుదగ్రభాస్వరులును మహోగ్ర
కాలకులు బటుయక్షస్తోమమును దైత్య
వంశసంభవులును వసుగణంబు॥
విక్రమారంభసమయోగ్ర భీషణులయి
ఘోర సంగరస్థలిని దుర్వారబాణ

వర్ష ధారలు గురిసిరి ప్రళయవారి
ధరము లతివృష్టిఁగురియు చందమున నపుడు. 266

గీ॥ కోలుమసఁగి రుద్రులు శాతశూలహస్తు
లగుచు నక్తంచరాళి నాహవముఖమున
నేలకునుగోలకును దేఁగ మూలబలము
నపుడు పురికొల్పె రయమున నసురవిభుఁడు. 267

వ॥ అంత. 268

చ॥ రణమొనరించె నంబరచరద్విపదుద్యదనీకము న్మరు
ద్గణసుర సిద్ధ సాధ్య తుషితప్రక రాభ్రచరాహి విశ్వ చా
రణ వసు రుద్ర యక్షనికరంబు నధిజ్యధనుర్ధురీణతన్
రణదురు సింజినీ పటుతరధ్వని వీనుల వ్రక్కలింపఁగన్. 269

వ॥ ఇవ్విధంబున. 270

ఉ॥ మూలబలంబుఁ బేర్చి పట్టసముద్గర బాణ కృపాణ పాణియై
కోలుమసంగి స్వర్నిలయకోటిని సాయకవృష్టిఁగప్పి నా
భీలత వారలందునిమె విష్ణుపదంబు వడంగ నార్చుచున్
శూలముఁ గేలఁదాలిచి త్రిశూలి నట ద్భ్రుకటీ కరాళుఁడై 271

ఉ॥ నమ్మినజోదులెల్లను రణంబున నిట్లు త్రిశూలిచేతఁ బ్రా
ణమ్ములుగోలుపోవుటయు నాకులు శంఖములొత్తుట లక్కబం
ధమ్ము లసంఖ్యసంఖ్యలుగ నాట్యమొనర్చుట గంక గృధ్ర భూ
తమ్ములు నోలలాడుచు ముదంబునఁబేర్చుట గాంచి కిన్కతోన్ 272

ఉ॥ తారకుఁ డాజ్యసిక్తమగు దావహుతాశనులీల భీషణా
కారతఁబేర్చి నిర్జరనికాయములన్ శరవృష్టిఁగప్పుచుం
ధీరత రుద్రులందఱిమి దిక్కులువ్రక్కలుగాఁగనార్చి కా
సారముఁజొచ్చు మత్తకరిచందమున న్విహరించుచున్నెడన్. 273

గీ॥ చేయునదిలేక విన్ననై చేష్టలుడిగి
పౌరుషంబేది యున్న దేవతల దీన

దళకుఁజింతిల్లి పార్వతీతనయుఁడపుడు
ప్రళయకాలాంతకస్ఫూర్తిఁ బొలిచి నిలిచి. 274

గీ॥ దిక్కులద్రువంగ శేషాహి దిగులుజెంద
నబ్ధులేడును గల్లోలమై చెలంగ
జ్యానినాదంబు వెలయించి షణ్ముఖముల
నాత్మ నాభీలతరముగ నంతలోన. 275

సీ॥ ప్రస్ఫురద్రుక్ఛతారంబు నుద్ధతిని డీకొనఁబఱతెంచెడు కుధరముగతి
వింధ్యగర్వవిభంగ విస్ఫూర్తిమెఱసిన కలశజునెదిరించు జలధికరణిఁ
దీవ్రోరు నఖరదీధితి విరాజిల్లెడు కొదమసింహముదాఁకు కుంభిరీతి
నాభీలతరముఖ వ్యాఘ్రింబుపైఁదలఁపడఁబోవు మదవృషభంబుపగిది
సాళువముపై నిజనెడు క్రౌంచంబు పోల్కిఁ
బక్షిపతిమీఁదనేగు సర్పంబుమాడ్కి-
నంబరతలంబు వగులంగ నార్చుచునుఁగ
మారు నతిశీఘ్రమునఁదాఁకెఁ దారకుండు. 276

గీ॥ అట్లు రయమునఁదాఁకి యిట్లనియెఁ దార
కుండు వినుముగుమార! బాలుండవీవు
దోర్బలముపేర్మి హరి హరాదులను నైన
రణములో గెల్వఁజాలు కర్కశుఁడ నేను. 277

క॥ చెండాటగాదు సుమ్మురు! భండనమిదికాని యల్పబాలుఁడవగు నీ
దండయె ప్రాపుగఁగొని యా।ఖండలుఁడె దిఱంచెనన్నుగర్వోద్ధతుడై.

క॥ అని నీవ్రెక్కరుఁడవె కా। దనిమిషనాథునకు హరి హరాదులు దోడై
న నిమిషమాత్రములోనం। దునుముదు;నెకిరింత లేన్గతోనా చెల్లుఁ.

గీ॥ అనఁగ నిట్లనె శాంభవీతనయుఁ డపుడు
వినుముతారక! శాస్త్రార్థమును విని కని
మెఱుఁగకయె గర్వితుండవై యింతప్రొద్దు
నరయ నల్పవచస్కుండ వైతి వీవు. 280

క॥ కాలాహిడింభమున కా। భీలంబగు విషము లేదొ? వివరింపంగా
బాలార్కుని తేజము గనఁ। జాలుట కెవ్వరికి నైన శక్యంబగునొ?. 281

క॥ అల్పాక్షరమంత్రమున క। నల్పఫలంబబ్బకుండునా? యనుచు వడిం
గల్పాంతకునిగతి నళని। కల్పములగు తీవ్రసాయకంబులుబఱపెన్.
వ॥ అంత. 283
మ॥ ధనురాస్యంబు నిశాతసాయకలసద్దంష్ట్రాకరాళంబు న
స్త్రనఖాభీలము దీర్ఘఖడ్గరసనోదగ్రంబు నౌ రుద్రనం
దనహర్యక్షకిశోరముం గదిసి యుద్ధక్షోణిఁబోరాడె న
య్యనిమేషద్విపదింద్రనాగము గదాహస్తంబు శోభిల్లఁగన్. 284
క॥ ఇరువాగుజోదు లరయఁగ
దురమొనరించిరి గుహుండు దోషాచరుఁడున్
సురముని స రి గ మ ప ద ని
స్వరములొలయ మింటఁ బాటఁబాడుచు నాడన్. 285
సీ॥ తారకుం డిరువది క్రూరనారాచంబు
లనిమిష సేనాని తనువునందుఁ
జొనుప నాక్రౌంచారియును దీప్తశరశతం
బసురనాథునిమేన నడరఁజేయ
వజ్రాంగసుతుఁడు దీవ్రప్రదరంబులు
బదునెనిమిదిఁటిని బాహులేయు
పైఁబఱగింప నప్పార్వతీనందనుం
డాశుగత్రయము వరాంగిసుతుని॥
పేరురంబున నాటింపఁ బిట్టుకనలి
దనుజనాథుఁ డాగ్నేయాస్త్రమును సమంత్ర
కముగ వింటసంధించి శీఘ్రమునవిడువ
గుహుఁడు వరుణాస్త్రమునఁ దాని గొట్టలుడిపె. 286
చ॥ అలిగి నిశాచరేంద్రుఁ డపుడార్చుచు నగ్గుహుఁ దీవ్రబాణపం
క్తులఁ బొదువంగ నాతఁడు గుహుఁపాలిమై చిఱునవ్వుమోమునం
దొలయ గుణంబుదీటుచు మహోగ్రశరంబులఁ దద్రథాశ్వసూ
తులఁ బఱిమార్చి కేతనముద్రుంచె నిశాటులు బిచ్చలింపఁగన్. 287

క॥ విరథుఁడయి దనుజుఁ డొండొక
యరదముపై నెక్కి పటుశరావళిఁ గురియన్
శరజన్ముఁడు దచ్ఛరముల
నరనిమిషములోనఁ దునిమె నంపగములచేన్. 288

క॥ సురశాత్రవకులనాథుం। డురగాస్త్రము వైవ నదిమహోగ్రాకృతితో
శరజన్మునిపై నడరఁగ। గరుడాస్త్రము చేతఁ దునిమెఁ గ్రౌంచఘ్నుఁ డొగిన్.

క॥ దనుజేంద్రుఁడు కుపితుండై। ఘనబాణం బేయఁ దమముగప్పి జగంబె
ల్లనునిమిషమాత్రమున గుహుఁ। డనిలాస్త్రం బేసి దానినడఁగించె వెసన్.

సీ॥ అదిగని దితిజేంద్రుఁ డనిలాస్త్ర మేసిన
శైలాస్త్రమునఁ దూల్చె శంభుతనయుఁ
డసురనాథుండు శైలాస్త్రంబుఁ బఱుప శ
తారంబుచేతఁ గుమారుఁ డడచె
ననిమిషరిపుఁడు శతారంబు వైవ స
హస్రారమున దాని నడఁచె గుహుఁడు
దారకుం డొగి సహస్రారంబు నడరింప
సేనాని శూలంబుచేతఁ గెడపె॥
నంబరతలంబు వగులంగ నార్చి రాత్రి
చరుఁడు శూలంబు వైచిన షణ్ముఖుండు
వీఁక ఫాలనటద్భ్రుకుటీకరాళుఁ
డగుచుఁ బటుశక్తిచే దాని నపహరించె. 291

క॥ సాయకము లస్త్రసమితి వృ। థాయగుటకు బిట్టుకనలి దైత్యేంద్రుఁడు బ
ల్మాయలకుఁ జొచ్చి యంతటఁ। దోయదపథమునకు నెగసి తూపులు గురిసెన్.

సీ॥ రోదసీకుహరంబు భేదిల్లునట్లు బిట్టుఱుముచునుండు నొక్కొక్కమాఱు
నినరశ్మిదూఱుట కెడలేక శరవృష్టి నెత్తురుగాఁ గురియు నొక్కొక్కమాఱు
గిరుల నుఱ్ఱూతలూగింపఁజాలెడు గాడ్పు లొక్కటఁ బుట్టు నొక్కొక్కమాఱు
కనులకు మిఱుమిట్లు గడలుకొల్పుచును దట్టుఖ్లున మెఱయు నొక్కొక్కమాఱు
నెడ తెఱిపిలేక పడచేయుఁ బిడుగుగముల
దిక్కులన్నియుఁ బగుల నొక్కొక్కమాఱు

క్రౌంచభేదికి హార్ష విభ్రాంతు లొదవ
నట్లొనర్చెఁ దర్ఘనుఁడు మాయావి యగుచు. 293

వ॥ అట్టియెడ. 294

చ॥ అలిగి శివాకుమారుఁడు శరాసనమెక్కిడి దివ్యబాణపం
క్తులనిగిడించి తారకుని కోల్తలువాపఁగ వాఁడు దానవా
వళిననుపంగ వారపుడు బట్టుఁడు గట్టుఁడు గొట్టుఁడంచు బి
ట్టులివులు నింగిముట్టఁగ మహోగ్రత నగ్రుహుఁ జుట్టుముట్టినన్. 295

క॥ పెక్కండ్రతోడ నొక్కం। డక్కజముగఁ బోరెననిఁదదవసరమునబల్
రక్కసులను గాఱిల్లకు। స్రుక్కక గిరిజాకుమారసూర్యుఁడు నిలిచెన్.

వ॥ అంత. 297

క॥ వాలునుబలుకయుఁశూలిలయ। కాలునిచందమునఁజేర్చిక్రవ్యాదుల నా
భీలతరంబుగఁబోరిఁగొనె। నాలంబునశూలితనయుఁడరనిముసములోన్.

క॥ ముప్పదినాలుగులక్షలు । ముప్పదితొమ్మిదిసహస్రముల దానవులా
చొప్పుననీల్గుటఁగనుఁగొని।యప్పుడుబెగడొందిదానవాధిపుఁడెదలోన్.

క॥ ఆలమున నిట్లు భీకర । కాలునిచందమున సేనఁ గడువడిఁబఱువన్
బాలుఁడొకఁడు క్రీడించుట। కాలమువ్యత్యస్తమగుటఁగాదే? తలఁపన్.

క॥ శూలినిఁ జక్రిని నొర్వం । జాలిన వీరులగు దనుజసంఘము నని నీ
బాలుండుదెచ్చె నేలకు। గోలకు; బెండులుమునింగి గుండులు దేలెన్.

క॥ అనిచింతిల్లుచు నుండఁగ । దనుజేంద్రునికడకు నుగ్రదర్శనుఁ డుగ్రా
ననుఁడుగ్రవీర్యుఁడుమహా।హనుఁడుబిడాలుఁడుద్రినేత్రుఁడనుదనుజవరుల్.

క॥ చతురంగబలాన్వితులై । యతిరయమునఁజేరి దానవాధిప; సమర
క్షితి నిన్నుమాఱ్కొని చావక। శతధృతికైననుఁ జనంగ శక్యంబగునే?.

గీ॥ అనుచు మఱియునిట్లనిరి దైత్యాధినాథ!
సమరమున నీవుబెగడుట జలధియింక
నట్లగుటగాదె నిక్క మీ వలిగితేని
జగములన్నియు సంక్షోభము గనకున్నె?. 304

క॥ ఈలాఁగున వెతనొందెద। వేలా మాపాలితేఁడ యీాక్షణమున మా
కాలమునకు సెలవ్రసఁగుము।శూలిసుతునిఁద్రుంతుమిపుడె శుంభల్లీలన్.
సీ॥ అనిన నద్దనుజేంద్రుఁ డిట్లనియె మీార
లందఱును నాకుఁ బరమాప్తు లగుచునుండ
శూలికైన నాపయి వ్రేలుజూపఁదరమె ?
జనుఁడుశీఘ్రంబ తద్బాలుఁ జంపిరండు 306
వ॥ అనిపలికిన యనంతరంబ. 307
క॥ కావరమునఁ గన్గానక। దేవారులుగవియఁ బార్వతీప్రియతనయుం
డావిర్భూతాగ్రహుఁడై। పావకుఁ డడవింజరించు భంగిఁ జరించెన్.
వ॥ మఱియును. 309
సీ॥ ఆకరం బవికరం బష్టికం బాప్లుతం
బావిష్కృతంబు సవ్యాకర మపుడ
తప్రహారము ప్రథితము నాధికం బప
సవ్య సవ్యములగు జానువులును
భ్రాంతంబు ఛిన్నంబు ద్రాంతంబు మిశ్రితం
బును మానుషము గుడంబును విచిత్ర
మును లంబనము ధృతంబును దంగబాహువు
స్వస్తిక వేల్లిత వల్గితంబు॥
లొనర క్షిప్త నిర్మర్యాదలు నపసవ్య
కరములాదిగాఁ గలిగెడు ఘనతరప్రి
చారములు ముప్పదియురెండు సరభసమున
నసురసైన్యంబులకుఁ జూపె నపుడు గుహుఁడు. 310
వ॥ మఱియు నతండు సముద్భటరూపంబున నిశాటసైన్య పాటనపాటవం
బున దీపించి కోదండమెక్కిడి గుణంబుసారించి. 311
సీ॥ ఉగ్రదర్శనుని బాహువులునుఖండించి
యుగ్రాస్యు నెకకోల నుక్కడంచి
యుగ్రవీర్యుని యురంబుచ్చిపోవఁగనేసి
నిశితభల్లమునఁ ద్రినేత్రునడఁచి

యాశుగత్రియము మహాహనుని నిటాల
తలముననాటించి దర్పమడఁచి
ఘనతరబాణాష్టకమున బిడాలునిఁ
గంపితగాత్రునిఁగా నొనర్చి॥
సటలువెఱికిన ద్విరదశాసనకిశోర
కంబు జృంభించి మృగములఁ గలఁచుకరణి
దానవానీకమును శోణితప్రపూరి
తాంగులుగఁజేసి యంబర మద్రువనాత్చె. 312

వ॥ అంత. 313

క॥ ఆలీలఁ గుమారునిచే। నాలంబున మూర్ఛఁబడినయసురులఁగని యా
భీలత దనుజవిభుండొక। శూలముఁగొనియనికినడిచె శూలిసుతునిపై.

గీ॥ దుర్ధరుండు గరాళుండు దుర్ముఖుండు
బాష్కళుఁడు జత్కురుండను పారిపార్శ్వ
కులు రయంబునఁజని తారకుని నతిక్ర
మించి గుహునితో రణమొనరించి రపుడు. 315

శా॥ చండాంశుప్రతిమాన తేజుఁడగు క్రౌంచఘ్నుండు జృంభించి యు
ద్దండోద్య ద్భుజవిక్రమస్ఫురణ దైత్యధ్వంస నోద్యోగియై
కాండవ్రాతమునింపుచు న్విబుధసంఘంబు ల్నుతింపం ధనుః
పాండిత్యంబునఁ బారిపార్శ్వకుల దర్పం బుద్ధతి న్మాన్పఁగన్. 316

క॥ ఒడలులనిండను నెత్తురు। వెడలఁబెదవులెండనెదలబెగడుచు నడుగుల్
దడబడ రక్షోనాథుని। కడకుంబాఱెను సురారిగణము రయమునన్.

వ॥ అంత నద్దనుజేంద్రుండు వారలకిట్లనియె. 318

ఆ-వె॥ వీఁడు బాలకుండు వెలయంగ వీని దో
ర్వీర్యమనఁగనెంత శౌర్యమెంత
సత్త్వమెంత రణపటుత్వంబు శస్త్రపాం
డిత్య మెంత బెగడ దైత్యులార!. 319

ఆ-వె॥ వీనిబలమునకును వెఱవనేటికి మీరు
బిట్టుఁ జుట్టుముట్టి మట్టుఁబెట్టుఁ

డంతవచ్చెనేని యసిచేతఁద్రుంతు నే
సురలు భయముఁజెంది చూచుచుండ. 320

వ॥ అదియునుం గాకుండెనేని. 321

క॥ ఏలితి మెల్లజగంబులఁ। దోలితి మజ్జాక్షు హరుల దోర్బలమున నేఁ
డాలమునీ వెఱచిపాఱినఁ। గాలవశము రేపు గడవఁగాఁ దరమగునే?.

క॥ అనిమొన వెనుఁదీయక నీ। ల్గినవారికిఁదెఱవఁబడును లేఖపురీద్వా
రనికాయ మప్సరఃకుచ। కనకకలశపాళి రుచిర కందుకములగుఌ. 323

గీ॥ అనుచు నీరీతిఁబల్కు వజ్రాంగసుతుని
మాట లోకఁడైన వీనులనాటనీక
యొక్కఁ డరిగినదెనకు వేఱొకఁడు సనక
యసురగణము జెల్లాచెద రగుచుఁ బాఱె. 324

వ॥ అప్పుడు. 325

క॥ మాయలకుఁజొచ్చి రక్షో। నాయకుఁ డంబరపథంబున కెగసి విలస
త్సాయకజాలంబున। బిట్టేయుఁడు గిరిజాకుమారుఁ డెల నవ్వొలయఌ.

గీ॥ నడుమఁ దత్సాయకముల భిన్నముగఁజేసి
శబ్దభేది బాణములచే సరభసమున
నసురనాథుని జర్ఝరితాంగుఁ జేయ
వాఁడు రయమునఁ బలుకయు వాలుఁ గొనుచు. 327

ఉ॥ చెచ్చెర వచ్చుచుండఁగని సింహపరాక్రమశాలి షణ్ముఖుం
డిచ్చ నొకింతయేనిఁ జలియింపక నిట్లనిపల్కి నారి పై
యచ్చరశాత్రవాధమ! మ దస్త్రహుతాశనునందు వేఁచి నీ
బచ్చడిఁజేసి భూతతతి వాచవిఁ దీర్చెదనన్న నాతఁడుఌ. 328

గీ॥ కినుకరెట్టింపఁ గనుల నగ్గిమిడుఁగురులు
గురియ దానవమాయచేఁ గోలుమసఁగి
సురలు గన్పడకుండ నసురగణంబు
బుడమియీనినగతిఁ గనుపడఁగఁ జేసె. 329

వ॥ అంత నక్కుమారకంఠీరవుండు. 330

క॥ స్వాతీగతుఁడగు శుక్రుం। డే తెఱఁగున నధికవర్ష మిలఁ గురియంగాఁ
జేతోముదమునఁ జేయునొ। యా తెఱఁగునఁ గురిసె నప్పుడంబకవృష్టిన్.

ఆ-వె॥ వారు బీరువ్రాక పార్వతీతనయునిఁ
జుట్టుముట్టి కుంత శూల పరిఘ
ముసల తోమర ప్రముఖ సాధనంబులు
దెఱపిగల్గకుండఁ బఱపుటయును. 332

క॥ ధారాధరముల జంఝా। మారుత మొగిఁదూల్చుకరణి మనుజాశనులం
గ్రూరాస్త్రింబులఁదూల్చెఁగు। మారుఁడవక్రోగ్రవిక్రమస్ఫురణమునన్.

వ॥ అప్పుడు. 334

సీ॥ పాఱెడు నెత్తురుటేఱులలో డిగ్గి వేడుకతో నోల లాడునవియు
వెడదకొమ్ములు జీల్చి వడిగుండెకాయలు దినితిని గఱ్ఱునఁ ద్రేపునవియు
బుసబుస వెడలు ప్రేవులు నఱుతను దాల్చి పుఱ్ఱెల మెదడెల్ల జుఱ్ఱునవియు
నట్టలఁ గొని తెచ్చి పొట్టలో నంజుళ్లు మెడబంటిగాఁ గడుమెక్కునవియు॥
బెద్ద పీనుంగునకు రెండు పెనఁగి పెనఁగి
వంతువాసికిఁ దమలోనఁ బాలువ్రాక
దెబ్బలాడంగఁ దగవులు దీర్చునవియు
నగుచు గుములుగ భూతంబు లలరుచుండె. 335

వ॥ అంత వరాంగీనందనుండు శాంభవీనందనున కిట్లనియె. 336

గీ॥ భూరి సంగ్రామ ముఖమున భుజపరాక్ర
మంబు దీపింప నిన్ను భీమముగ గెల్చి
యెల్ల విబుధులు బౌరుషం బేదికొల్చు
చుండ స్వర్గమేలుదు జయాంకుండ నగుచు. 337

క॥ అనిపలికి వాలువైచినఁ। గని క్రౌంచఘ్నుండు నడుమ ఖండించెను దా
నిని రెండుగ నద్దనుజుఁడు। గినియుచు గదవిసరెఁ గార్తికేయునిమీఁదన్.

గీ॥ అదియుఁ బిడుగుకైవడిఁ బేర్చి యమరసైన్య
పాలకుని వాహనంబులపైని బడఁగ
నవియు మూర్ఛిల్లె నదిగని యభవతనయుఁ
డపుడు రోషారుణిత లోచనాబ్జుఁ డగుచు. 339

గద్యము॥ ఇది శ్రీపరమేశ్వర కరుణాకటాక్ష సమాసాదిత సహజపాండిత్య
సరసకవితాధురంధర ఘనయశోబంధు రాపస్తంబసూత్ర
భారద్వాజగోత్ర పేరూరుద్రావిడ శ్రోత్రియ
బ్రాహ్మణార్య సోమయాజి కులజలధిజైవాతృ
కారుణాచలేశ్వర తనయ నయగుణవిధేయ
లక్ష్మీనారాయణనామధేయ ప్రణీతంబైన
శివకథా సుధారసంబను మహా
ప్రబంధంబునందు
షష్ఠమాశ్వాసము
సర్వంబును సంపూర్ణము.



శ్రీ పరదేవతార్పణమస్తు.